
అక్టోబరు 2015
రూ. 15/-
చతుర
ఆకునూరి హాసన్
నవల
బ్యాచిలర్ ఆఫ్ లవ్ .... 6
నవలావలోకనం
ఇంద్రధనుస్సు .... 116

వారెవ్వా!

# బాబోయ్! కొబ్బరి పీతలు..!





ఒట్టి చేతులతో కొబ్బరిబోండాంను ఒలవడం మనుషులకే అతికష్టమైన పని. కానీ ఈ పనిని మనకంటే ఎంతో మెరుగ్గానే చేస్తున్నాయి ఆస్ట్రేలియా, మడగాస్కర్, మారిషస్ తదితర దీవుల్లో ఉండే భారీ పీతలు! ఈ పీతలు ఒక్కోటి నాలుగు కేజీల బరువుంటాయట! ఇసుకలో కలుగులు చేసుకుని జీవిస్తాయి. అవలీలగా కొబ్బరిబోండాలను ఒలుచుకుని తినేస్తుంటాయి ఇవి!

# భామనే.. సత్యభామనే..!



* మిస్ ఏసియా పసిఫిక్ టైటిల్‌ను గెలుచుకున్న భారతీయ మొట్టమొదటి మహిళ ఆమె.. ఇమామి, లిప్టన్ వంటి టీవీ ప్రకటనల్లోనూ మెరిసింది.. ఇంతకీ ఎవరా బాలీవుడ్ భామ..? ఆమె సౌందర్య రహస్యాలేంటి..?
* కీప్యాడ్‌ను ముట్టుకోకుండానే ఫోన్ లాక్ చేయడం ఎలా?
* నోరూరించే మైసూర్‌పాక్.. తయారు చేయడమెలా?

తెలుసుకోవాలనుకుంటున్నారా?

**చలో పేజీ నెం. 122.**

– సంపాదకులు

## 'నేరము - శిక్ష'!




చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారి 'స్వీయ చరిత్రము' ఆంధ్ర సాహిత్యంలో సమున్నత స్థానంలో నిలుస్తుంది. ఈ స్వీయ చరిత్రము రాయడానికి పూర్వరంగంలో పెద్ద కథే నడిచింది. ఎందరో ప్రముఖులు చిలకమర్తి వారిని జీవితచరిత్ర రాయమని కోరుతున్నా పంతులుగారు సుముఖత వెల్లడించేవారు కాదు. అందుకు ఆర్థిక కారణాలనే ప్రధానంగా పేర్కొనేవారు.

పిఠాపురము మహారాజావారు ఇచ్చే ముప్పది రూపాయలు నెలకంతా చాలక చిలకమర్తివారు ఎన్నో ఇబ్బందులు పడేవారు. 'స్వీయ చరిత్రము' అనే యజ్ఞం తలపెట్టడానికి మరొక ముప్పది రూపాయలు అవసరమని భావించేవారు. ఆ మొత్తం ప్రతినెలా ఇవ్వడానికి రాయసము వేంకటశివుడు గారు, విస్సా అప్పారావుగారు ముందుకు వచ్చారు.

**నిన్నటి నిజం**

దాంతో చిలకమర్తివారు 'స్వీయ చరిత్రము' నిర్విఘ్నంగా పూర్తిచేసి, తమ సహజ హాస్యగంభీర ధోరణిలో ఇలా చమత్కరించారు. "నా స్వీయ చరిత్రము రాయమని నన్ను నిర్బంధించిన నేరమునకు నేను శ్రీ రాయసము వేంకట శివుడుగారికి, శ్రీ విస్సా అప్పారావుగారికి ధన దండనము విధించాను. ఆ జరిమానా వారు నెల నెలకు చెల్లిస్తున్నారు. నేరము చేసిన వారికి శిక్ష ననుభవింపక దప్పునా?"

పరమేశ్వరుడు ఇచ్చిన జ్ఞాపకశక్తి ఒక్కటే ఆధారంగా చిలకమర్తివారు 'స్వీయ చరిత్రము' నాలుగు మాసముల ఇరువది నాలుగు దినములలో పూర్తిచేశారు. అప్పుడు పంతులుగారి వయసు డెబ్బదియైదు సంవత్సరాలు!

సేకరణ: **తాజీ ప్రసాద్**

# మనసున ఉన్నదీ...

★ సెప్టెంబరులో వెలువడిన నవల 'నదీ నరుడు' ఉత్కంఠభరితంగా సాగింది. సీతమ్మ గారి సంతానం ఎలా కోట్లకు పడగెత్తిందో హృద్యంగా మలిచారు. వేణుగోపాలరావు నేటి తరానికి ప్రతీక. నేటి ఫైనాన్స్ కంపెనీలకు కనువిప్పు ఈ నవల. 'కొత్తగాలి' కవితలు బాగుంటున్నాయి.

– *పక్కి బాలకృష్ణారావు*, విజయనగరం

★ పెద్దకథ 'అదేమన్నమాట' సమయోచితంగా ఉంది. వర్షాధార పంటలకు వాతావరణం అనుకూలంగా లేదు. పంటలు లేకపోవడం.. అప్పులు కట్టలేకపోవడం.. చివరికి రైతులు ఆత్మహత్యకు పాల్పడడం.. ఈ తరుణంలో ఈ కథ ప్రచురించడం అభినందనీయం.

– **కోలాహలం మోహనరాజు**,
మిర్యాలగూడ, నల్గొండ జిల్లా

★ మంచి కోరికలు, ఆలోచనలు ఉన్నపుడు మాత్రమే సమాజం మంచిగా మారుతుంది. చతుర అదే మార్గంలో ఉండడం ముదావహం. ఎన్నెన్నో విషయాలు, జోక్స్, కథలు అందిస్తూ మదిని ఆనందడోలికల్లో తేలియాడిస్తోంది.

– *ఎస్. సంతోష్‌కుమార్ ఆచార్య*,
కొడిమ్యాల, కరీంనగర్ జిల్లా

★ సింహప్రసాద్ నవల 'నదీ నరుడు' శైలి అనన్యంగా ఉంది. ఆయా సందర్భాలను బట్టి రాజకుమారి, మూర్తి, గౌతమిలతో వేణుగోపాలరావుకు కనువిప్పు కలిగించారు. నవల 'గోదావరి' ప్రవాహంలా సాగింది. అభినందనలు.

– *వెలగా రాజేశ్వరరావు*, తాళ్లపాలెం, విశాఖ

★ నవల 'నదీ నరుడు' కేవలం 'గోదావరి' గొప్పతనమే కాదు, పుట్టిపెరిగిన పల్లె ప్రాధాన్యత, అక్కడి నుండి బతుకుతెరువు కోసం వెళ్లి చాలాకాలం తర్వాత తిరిగొచ్చి అనుభవించిన 'బాల్య మధూళి'ని గుర్తుకుతెచ్చుకుని ఆనందపడడం- అద్భుతంగా చెప్పింది. కథలు, ఇతర శీర్షికలూ బాగున్నాయి.

– *దేవరాజు వెంకట నరసింహారావు*,
న్యూ మారుతీనగర్, హైదరాబాద్

★ ముద్దులొలికే ముఖచిత్రం, ఇంకా చదవాలనే కథలు, పైపెచ్చు 'కొత్తగాలి' వీచికలు..! ప్రతిదీ ఎంత చక్కగా ఉన్నాయో చెప్పలేను!

– **డా. ధరణి పార్థసారథి**,
నల్లకుంట, హైదరాబాద్

★ సెప్టెంబరు సంచిక ఎంతగానో అలరించింది. పెద్దకథ 'అదేమన్నమాట' రైతుల కష్టాలను కళ్లకి కట్టింది. సరైన దిగుబడులు రాక, రైతు కూలీగా మారుతున్న పరిణామాల్ని వివరించారు. రైతు దీనస్థితికి నిదర్శనంగా ఉంది. చతురసమ్'గతులు బాగున్నాయి. మా మదిలో కదిలే ఎన్నో ప్రశ్నలకు 'చతుర ప్ర.జ.'లో సమాధానాలు దొరుకుతున్నాయి.

– *పెయ్యాల శ్రీనివాస్*,
అలికాం, శ్రీకాకుళం జిల్లా

★ 'నవలావలోకనం'లో కొడవటిగంటి కుటుంబరావు నవల 'అనుభవం'పై సమీక్ష బాగుంది. 'పార్వతి' పాత్ర ఎంతోమందికి ఆదర్శంగా నిలిచింది. పెద్దకథ 'అదేమన్నమాట' రైతుల పరిస్థితులను వివరించింది.

– **టి.వి.డి.ఎస్. సీతారామారావు**, విజయవాడ

★ నది - నరుడు నవల ఊహించినంత గొప్పగా లేదు. ముగింపు నిరాశ కలిగించింది. విందుభోజనం అనుకొని మొదలుపెడితే చప్పిడి మెతుకులతో పూర్తిచేయాల్సి వచ్చింది.

– *జి. ప్రభాకర్*, తిరుపతి

★ ముద్దులొలికే చిన్నికృష్ణుడు ముఖచిత్రంగా వెలువడిన 'చతుర' చక్కని నవల అందించింది. వేణుగోపాలరావుతో పాటు అన్ని పాత్రలూ సహజమైనవే. పుట్టిపెరిగిన గ్రామాన్ని చిన్నచూపు చూసి స్వయంకృతాపరాధం వల్ల చివరికి ఆ ఊరు చేరి పశ్చాత్తాపంతో పునీతుడైన వేణుగోపాలరావులాంటి వాళ్లకు ఈ నవల గుణపాఠం. 'భామనే.. సత్యభామనే..!'లో క్రీడాకారిణులు చీరకట్టులో ఆనందింపజేశారు. ప్రముఖుల మంచిమాటలు 'అక్షరం' ఆచరించదగినవి.

– *కరణం శివానందరావు*, కర్నూలు

సంపుటి -38,
సంచిక - 9
453వ సంచిక,
పేజీలు : 132, అక్టోబరు 2015

# చతుర



★ ముఖచిత్రం : నటి విద్యాబాలన్
★ చివరి కవరు : మాస్టర్ నిహాల్‌స్కందన్
★ పుస్తకాలంకరణ : రాజు యూట

'ఏయ్ స్వప్నా!
మీ వరండా రూమ్ మా
ఫ్రెండ్‌కి కావాలని చెప్పానుగా.
వేరేవాళ్లకి ఇచ్చేశారేంటి?
నా మాటంటే లెక్కలేదా?'
దబాయించాడు సందీప్,
కాలేజీ నుండి ఇంటికి ఒంటరిగా
వస్తున్న స్వప్నను.
'ఓవర్ చేస్తున్నావేంటి?
మా ఇల్లు మా ఇష్టం'
ధైర్యం తెచ్చుకుని అంది స్వప్న.
'ఏంటీ..
చాలాదూరం వచ్చావే?
అవన్నీ నాకనవసరం.
రెండ్రోజుల్లో ఖాళీ చేయించి
మా ఫ్రెండుకివ్వాలి, అర్థమైందా?'
కోపంగా అన్నాడు సందీప్.
స్వప్న కళ్లలో నీళ్లు తిరిగాయి.
సరిగ్గా ఆ సమయంలో ఓ
యువకుడు వాళ్లదగ్గరకొచ్చాడు..
అతనెవరు?
అసలు స్వప్నకు సందీప్‌కు
సంబంధం ఏమిటి?
ప్రేమకు సరికొత్త
నిర్వచనం చెప్తూ
ఆసక్తిగా సాగే
**ఆకునూరి హాసన్**
నవల
**బ్యాచిలర్ ఆఫ్ లవ్**
6వ పేజీలో..



కనుచూపు మేర ఎవరూ లేరు..
బీచ్ అంతా నిర్జనంగా ఉంది..
అక్కడ బాలు, శిరీష మాత్రమే ఉన్నారు..!
సడన్‌గా ఏదో గుర్తొచ్చినట్టుగా బాలు ఎవరికో ఫోన్ చేస్తున్నాడు.
ఇంతలో శిరీష అలా జాగింగ్ చేస్తూ కొద్ది దూరం నడిచింది.
హఠాత్తుగా ఇద్దరు యువకులు బైక్ మీద
ఆమెను సమీపించారు.. వాళ్లామెను బైక్ మీద
కూర్చోబెట్టేందుకు ప్రయత్నిస్తున్నారు!
ఆమె వాళ్లను ప్రతిఘటిస్తూ తప్పించుకునేందుకు
పెనుగులాడుతోంది..
ఫోన్ కలవక తల తిప్పిన బాలు శిరీషను చూసి
కంగారుగా ఆమె దగ్గరకు వెళ్లాడు..
ఆ తర్వాతేమైంది? అసలు ఆ యువకులెవరు?
శిరీషను వాళ్ల నుండి బాలు కాపాడగలిగాడా?
ప్రేమికులకు దిశానిర్దేశం చేస్తూ ఆద్యంతం ఆసక్తిగా సాగే
ఆకునూరి హసన్ నవల
**బ్యాచిలర్ ఆఫ్ లవ్**
చతుర అక్టోబరు కానుక!

'హా య్ డియర్! ఎలా వున్నావ్? ఎన్నాళ్లయింది నిన్ను చూసి? నువ్వు ఉన్నప్పటికన్నా, ఇప్పుడే నీ జ్ఞాపకాలు ప్రతిక్షణమూ నాతో ఉంటున్నాయి. అనుక్షణమూ నిన్ను నా ముందు సజీవంగా నిలుపుతున్నాయి. నువ్వు ఈ లోకంలో లేవంటే.. ఎందుకో నమ్మబుద్ధి కావడం లేదు! క్షణికావేశంలో తీసుకున్న నిర్ణయం.. ఒకే ఒక్క క్షణం ఆలస్యమవ కూడదా? అని ఎన్ని లక్షలసార్లు అనుకుని బాధపడ్డానో? ఇద్దరమూ ఒకటిగా జీవించడం అసాధ్యమనే నిరాశతో అమాంతం జీవితాన్ని అంతం చేసుకోవాలనుకున్నాం! కానీ, విధి ఈ విషయంలో కూడా మనల్ని ఇలా విడదీస్తుందనుకోలేదు. నువ్వు ఈ లోకం నుంచి వెళ్ళిపోతే.. నేను మాత్రం జీవచ్ఛవంలా మిగిలాను ఇలా ఒంటరిగా! నువ్వులేని జీవితంలో, నీ జ్ఞాపకాలతో నిశ్శబ్దంగా నిత్యవేదన అనుభవిస్తూ, నిరీక్షణలో బతకాలని నాకు రాసి పెట్టి ఉందేమో? ? తీరని కోరికలతో అర్ధాంతరంగా చనిపోయిన వాళ్ళు ఆకాశంలో నక్షత్రాల్లా వెలుగుతుంటారని అంటారు. చీకటి ఆకాశంలోకి చూస్తూ.. ఏ నక్షత్రంలో నువ్వున్నావో అని, నక్షత్రాన్నుంచి, నక్షత్రానికి ఎంతగా వెదుకుతుంటానో!!

నీ అంత గాఢంగా, నిజాయితీగా నేను ప్రేమించలేదని, ప్రేమ పేరుతో నిన్ను బలి తీసుకున్నానని.. ఎందరో అన్నారు, నిందించారు. కానీ, నిన్ను ప్రాణంగా ప్రేమించాను కాబట్టే.. ఇలా బతికి ఉన్నాను. నా ఊపిరిగా, నా గుండె చేసే చప్పుడుగా.. ప్రాణం ఉన్నంత వరకూ నిన్ను ప్రాణంగా ప్రేమిస్తూనే ఉంటానని, నీ జ్ఞాపకాల్తోనే జీవిస్తున్నానని వీళ్ళకి, ఈ లోకానికి ఏం తెలుసు?

మనం ఆత్మహత్యకి పాల్పడకుండా ఉండి ఉంటే? ?

నువ్వు కూడా నాతోనే ఉండి ఉంటే? ?

కాలాన్ని వెనక్కి తిప్పగలిగితే ఎంత బాగుంటుంది!

ప్రేమతో- నీ నేను'

★ ★ ★

సెలవురోజు కాకపోవడంతో బీచ్‌లో ఎక్కువమంది టూరిస్టులు లేరు. దూర ప్రాంతాల నుంచి వచ్చిన కొన్ని కుటుంబాలవారు మాత్రం సముద్రపు ఒడ్డున వరుసగా ఉన్న చిన్నపడవల మీద కూర్చుని భోజనాలు చేస్తున్నారు. అలల మీద కేరింతలు కొడుతున్నారు. కొన్ని తినుబండారాల షాపులు, నాలుగైదు ఐస్‌క్రీమ్ బళ్ళు, తినుబండారాలు బుట్టల్లో అమ్మే ఆడవాళ్ళు ఉన్నారు.

బీచ్ రిసార్ట్‌లోని పార్కింగ్ ప్లేస్‌లో బైక్ పార్క్ చేశాక సముద్రపు ఒడ్డున చాలా దూరం నడిచారు శశాంక్, అనిత.

శశాంక్ ఫైనలియర్ డిగ్రీ చదువుతుంటే, అనిత అతనికి రెండేళ్ళ జూనియర్. ఇద్దరికీ ఏడాదిన్నరగా పరిచయం. అది స్నేహంగా, ఆ స్నేహం ప్రేమగా మారి సంవత్సరమైంది. శశాంక్ తల్లిదండ్రులకి ఒక్కడే కొడుకు. తల్లిదండ్రులిద్దరూ ఉద్యోగస్తులు. ఆస్తి, అంతస్తులు బాగానే ఉన్నాయి. అనితకి తల్లిదండ్రులు లేరు. ఒక్కడే తమ్ముడు. అతనికి పోలియో సోకింది. క్రచెస్‌తో నడుస్తుంటాడు. అక్కాతమ్ముళ్లు మేనమామ ఇంట్లో ఉంటున్నారు.

కాలేజీలో పరిచయమైన శశాంక్‌లో అనితకి, ఆమెలో అతనికీ ఏం కనిపించిదో? ఎందుకు ఒకరినొకరు విడదీయలేనంతగా ఇష్టపడ్డారో? అందరినీ వదిలి ఒకే జీవితంలా కలిసిపోవాలని గాఢంగాకోరుకున్నారు.

నా అన్నవాళ్ళు లేని అమ్మాయితో తమ కొడుకు తిరుగుతున్నాడని స్నేహితుల ద్వారా శశాంక్ తల్లిదండ్రులకి తెలిసింది. కొడుకుకి.. పనిలోపనిగా అనితకి కూడా గట్టి వార్నింగ్ ఇచ్చారు వాళ్ళు.

ఇద్దరూ కలిసినా, మాట్లాడుకున్నా ఊరు

కునేది లేదని చెప్పడంతో శశాంక్, అని తలు విలవిల్లాడిపోయారు.

కాలేజీలో ఒకరినొకరు చూసుకోవడం.. ఎవరూ చూడకుండా కొన్ని క్షణాలు మాట్లాడుకోవడం.. మిగిలిన రోజంతా దిగులుగా, జీవితాన్ని పోగొట్టుకున్నట్టుగా డిప్రెషన్‌లో కూరుకుపోవడం! ఇదీ.. అనితా, శశాంక్‌ల పరిస్థితి.

కొడుకుని ఏదోవిధంగా తమ గ్రిప్‌లోకి తెచ్చుకోవాలని శశాంక్ తల్లిదండ్రులు ప్రయత్నిస్తుంటే.. పొసెసివ్‌నెస్ కాస్తా.. శశాంక్‌లో అగ్రెసివ్ మనస్తత్వాన్ని నిదుర లేపడం మొదలుపెట్టింది.

అనిత లేకుండా బతకడం చావుతో సమానమని, ఆమెతో పెళ్ళికి తల్లిదండ్రులు ఎట్టి పరిస్థితుల్లోనూ ఒప్పుకోరని శశాంక్‌కి అర్థమయింది.

ఎవరికి వాళ్ళు, చావైనా, బతుకైనా కలిసే అని నిర్ణయించుకున్నారు చివరికి. పర్యవసానం.. ఈ రోజు ఇలా కాలేజీ క్లాస్ మధ్యలోనే ఫ్రెండ్ బైక్ తీసుకుని.. తనది అతనికిచ్చి.. శశాంక్, అనితలు బీచ్‌కి చేరు కున్నారు. తమతోపాటు తెచ్చుకున్న పురుగుమందు డబ్బాని అనిత హ్యాండ్‌బ్యా గ్‌లో జాగ్రత్తగా ఉంచి- బీచ్‌లోనే స్నాక్స్ తిన్నారు. మ్యాంగోజ్యూస్ బాటిల్‌ని కొని- ఇక చివరిసారి అన్నట్లుగా తడిసిన ఇసుక మీద నడవడం మొదలుపెట్టారు.

అప్పటికి సాయంత్రం అయింది.

ఒకరి చేతుల్లో ఒకరి చేతులు.. శశాంక్ భుజానికి తల ఆనించిన అనిత గుండెలో తుల్లో చిన్నప్పటి నుంచీ తల్లిదండ్రులు లేకుండా పెరిగిన ఒంటరి జీవితం.. ఒక్క సారిగా అగాధంలా కనిపించింది. శశాంక్‌తో జీవితం చివరివరకు.. అతని ప్రేమ చివరి శ్వాసవరకూ కావాలనిపించింది.

శశాంక్ కూడా అనిత నడుం చుట్టూ చెయ్యేశాడు. అతనిలోనూ దిగులు, దుఃఖం ఉప్పొంగడం తెలుస్తోంది. తల్లి దండ్రులకు ఇష్టం లేనందున అనితని కల

## కొత్తగాలి...

**పన్నెండేళ్లకొకసారి**
**పుణ్య స్నానాలు!**
**పాపాలతో కలుషితమయ్యే**
**పవిత్ర నదీ జలాలు!**

– తాజీ ప్రసాద్,
చెన్నై

వలేకపోయాడు! ఇంతకాలం రాత్రుళ్ళు, పగళ్ళు పడిన వేదన కళ్ళముందు నిలిచింది. అనితకి దూరమైతే ఆనందం, జీవితం లేవనిపించింది. చప్పున అనిత కళ్ళలోకి తదేకంగా చూశాడు. అప్పుడామె కళ్ళలో నీళ్ళు సుడులు తిరుగుతూ కనిపించాయి. కళ్ళలో గూడుకట్టుకున్న దిగులు.. ఇక బతకడం అనవసరమనే నిర్లిప్తత, నైరాశ్యం స్పష్టంగా కనిపించాయి.

ఒక్కసారిగా శశాంక్‌కి ఏడుపొచ్చింది. గట్టిగా హత్తుకున్నాడు. అతని గుండెల మీద తలవాల్చి బావురుమంది అనిత.

"అనిత..! అనిత..!"

శశాంక్ వణుకు గొంతు సముద్రపు హోరులో కలిసిపోయింది.

"శశాంక్..! శశాంక్..!" అనిత కంఠ స్వరం.. విరిగిపడిన అల లాగా తీరం నిండా పరుచుకుంది.

"మనం విడిపోయి బతకలేం! పెద్ద వాళ్ళు మనల్ని విడగొట్టడానికి ఉన్నారు. నువ్వు లేకుండా, నీకు దూరంగా వేరే జీవితం నాకు అక్ఖర్లేదు.." వెక్కిళ్ల మధ్య ఆపాడు శశాంక్.

"మనం కలిసి బతకడాన్ని అడ్డుకుంటే.. కలిసే చచ్చిపోదాం! దీన్ని ఎవరు ఆపగ లరు? ఈ లోకంలో మనం ఉండకూడదు శశాంక్! వచ్చే జన్మలో మళ్ళీ పుడదాం!

అప్పుడైనా ఏ అడ్డూ లేకుండా ఒకట వుదాం! వెళ్ళిపోదాం రా! ప్రేమనీ, ప్రేమిం చేవాళ్ళని విడదీసే శాడిస్టులు వీళ్ళు! మనం వీళ్ల మధ్య ఉండొద్దు ఇంక!!" అంటూ శశాంక్‌ని ముద్దుపెట్టుకుంది అనిత.

హ్యాండ్‌బ్యాగ్‌లోంచి పురుగుమందు డబ్బా బయటికి తీసింది. మ్యాంగోజ్యూస్ బాటిల్‌లోని జ్యూస్‌ని కొంచెం సిప్‌చేసి, శశాంక్‌కి ఇచ్చింది. అతనూ సిప్‌చేసి ఇచ్చాక.. పురుగుమందు డబ్బా మూత తెరిచింది అనిత.

ఆమె చేస్తున్న పనిని కళ్ళు విప్పార్చుకుని చూస్తున్న శశాంక్, జ్యూస్ బాటిల్‌ని తీసు కుని, మూత బిగించి, పురుగుమందు జ్యూస్‌లో పూర్తిగా కలిసేలా షేక్‌చేశాడు.

తర్వాత- ఓపెన్ చేశాడు.

విశాలమైన బీచ్! అలసట లేకుండా సముద్రపు అలలు ఎగిసిపడుతూ, హోరె త్తుతూ, తీరంలో పరుచుకుంటున్నాయి. తడిసిన ఇసుకలో.. వాళ్ళిద్దరి రూపాలు అస్పష్టంగా కనిపిస్తున్నాయి. అక్కడే జీవి తంలో చివరిక్షణాల్ని.. ఒకరినొకరు చూసుకుంటూ అలాగే కొన్నిక్షణాలు నిలబ డిపోయారు.

అంతే! శశాంక్ తన చేతిలోని బాటిల్‌ని పైకెత్తి, కళ్ళు మూసుకుని, చప్పున నాలుగు గుక్కలు వేశాడు. పురుగుమందు వాసన కడుపులో తిప్పింది.

శశాంక్ చేతిలోని బాటిల్‌ని తను తీసు కుని - అతనిలాగే సిప్‌చేసింది అనిత. ఘాటైన మందు వాసనకి కళ్ళలో నీళ్ళు వచ్చాయి. గొంతులో విషంలాగ దిగింది పురుగుమందు కలిపిన జ్యూస్.

కళ్ళు తిరుగుతున్నట్లుగా అనిపిం చడంతో.. ఒకచేత్తో శశాంక్‌ని పట్టుకుంది. మళ్ళీ అలాగే ఇద్దరూ ఒకరి తర్వాత ఒకరు, బాటిల్లోని జ్యూస్‌ని సిప్ చేశారు. ఇద్దరికీ ఎక్కిళ్ళు మొదలయ్యాయి. మరు క్షణం గిలగిలా కొట్టుకుంటూ, ఇసుకలో కుప్పకూలారు.

★ ★ ★

ఘాటైన పురుగుమందు వాసన ఊపిరి తిత్తుల్లోకి వెళ్ళడంతో, మగతలోంచి మత్తుగా కళ్ళుతెరిచింది అనిత.

ఇసుక పోసినట్లుగా కళ్ళు మండాయి. మసకమసకగా పరిసరాలు.. విశాలమైన గదిలో ఒక మూలగా ఉన్న బెడ్! పక్కనే ఆకుపచ్చ క్లాత్‌తో ఉన్న స్టాండ్! ఫ్లూయిడ్ అమర్చిన స్టాండ్! ఒక్కొక్కటిగా కనిపిం చాయి. అప్పుడు అనితకి అర్థమయింది.. తను హాస్పిటల్ బెడ్ మీద ఉన్నానని!

శరీరంలోకి ఎక్కుతున్న ఫ్లూయిడ్! గొంతులో నిప్పుకణికలా ఏదో మంట! గుండెలోంచి బాధ నరనరాన వ్యాపిం చింది. కొన్నిక్షణాలు శరీరమంతా ఎటో తేలిపోతున్నట్టుగా అనిపించింది.

కొన్నిక్షణాల్లో సర్దుకుంది! జరిగిందంతా గుర్తురావడం మొదలుపెట్టింది! బీచ్‌లో తడిసిన ఇసుకలో చేతులు పట్టుకుని నడుస్తూ, ఆగి, ఒకర్నొకరు గాఢంగా హత్తు కుని, పురుగుమందు కలిపిన జ్యూస్ తాగి, ఆత్మహత్యకి పాల్పడటం.. రీల్‌లా కనిపిం చింది. గుండె వేగంగా కొట్టుకోసాగింది.

తను.. ఇలా హాస్పిటల్ బెడ్ మీద..! ఇలా బతికి వుండి..! మరి.. మరి.. శశాంక్?? శశాంక్ ఎక్కడున్నాడు??

చేతులు కదుపుతూ "శశాంక్!" అని పిలుస్తూ గొంతు పెగుల్చుకుంది. స్టాండ్‌కి వేలాడుతున్న సెలైన్‌బాటిల్ కదిలి కింద పడింది.

మళ్ళీ "శశాంక్!" అని గొంతు చించు కుంటూ పిలిచింది! కానీ.. ఆ పిలుపు, తనకే వినిపించక పోవడంతో అనితకి ఏమీ అర్థం కాలేదు. ఇంతలో స్టాండ్ పడి న శబ్దానికి కర్టెన్‌కి రెండోవైపున ఉన్న స్టాఫ్‌నర్స్ వచ్చింది.

మంచం మీద గింజుకుంటూ లేవడానికి ప్రయత్నిస్తోంది అనిత. అప్పటిదాకా ఎక్క

# వాటికి ప్రేరణ సైంటిఫిక్ రచనలు!




మనం నిత్యం వాడే కొన్ని పరికరాలు సైన్స్ ఫిక్షన్ నుంచి, అలాంటి సినిమాల నుంచి ప్రభావితం చెంది కనిపెట్టినవే.

★ ఫ్లిప్‌ఫోన్: మధ్యకి మడిచే సెల్‌ఫోన్‌ని మోటరోలా కంపెనీ 1996లో మార్కెట్‌లోకి తెచ్చింది. స్టార్‌ట్రెక్ సైంటిఫిక్ టి.వి. సీరియల్‌లో 1970లలో ఇలాంటి ఫోన్‌ని చూసి దీన్ని రూపొందించారు. వైబ్రేషన్ మోడ్ కూడా దీంతోనే ఆరంభమైంది.



★ టేసర్ గన్: 1700లలో టేసర్ గన్ గురించి జ్యూల్స్‌వెర్న్ ఓ నవల్లో రాశాడు. తర్వాత స్టార్‌ట్రెక్‌లో థామస్ ఏ స్విఫ్ట్స్ ఎలక్ట్రానిక్ రైఫిల్‌ని చూసి ప్రభావితం చెంది జాక్ కవర్ టేసర్ గన్‌ని కనిపెట్టాడు. థామస్ ఏ స్విఫ్ట్స్ ఎలక్ట్రానిక్ రైఫిల్ షార్ట్ ఫామే టేసర్.

★ టాబ్లెట్: 'స్టార్‌ట్రెక్ - ది నెక్స్ట్ జనరేషన్' అనే సినిమాలో ప్యాడ్స్(పర్సనల్ ఏక్సెస్ డిస్‌ప్లే డివైస్)ని ప్రవేశ పెట్టారు. దాని ప్రభావంతో టాబ్లెట్ కంప్యూటర్‌ని కనిపెట్టారు.

★ యూనివర్సల్ ట్రాన్స్‌లేటర్: స్మార్ట్‌ఫోన్‌లో సరైన యాప్‌ని డౌన్‌లోడ్ చేసుకుంటే కొన్ని భాషల్లో ఇంగ్లీష్‌కి అనువాదం చదవచ్చు 1945లో ముర్రే లైన్‌స్టర్ 'ఫస్ట్ కాంటాక్ట్' అనే నవల్లో యూనివర్సల్ ట్రాన్స్‌లేటర్ గురించి రాశాడు. తర్వాత స్టార్‌ట్రెక్‌లో కూడా ఇలాంటి పరికరాన్ని చూశాక దీన్ని కనిపెట్టారు.

★ హోలోగ్రాఫిక్ కమ్యూనికేటర్: స్టార్‌వార్స్ సిరీస్‌లో మొదటిసారిగా దీన్ని ప్రదర్శించారు. ఆస్టెండో టెక్నాలజీస్‌కి చెందిన సైంటిస్టులు దాని ప్రభావంతో త్రీడి ఇమేజ్ ప్రొజెక్టర్‌ని కనిపెట్టారు. దాంతో ఇది సాధ్యమైంది. ప్రొజెక్టర్‌లోంచి మనిషి ఆకృతి త్రీడిలో ప్రదర్శించడంతో మనిషి ఎదురుగా ఉన్న భావన కలుగుతుంది.

★ హౌస్‌క్లీనింగ్ రోబోస్: 'ది జెట్సన్స్' అనే సైంటిఫిక్ టి.వి. డ్రామాలో తొలిసారిగా వీటిని ప్రదర్శించారు. ఐ రోబోస్ అనే కంపెనీ 2002లో తొలిసారిగా ఇంటిని శుభ్రపరిచే రోబోలను తయారుచేసింది.

డున్నారో మరి..! అనిత మేనమామ, మరొకరు బెడ్ దగ్గరికొచ్చి పైకి లేవకుండా అనితని అడ్డుకున్నారు.

"శశాంక్ ఎక్కడున్నాడు? అతనికి ఎలా వుంది?" గొంతులోని మాటలు.. పెదవి లోంచి శబ్దంలా బయటకి రాకపోవడాన్ని గుర్తించింది అనిత.

ఆమెకి ఏదో పొగమంచు లాంటిది విడిపోతున్నట్లు అనిపించింది.

కన్నీళ్ళు ధారగా రాసాగాయి.

మేనమామ ఆమెకు దగ్గరగా వంగి.. "నీకు.. గొంతులో ఏదో ప్రాబ్లమ్! ఓకల్ కార్డ్స్ దెబ్బతిన్నాయి! మాట్లాడాలని ప్రయత్నించకు.. అనితా!ప్లీజ్" అన్నాడు.

గింజుకునే ప్రయత్నమాపి, ఆయన వైపు నీళ్ళు నిండిన కళ్ళతో చూసింది అనిత.

'శశాంక్ ఎక్కడ?' అని సైగ చేసింది.

ఆమెకి ఏమని చెప్పాలో అర్థం కాక, చెమ్మగిల్లిన కళ్ళు తుడుచుకున్నాడాయన.

అనిత హృదయంలో ఏదో బాధ! నొప్పి! శశాంక్‌కి ఎలా వుందో? అసలు తనలాగ, ఇలా బతికున్నాడా? లేక..? లేక..?? అనే అనుమానం తొలుస్తున్నట్లుగా బాధ.

సరిగ్గా అప్పుడు అవతల వైపున.. రెండు మంచాల అవతల నుంచి ఒక్కసారిగా ఎవరో ఏడుస్తున్నట్లుగా.. అక్కడంతా

గందరగోళంగా మారింది.

అనిత మనసులో కీడు శంకించింది.

ఇంతలో ఇద్దరు ఆడవాళ్ళు అనిత బెడ్ వైపు దూసుకొచ్చారు. వాళ్లలో ఒకరిని శశాంక్ తల్లిగా గుర్తించింది అనిత. షాక్‌కు గురయినట్లు, ఆవిడనే చూస్తోంది.

అప్పుడు ఆమె.. "అన్యాయంగా నా బిడ్డని పొట్టని పెట్టుకున్నవుకదే! ప్రేమ.. ప్రేమ.. అని మాయచేసి నా బిడ్డ ప్రాణాలు మింగావు కదే రాక్షసీ! ఎంత మందిని ఇలా చంపుతావు కిలాడీదానా? నా బిడ్డకి అభం శుభం తెలీదు! నీ మూలానే ప్రాణాలు తీసుకున్నాడు. వాడిని మోసం చేసి, నువ్వు మందు తాగకుండా తప్పించుకున్నావు. నా బిడ్డ బలయ్యాడు! అనాథవైన నువ్వు చచ్చినా బాధపడేవాళ్ళు లేరు. మాకు కడుపు కోత పెట్టావుకదే..!" అంటూ శాపనార్థాలు పెడుతూ, ఏడుస్తూ తిడుతున్న శశాంక్ తల్లిని కొందరు అక్కడి నుంచి తీసుకెళ్ళారు.

హాస్పిటల్ బెడ్‌మీద, నిశ్చలంగా పడుకుని, కళ్ళు తెరుచుకుని, దుఃఖాన్ని గొంతులోనే మింగేసి, కుమిలిపోతున్న అనితని.. శశాంక్ బంధువులు వచ్చి దోషిలాగా, శశాంక్ చావుకి కారకురాలిగా చూడడం.. ఆమె గుండెని రంపంలా కోసింది.

తను.. తను.. చావకుండా ఎందుకు మిగిలింది? శశాంక్‌తో పాటూ తన ప్రాణం ఎందుకు పోలేదు? చేత్తో నుదుటి మీద కొట్టుకుంటూ.. హిస్టీరిక్‌గా ఏడవసాగింది అనిత. కేవలం కన్నీళ్లు మాత్రమే ప్రవహిస్తున్న అనిత గొంతులోంచి విషాదం, దుఃఖం.. ఒక నిశ్శబ్ద కెరటంలా తీరాన్ని తాకడం మాత్రమే మిగిలింది.

★ ★ ★

కాలేజీలోంచి బయటికి నడుస్తుంటే వెనక నుంచి "స్వప్నా! కాస్త ఆగు!" అని ఎవరో పిలవడంతో, వెనక్కి తిరిగి చూసింది స్వప్న.

క్లాస్‌మేట్ హిమజ రొప్పుతూ దగ్గరకొచ్చింది. "పద! ఇంటికేనా?" అంది.

"అవును!" బదులిచ్చింది స్వప్న.

"కాఫీషాప్‌లో జస్ట్ పది నిమిషాలు.. ఇంపార్టెంట్ విషయం చెప్పాలి" అంటూ రోడ్డుకి అవతల వైపున ఉన్న కాఫీషాప్‌కి దారితీసింది హిమజ.

లోపలికెళ్లి కార్నర్ టేబుల్ ముందు కూర్చుని, బేరర్‌కి ఆర్డర్ చెప్పి, "స్వప్నా! ఇందాక మహీ ప్రపోజ్ చేశాడు" ఎలాంటి ఉపోద్ఘాతం లేకుండా విషయం చెప్పింది హిమజ.

అర్థం కానట్టుగా చూసింది స్వప్న. "ప్రపోజ్ చేయడం ఏమిటే? దేనికి?" అడిగింది.

"అదేలే..! పెళ్ళిచేసుకుందాం! అని ప్రపోజ్ చేశాడు" చెప్పింది హిమజ.

"పెళ్లా? ఇంకా చదువు పూర్తికాలేదు. లైఫ్‌లో సెటిలవలేదు. అప్పుడే పెళ్లి ప్రపోజలా?" అయోమయంగా అంది స్వప్న.

స్వప్న భుజం మీద చేత్తోకొట్టి "క్యాంపస్ ప్లేస్‌మెంట్స్‌లో ఇద్దరమూ సెలక్టయ్యాం! ఇది ఫైనలియర్! అవగానే జాబ్స్ రెడీ! ఇక ప్రాబ్లం ఏముంది?" భుజాలు ఎగరేసింది హిమజ.

"ఊం! బాగుందే! అయినా ఇంట్లోవాళ్ళకి చెప్పకుండా? అవునూ మీరిద్దరూ అంతగా ఇష్టపడ్డారా? పెళ్ళి చేసుకునేంతగా ఒకరినొకరు అర్థం చేసుకున్నారా?" ఆమె కళ్ళలోకి చూస్తూ అగిడింది స్వప్న.

"యా! బాగా ఫ్రెండ్లీగా ఉంటాం కదే! నెక్స్ట్ పెళ్ళి చేసుకుంటాం అంతేగా! అయినా పేరెంట్స్ కంట్రోల్‌లో ఉండే నీకు ఇవన్నీ అర్థంకావులే!" అంది హిమజ.

"అదికాదు నేననేది..! ఇష్టపడడం, ఫ్రెండ్లీగా ఉండడం.. ఇవి పెళ్ళి చేసుకునేందుకు.. ఐమీన్..! కలిసి బతకడానికి సరిపోతాయా? అని" అంటూ బేరర్ టేబుల్ మీద పెట్టిన కాఫీ సిప్ చేసింది స్వప్న.

# పోస్ట్ పెట్టనేల? తిట్టించుకోనేల?

చతుర సమగతులు

ఇంటర్నెట్‌లో ఎక్కువమంది ద్వేషించే కొందరి గురించి.

★ మెలిస్సా బాక్‌మేన్ : టి.వి. ప్రెజెంటరైన ఈమె వేటగత్తె. సౌతాఫ్రికాలో ఓ సింహాన్ని చంపి, దాన్ని పక్కన కూర్చుని తీసుకున్న ఫొటోని ఇంటర్నెట్‌లో పెట్టింది. జంతు సంరక్షణ సంఘాలు ఆమె చర్యని నిరసించాయి. ఈ చర్యకు సౌతాఫ్రికా ఆమెని తమ దేశం నుంచి వెళ్లగొట్టింది.



★ హంటర్‌మూర్: తాము ద్వేషించే వారి నగ్న చిత్రాలను వారి అనుమతి లేకుండా పోస్ట్ చేసేందుకు ఇతను ఓ వెబ్‌సైట్‌ని నడుపుతున్నాడు.

★ గ్రీస్ ఎథీనా మిడిల్ స్కూల్‌లో చదివే ఏడో తరగతి విద్యార్థులు స్కూల్ బస్‌లో 68 ఏళ్ల మానిటర్ మిసెస్ క్లెయిన్‌ని ర్యాగ్ చేసిన వీడియోలను జూన్ 2012లో ఇంటర్నెట్‌లో పెట్టారు. వాటిని ప్రపంచవ్యాప్తంగా వీక్షించడంతో ఆ విద్యార్థులని అంతా ద్వేషించారు.

★ టైలర్ ఛాప్‌మేన్(27) అనే ఫ్లోరిడాకు చెందిన మహిళ జూన్ 2013లో డన్‌కిన్‌డోనట్స్ అనే రెస్టారెంట్‌కి వెళ్లి గతంలో కొన్న దానికి బిల్లు ఇవ్వలేదని పోట్లాడింది. అక్కడి ఉద్యోగులను వర్గ వివక్షతతో కూడిన బూతులు తిట్టింది. ఓ కస్టమర్ సెల్‌ఫోన్‌తో రికార్డు చేసి యూట్యూబులో పెట్టడంతో ఆమెని అంతా అసహ్యించుకున్నారు.

★ ఏమేలా ఫార్మన్: మార్చి 2011లో 21 ఏళ్ల ఈ ఫ్లోరిడా యువతి జపాన్‌లో వచ్చిన భూకంపం, సునామీలకి సంతోషాన్ని వ్యక్తం చేస్తూ, తను దేవుణ్ని ప్రార్థించినందుకే అవి వచ్చాయని వీడియో రికార్డింగ్ పెట్టింది. లక్షా ఐదు వేలమందికి పైగా ఆమెని అసహ్యించుకుని మెసేజ్ పెట్టారు.

★ మేరీ స్నెల్(44), బ్రిటన్ ఎంజెల్(21) అనే తల్లీ కొడుకులు ఓ కుక్కపిల్లని ప్లాస్టిక్ ఫ్రీజర్ బ్యాగులో ఉంచి ఫొటో తీసి ఫేస్‌బుక్‌లో పోస్ట్ చేశారు. చాలామంది వీరి దాష్టీకాన్ని అసహ్యించుకుంటూ ఫేస్‌బుక్‌లో మెసేజ్ పెట్టారు.

"ఎందుకు సరిపోవు?" పెదవి విరిచిన హిమజ, సెల్‌ఫోన్ రింగవడంతో ఎవరితోనో మాట్లాడసాగింది.

ఆమెనే చూస్తున్న స్వప్నకి.. అంతా అయోమయంగా అనిపించింది.

ఫ్రెండ్స్‌గా ఉండడం.. స్నేహం ఆకర్షణగా మారడం.. అది పెళ్లి ప్రపోజల్‌కి దారితీయడం.. ఇలా ఆలోచిస్తున్న స్వప్నకి.. ఎందుకో ఇల్లు, అమ్మా, నాన్న, గుర్తొచ్చారు. వెంటనే కాఫీకప్‌ని బల్లమీద పెట్టి "నేను వెళ్తాను! బై!" చెప్పి కాఫీషాప్ లోంచి బయటికి అడుగులేసింది స్వప్న.

వీళ్లిద్దరూ నేటితరం ప్రతినిధులు. విభిన్న మనస్తత్వాలు ఇద్దరివీ.

స్నేహం, ఆకర్షణ, ఇష్టం ఉంటే ఇద్దరు స్త్రీపురుషులు పెళ్లిచేసుకుని జీవితాంతం కలిసి ఉండగలరనే ధీమా! అసలు ఆ ఆలోచన కూడా మనసులోకి రానీయని ఈజీగోయింగ్ లైఫేమో ఒకరిది!

ఇలా కుదరదు.. ఇద్దరు వ్యక్తుల మధ్య ఇష్టం ప్రేమగా మారాలి. అది బలపడి, ఒకరు లేకపోతే మరొకరు జీవించలేనంత గాఢతని కలిగిస్తేనే జీవితాలు ముడి వేసుకోవాలనుకునే తత్వం మరొకరిది!

సిటీబస్‌లో కిటికీ పక్కసీట్‌లో కూర్చున్న స్వప్న, గాలికి ఎగురుతున్న ముంగు

రుల్ని సర్దుకుంటూ 'ప్రేమ చాలా చిత్ర మైన పదం' అనుకుంటూ, స్నేహితురాలి మాటలు గుర్తొచ్చి చిన్నగా నవ్వుకుంది.

★ ★ ★

రూమ్‌లో తనకి సంబంధించిన వస్తువులు అన్నీ సర్దుకున్నాక, మధ్యలో నిలబడి ఎలా వుందో చూసుకున్నాడు బాలు.

పెదవి విరిచి, టేబుల్ మీదున్న బుక్‌లోంచి ఒక పోస్టర్‌ని మడతలు విప్పాడు బాలు. ఆకాశంలో ఇంద్రధనుస్సు, విశాలమైన పచ్చిక మైదానం, మధ్యలో పూలగొడుగుని విప్పి, ముఖం కనిపించకుండా అటువైపు తిరిగి ఉన్న మోకాళ్ల దాటిన స్కర్ట్ ధరించిన అమ్మాయి ఉన్న పోస్టర్‌ని ఒక గోడకి టేప్‌తో అతికించాక- రూమ్‌లో అన్నీ సర్దాననిపించింది బాలుకి.

అక్కడికి చాలా దూరంలో ఉన్న చిన్న పట్టణం నుంచి వచ్చాడు బాలు. పుట్టి, బుద్ధితెలిసినప్పటి నుంచీ అరవైమంది అనాథ పిల్లల్లో ఒకడిగా పెరిగాడు. హాస్టల్ లో ఉంటూ ప్రొఫెషనల్ కోర్సు పూర్తిచేశాక సాఫ్ట్‌వేర్ కంపెనీలో మొదటి ఉద్యోగం. హాస్టల్ పిల్లలందరికీ దూరంగా ఇలా ఒంటరిగా ఈ నగరానికి వచ్చిన బాలు- ఈ రోజే సిటీలోని ఈ కాలనీలో ఒక ఇంటి వరండాగదిలో అద్దెకు దిగాడు.

ఇన్నాళ్లూ ఏ చీకూచింతా లేకుండా గడిపిన బాలుకి.. ఈ జనారణ్యంలో ఎందుకనో ఒంటరితనంగా అనిపించింది. తనవాళ్ళని వదిలి దూరంగా వచ్చినట్లు, ఏదో తెలీని దిగులు కలిగింది.

అంతలోనే ఆ ఫీలింగ్‌లోంచి బయటపడగలిగాడు.

సింగిల్‌కాట్ బెడ్‌మీద పడుకుని, సీలింగ్‌వైపు చూస్తుంటే.. సరిగ్గా అదే క్షణంలో దగ్గరికి వేసి ఉన్న రూమ్ తలుపులు తట్టిన చప్పుడు వినిపించింది.

చప్పున లేచి తలుపుతీసి చూస్తే, బయట వరండాలో ఇంటి ఓనర్ రంగనాథ్ తల్లి జానకమ్మ కనిపించింది.

"ఏంటయ్యా..! సామాను సర్దుకున్నావా? " ఓనర్ దర్పం చూపిస్తూ అంది.

"అయిందండీ!" బదులిచ్చాడు బాలు.

"నీ పేరేంటన్నావ్? " అడిగింది.

"బాలు" చెప్పాడు.

"సిగరెట్లు అవీ తాగకూడదు! టైమ్‌కి ఇంటికి వచ్చేయాలి! ఎవరినిపడితే వాళ్ళని ఫ్రెండ్స్ అంటూ రూమ్‌కి తీసుకురాకూడదు. ఇవన్నీ మా అబ్బాయి చెప్పాడుగా!" అంది జానకమ్మ.

చెప్పలేదన్నట్లుగా తల అడ్డంగా ఊపాడు బాలు.

"సరేలే! ఇప్పుడు నేను చెబుతున్నాకదా! అదీ విషయం! ఇంట్లో మనిషిలా కలిసిపోవాలి. అప్పుడప్పుడు నాకు కాస్త సాయం చేస్తుండాలి. టాబ్లెట్స్, అవీ తెప్పించుకుంటాను. కాదనకుండా తేవాలి! ఏంటి? అర్థమయిందా? " దబాయించింది జానకమ్మ.

నవ్వుతూ తలూపాడు బాలు.

"మా ఇంట్లో నాతోపాటూ కొడుకు, కోడలు.. నీ వయసుదే నా మనవరాలు స్వప్న.. మనవడు అనిల్.. వాడు హైస్కూల్‌లో నైన్త్‌క్లాస్. నీకు వాడివల్లే కాస్త ఇబ్బంది కలగొచ్చు. చిన్నాడు కదా! అల్లరి ఎక్కువ. ఫ్రెండ్‌షిప్ చేసుకో" ఇంట్లోవాళ్ళందరి బయోడేటా చెప్పింది జానకమ్మ.

మళ్ళీ నవ్వి ఊరుకున్నాడు బాలు.

"మరి మా గురించి చెప్పాకదా! మీరెంతమంది? నాన్న, అమ్మ ఏం చేస్తుంటారు? అన్నలు, అక్కాచెల్లెళ్లు ఎందరు? " ఆసక్తిగా అడిగింది ఆమె.

అప్పుడామెకి తను అనాథనని చెప్పాలా? వద్దా? అని కొన్నిక్షణాలు ఆగి "నేను అనాథ శరణాలయంలో పెరిగానండీ! అమ్మ, నాన్న ఎలా ఉంటారో కూడా తెలీని వయసులో అక్కడ చేరాను. నాతోపాటు

# ఉత్తమ సమీక్షకు ఉన్నత సోపానం!

## (పాఠకులకు నూటపదార్లు బహుమానం)

ఈ నెల చతుర ఆసాంతం చదివారు కదా? నవల, నవలావలోకనం, చతుర ప్ర.జ. ఇంకా ఇతరత్రా శీర్షికలు అన్నీ ఆస్వాదించారు కదా? అయితే ఇకనేం? మీకు నచ్చిన నవల/శీర్షికలు లేదా మొత్తం సంచికపై చతురలో అరపేజీ వచ్చేలా చక్కని సమీక్షను రాసి ఫొటోతో సహా పంపండి. ఉత్తమ సమీక్షకు రూ.116/-లు బహుమానం అందుకోండి. సమీక్షతోపాటు మీ పూర్తి చిరునామా ఫోన్ నెంబరు తప్పనిసరి! మీ సమీక్షలు మాకు చేరాల్సిన గడువు తేదీ 17.

– సంపాదకులు

నిబంధనలు : ఈ సమీక్షల ఎంపికలో తుదినిర్ణయం సంపాదకులదే. ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. 'ఉత్తమ సమీక్ష'కు ఎంపికకాని సమీక్షలకు వీలైతే 'మనసు ఉన్నదీ..' శీర్షికలో చోటు కల్పించే అవకాశం ఉంటుంది.

చిరునామా : సమీక్ష, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 82
ఫోన్ : 040 -23318181, Ex: 6658, 6532 e-mail: vipula.chatura@gmail.com

అరవైమంది పిల్లలు. వాళ్లే నాతోడపుట్టిన వాళ్లు" అన్నాడు.

ఇలా అంటున్నప్పుడు అతడి గొంతు బేస్‌వాయిస్‌గా మారడం గమనించిన జానకమ్మ తను ఇలా అడిగి పొరపాటు చేశానేమో అనుకుంది.

"సారీ బాబూ!" అని మాత్రం అంది.

"సారీ ఎందుకండీ? నిజం చెప్పాను! ఇలా మీలాంటి కుటుంబాన్ని దగ్గరగా చూస్తున్న నా కళ్ళకి నిండుగా ఉంటుంది" అన్నాడు.

"ఒకమాట చెబుతాను. ఇంకెప్పుడూ 'అనాథ' అనే మాట నీ నోట్లోంచి రాకూడదోయ్ బాలు! అక్కడ హాస్టల్లో అరవై మంది పిల్లలున్నారు నీకు. ఇక్కడ నేనూ, నా కుటుంబం ఉన్నాం! సరేనా? నువ్వా ఈ రోజు నుంచి మా ఫ్యామిలీలో మెంబర్వి!" అంటూ ఏదో గుర్తురాకూడనిది గుర్తొచ్చినట్లుగా కళ్ళలో నీళ్లు నిలిచినట్లయి, పైటచెంగుతో కళ్లు అద్దుకుంది జానకమ్మ.

ఆమెని చూస్తుంటే.. ఇంతవరకు ఎప్పుడూ చూడని అమ్మా, నాన్న గుర్తొచ్చారు బాలుకి.

అనాథ శరణాలయంలో పెరిగి, చదువుకుని, తన కాళ్ళమీద తను నిలబడగలిగాడు. ఇప్పుడు ఈ కొత్తజీవితం, కొత్తమనుషులు ఇంతకు ముందెప్పుడూ చూడని ఈ కుటుంబం.. ఇప్పుడు తను వాళ్ళలో ఒకడిగా కలవడం, అలా ఆశపడడం.. అంత మంచిది కాదు. తను ఎప్పటికీ అనాథే! అనుకున్నాడు బాలు.

★ ★ ★

హాస్పిటల్ నుంచి డిశ్చార్జ్ చేసే రోజున పోలీసులొచ్చి అనిత దగ్గర వాంగ్మూలం తీసుకున్నారు.

అప్పటికే ఆమె స్వరపేటిక దెబ్బతిని

మూగదైపోయిందని డాక్టర్లు నిర్ధారించారు.

కూల్‌డ్రింక్‌లో కలుపుకుని తాగిన పురుగుమందు స్వరపేటికలో సున్నితమైన భాగాల్ని ఎందుకూ పనికిరాకుండా చేసింది. కడుపులోకి వెళ్ళాల్సిన పురుగుమందు అక్కడే ఆగిపోయి- ఆమె ప్రాణాలకి బదులుగా 'మాట'ని తీసుకెళ్ళిపోయింది.

పోలీసులు అడిగిన ప్రశ్నలకి తెల్లకాగితం మీద సమాధానాలు రాసి సంతకం పెట్టింది అనిత.

శశాంక్ తల్లిదండ్రులు తమ ప్రేమని అంగీకరించనందున కలిసి బతికే అవకాశం లేదనే నిరాశతో, కలిసి చనిపోదామని కూల్‌డ్రింక్‌లో పురుగుమందు కలుపుకొని తాగామని, అప్పటి సంఘటనని మళ్ళీ కళ్ళముందుకి తెచ్చుకుని తన మాటల్ని అక్షరాలుగా రాసింది అనిత.

ఇలా స్టేట్‌మెంట్ రాస్తున్నప్పుడు అనిత కళ్ళలో విగతజీవుడైన శశాంక్.. తను ఇలా ఈ లోకంలో మిగిలి, అతను మాత్రం ఎప్పటికీ తిరిగిరాని లోకాలకి వెళ్ళిపోవడం.. అతని సాంగత్యం, ప్రేమ.. అన్నీ కనిపించాయి.

గుండెల్లో పెల్లుబికే దుఃఖాన్ని అందరిలా వెక్కివెక్కి ఏడవడానికి కూడా నోచుకోని ఆ అమ్మాయి కళ్ళు నదీప్రవాహాలుగా మారాయి.

చివర్లో సంతకం చేస్తుంటే.. వేళ్ళు వణికాయి! పెన్‌ని కాగితం మీదే పడేసి కుర్చీలో వెనక్కివాలి కళ్ళుమూసుకుంది.

ఆమె మౌనంగా రోదించడం చూసి.. అప్పటిదాకా హాస్పిటల్ రూమ్ బయట ఉన్న అనిత తమ్ముడు శ్రీకాంత్, క్రచెస్‌తో శబ్దం చేసుకుంటూ నడుస్తూ లోపలికి వచ్చాడు.

తమపని పూర్తయినట్లుగా హెడ్‌కానిస్టేబుల్ లేచి కేసు రికార్డులు సర్దుకుని.. ఒక్కక్షణం అనితని జాలి నిండిన కళ్ళతో చూసి బయటకి నడిచాడు.

మూగగా ఏడుస్తున్న అనిత దగ్గరికి వెళ్ళాడు శ్రీకాంత్. ఆమె భుజాల మీద చెయ్యేసి.. "అక్కా! పద ఇంటికెళ్దాం!" అని మాత్రం అన్నాడు.

ఏడవడం ఆపి తమ్ముడు చెయ్యి పట్టుకుంది అనిత. లగేజ్ తీసుకుంది.

ఇంటికెళ్ళాక, ఆటో దిగి లోపలికి వెళ్తుంటే చుట్టుపక్కల వాళ్ళు అనితని వింత జంతువుని చూస్తున్నట్లుగా, తమ ఇళ్ళముందు, తలుపుల్లోంచి, కిటికీల్లోంచి.. ఆసక్తిగా, ఆమె ఎలా ఉందన్నట్లుగా చూస్తుంటే- ఎవరినీ పట్టించుకోకుండా- ఏదో ట్రాన్స్‌లో ఉన్నట్లుగా నీరసంగా నడుస్తూ ఇంట్లోకి వెళ్ళిపోయింది అనిత.

ఆటో కుర్రాడికి డబ్బులిచ్చి క్రచెస్‌తో శబ్దం చేసుకుంటూ అందరివైపు తేరిపార చూస్తూ అక్క వెనకే నడిచాడు శ్రీకాంత్. అప్పుడతని ముఖంలో ఏ భావమూ కనిపించలేదు.

లోపలికెళ్ళాక- చిన్నగది, హాలు, కిచెన్‌తో ఉన్న ఆ ఇంట్లో.. తమతోపాటు విషాదభరితమైన, గుండెని మెలిపెట్టే గత జీవితం అనుభవాలు తప్ప.. ఈ లోకంలో ఎవరూ తోడు ఉండరని, ఆ అక్కాతమ్ముళ్ళకి అనిపించింది. అప్పటిదాకా తమతోపాటు నివసించిన మేనమామ తన భార్యతో వేరే ఊరికి బదిలీపై వెళ్ళిపోయాడు.

ప్రొఫెషనల్ కాలేజీ ఫస్ట్ ఇయర్‌లో చేరిన శ్రీకాంత్‌కి చిన్నప్పుడే పోలియో వచ్చింది. ఒంటికాలితో నడవడానికి ఇబ్బందిపడుతూ చంకల కింద క్రచెస్‌ని అలవాటు చేసుకున్నాడు.

తల్లిదండ్రులు లేకపోవడంతో అక్క అనితే అన్నీ చూసుకునేది. అర్థం కాని పాఠాలు వివరించేది. అర్థం చేసుకున్న సినిమాల గురించి చర్చించేది. బలవంతంగా ఎంసెట్ రాయించి, మంచి ర్యాంక్ వచ్చేలా కృషిచేసింది. తన కాళ్ళమీద తను నిలబడేలా ఒక మంచి కోర్సులో చేరేట్లు

తనని మలచిన అక్క- సాధారణ అమ్మాయిల్లా ప్రేమలో ఎందుకు పడిందో మొదట్లో శ్రీకాంత్‌కి అర్థం కాలేదు.

గొప్పింటికి చెందిన శశాంక్‌ని తనకి కూడా పరిచయం చేసి, త్వరలో ఇద్దరం పెళ్లి చేసుకుంటామని, ఇంట్లోవాళ్లు ఒప్పుకోకపోతే రిజిస్ట్రార్ ఆఫీస్‌లో సాక్షి సంతకం పెట్టాల్సింది నువ్వేనని సరదాగా అనేది. శశాంక్ కూడా ఆమెను అంత గాఢంగా ఇష్టపడటం, ఇద్దరూ ఒకరిని విడిచి ఒకరు ఉండలేకపోవడం- ఒక్కటయ్యేందుకు సమస్య వచ్చినప్పుడు విపరీతంగా తల్లడిల్లి కుంగిపోవడం.. ప్రత్యక్షంగా చూశాడు.

కానీ, శశాంక్ ఈ లోకం నుంచి దూరంగా వెళ్లిపోతే.. చావుబతుకుల మధ్య అక్క హాస్పిటల్లో ప్రత్యక్షనరకం అనుభవించడం కూడా అలాగే చూశాడు తను. ఇప్పుడు అందరూ అక్కనే నింది స్తుంటే, ప్రేమ పేరుతో శశాంక్‌ని మోసం చేసి, అతను చనిపోవడానికి కారణమై, తను మాత్రం బతికుందని అందరూ ద్వేషిస్తుంటే.. మాటలు రాని మూగదిగా మిగిలి, ప్రాణంలా ప్రేమించిన శశాంక్‌కి శాశ్వతంగా దూరమై ఎంత మానసిక క్షోభకి, వేదనకి గురవుతోందో.. అంతే మౌనంగా చూడగలుగుతున్నాడు.

"అక్కా! ఇది నీ టేబుల్, నీ బుక్స్! నేను కాలేజీకి వెళ్లి సాయంత్రం వస్తాను. నీకు ఏమన్నా కావాలంటే సెల్ ఫోన్‌లో మెసేజ్ ఇవ్వు. వెళ్లనా? " అనునయంగా అడిగాడు శశాంక్.

తమ్ముడి కళ్లలోకి ఆర్తిగా చూసి తలూపింది అనిత.

కాసేపటి తర్వాత- ఆ చిన్న ఇంట్లో ఒంటరిగా మిగిలింది. అప్పుడొచ్చింది దుఃఖం.. శశాంక్ గుర్తొచ్చాడు.

ఆవేశంలోనో, అనాలోచితంగానో ఇద్దరూ కలిసి తీసుకున్న నిర్ణయం.. అర క్షణం ఆలస్యమవకూడదా! పురుగుమందు తాగడం, అరనిమిషం వాయిదా వేస్తే- కలిసే చావాలని బలంగా నిర్ణయించుకున్న తామిద్దరూ.. కలిసి బతకడానికి ఎంతకాలమైనా అలాగే ఎదురుచూడగలిగే శక్తిని, ధైర్యాన్ని, ఓర్పునీ కలిగి ఉన్నట్లయితే.. కాలాన్ని ఒక్కసారి వెనక్కి తిప్పగలిగితే.. గతంలో చేసిన దారుణమైన తప్పుల్ని సరిదిద్దుకోగలిగితే.. అనిత కళ్లలోంచి దుఃఖాశ్రువులు జలపాతంలా దూకాయి.

గతమెప్పుడూ దుఃఖభరితమే. ఆవేదనా సహితమే. ఏ కొందరు అదృష్టవంతులకో తప్ప.. ప్రేమ నిండిన గుండెకి చివరికి మిగిలేది కన్నీళ్లేనా?

★ ★ ★

రాత్రి డిన్నర్ అయ్యాక స్టడీటేబుల్ ముందు కూర్చున్న స్వప్నతో.."అక్కా! వరండా రూమ్ రెంట్‌కి ఇచ్చారు, తెలుసా? " అడిగాడు తమ్ముడు అనిల్.

తెలీదన్నట్లుగా పెదవి విరిచింది స్వప్న.

"ఎవరో బాలు అంట! ఈ ఊరు కాదు, ఎక్కడో దూరంగా టౌన్. ఇక్కడే సాఫ్ట్‌వేర్ కంపెనీలో జాబ్! అతనికిచ్చారు. ఇందాక అమ్మకి నాన్న చెబుతుంటే విన్నాను. మంచి కుర్రాడిలానే ఉన్నాడు అంది నానమ్మ" సమాచారం ఇచ్చాడు అనిల్.

పెదవి విరిచింది స్వప్న.

"ఎవరైతే మనకేంట్రా? వెధవ సోది ఆపి చదువుకో! లేదంటే నిద్రపో!" విసుక్కుంది స్వప్న.

"బాలు! పేరు సింపుల్‌గా ఉంది. బైక్ ఉందో? లేదో? అప్పుడప్పుడు బైటికి తీసుకెళ్లమని డిమాండ్ చేయొచ్చు కదక్కా! నా సంగతేమో కానీ, నానమ్మకి బజారుపనులు చేయాల్సిందే ఇతను. రేపు ఫ్రెండ్‌షిప్ చేసుకుంటాలే!" అన్నాడు అనిల్.

"విసిగించకురా..!" అంది స్వప్న.

అసలే పగలంతా స్కూల్లో, సాయంత్రం గ్రౌండ్‌లో ఆటలాడి అలసిపోయాడేమో అనిల్ నిద్రలోకి జారుకున్నాడు.

ఇంట్లో అందరూ నిద్రపోతుంటే స్వప్న మాత్రం మరుసటి రోజు సబ్మిట్ చేయాల్సిన రికార్డు రాసుకుంటూ చాలాసేపు అలాగే స్టడీటేబుల్ ముందు కూర్చుంది.

వర్క్ ముగించాక రికార్డు మూసేసి ఛైర్‌లో విశ్రాంతిగా వాలిపోయి కిటికీ లోంచి బయటికి చూసింది. అంతా చీకటిగా, నిశ్శబ్దంగా ఉంది.

ప్రతిరోజు రాత్రి నిద్రపోవడానికి ముందు డైరీ రాయడం స్వప్నకి అలవాటు. అయితే ఏం రాయాలో వెంటనే తోచలేదు. అలా కిటికీలోంచి బయటికి చూస్తూ కూచుండిపోయింది.

అప్పుడామెకి ఆ రోజు సాయంత్రం జరిగిన సంఘటన గుర్తుకొచ్చింది. కాఫీషాప్‌లో కూర్చున్నప్పుడు హిమజ చెప్పిన విషయం గుర్తుకొచ్చింది.

స్నేహంతో దగ్గరయిన అబ్బాయి, అమ్మాయి- ఎప్పటికీ ఫ్రెండ్స్‌గా ఉండిపోకుండా వాళ్లిద్దరిలో ఆకర్షణ, ఇష్టం ఏర్పడి జీవితాన్ని పంచుకోవాలని తపనపడతారా? లేక ఫ్రెండ్స్‌గానే ఉండిపోతారా? లేదా ఆకర్షణలోంచి ఇష్టంలోకి, తర్వాత ప్రేమలోకి మారిపోయి, అక్కడితోనే ఆగిపోయి ఎవరికి వాళ్లు విడిపోతుంటారా..?

ఇప్పటి యువతలో మెజారిటీ భాగం ఏ దారిలో నడుస్తున్నారు?

కేవలం ఆకర్షణ, ఇష్టంతోటే పెళ్లిచేసుకుంటే- గాఢమైన ప్రేమతో వాళ్లిద్దరి హృదయాలు నిండకపోతే.. అప్పుడు ఆ అబ్బాయి, అమ్మాయి ఒకే జీవితంలో ఎలా? ఎన్నాళ్లు? ఇమిడిపోతారు? ఎప్పుడు విడిపోతారు? స్వప్న రకరకాలుగా ఆలోచించసాగింది.

ఇంతలో ఆమెకు వరండా రూమ్‌ని 'బాలు' అనే కుర్రాడికి రెంట్‌కి ఇవ్వడం గుర్తొచ్చింది. 'బాలు..!' అనుకుంటూ ఉండగా, ఆమె చేతిలోని బాల్ పెన్, తెరచి ఉంచిన డైరీలోని ఆ రోజు పేజీలో చేతికొచ్చినట్లుగా ఏవో గీతలు గీసింది.

ఇక ఆ రోజుకి రాసేవి ఏమీ లేవన్నట్లుగా డైరీని మూసేసి, మంచం ఎక్కేసి పడుకుంది స్వప్న. మరో అయిదు నిమిషాల్లో గాఢమైన నిద్రలోకి జారుకుంది.

★ ★ ★

ప్రాజెక్ట్ హెడ్ పిలుస్తున్నారని ఆఫీస్ బాయ్ చెప్పడంతో సిస్టమ్ ముందు నుంచి లేచి, ఛాంబర్ వైపు అడుగులేశాడు బాలు.

లోపలికి అడుగు పెట్టగానే- కొద్దిగా ఆశ్చర్యం. టేబుల్ ముందు దాదాపు తన వయసే ఉన్న అమ్మాయి- చాలా స్టయిలిష్‌గా కనిపించింది.

లాప్‌టాప్‌లో ఏదో వర్క్ చేసుకుంటూ ప్రాజెక్ట్‌హెడ్ స్థానంలో ఉన్న ఆ అమ్మాయి "కమిన్ మిస్టర్ బాలూ!" అంది తలెత్తకుండా.

ఎదురుగా వచ్చి కూర్చున్నాడు బాలు.

"నా పేరు శిరీష! మీ అందరికీ హెడ్! ఎలా ఉంది వర్క్? " అడిగింది.

"నో ప్రాబ్లమ్! రెండ్రోజుల్లో అలవాటయిపోతుంది!" చెప్పాడు బాలు.

"వెరీగుడ్ బాలు! మీ అసలు పేరు ఇదేనా? లేక నిక్‌నేమా? కానీ సర్టిఫికెట్లన్నీ ఇదే పేరుతో ఉన్నాయే? " అతని కళ్లలోకి సూటిగా చూస్తూ అంది శిరీష.

"అసలు పేరు అదే!" చెప్పాడు బాలు.

పెదవులు బిగించి తలూపింది శిరీష.

"చాలాకాలం కిందట.. ఒక గ్రేట్ డైరెక్టర్ బ్లాక్ అండ్ వైట్‌లో బ్లాక్‌బస్టర్ ఫిల్మ్ తీశాడు. ఆ సినిమా చరిత్ర సృష్టించింది. అందులో హీరోపేరు కూడా అచ్చంగా మీ పేరే! బాలు!! మీకు తెలుసా? " నవ్వు ఆపుకుంటూ అంది.

పెదవి విరిచాడు బాలు! "నేను సినిమాలు చూడను..!" లేచి నిలబడ్డాడతను.

"ఓకే! ఏదన్నా డౌట్స్ వస్తే అడగండి! క్యారీఆన్" అని చెప్పి, మళ్లీ తన లాప్‌టాప్‌లో లీనమయింది శిరీష.

బయటికి నడిచాడు బాలు.

లాప్‌టాప్‌లో ఏదో టైప్ చేసుకుంటూ.. 'బాలు' అని ఉచ్చరించింది శిరీష.

అప్పుడామె పెదవుల మీద చిరునవ్వు మెరిసింది. మనసులో 'ఏ తీగ పువ్వునో ఏ కొమ్మ చేతినో.. కలిపింది ఏ వింత అనుబంధమవునో' అనే పాట చరణాలు మెదిలాయి.




రోజుకన్నా ముందే కాలేజీ నుంచి వచ్చిన స్వప్న వరండాలో కూచుని క్లాస్ బుక్స్ చదువుకోసాగింది.

స్కూల్ నుంచి వచ్చిన తమ్ముడు అనిల్ బ్యాగ్‌ని ఇంట్లో పడేసి, ఫ్రెండ్స్‌తో ఆడుకోవడానికి వెళ్లిపోయాడు.

చాలా సేపు క్లాస్‌బుక్స్ చదివాక బోర్‌గా అనిపించి లోపల్నుంచి డైరీ తీసుకొచ్చింది అనిత. వరండాలో కూచుని డైరీ పేజీలు తెరవగానే.. నిన్నటి తేదీ పేజీలో రాత్రి అందులోనే ఉంచిన పెన్ కనిపించింది. ఆటోమేటిక్‌గా తెరుచుకున్న ఆ పేజీ చూడగానే స్వప్నకి షాక్ తగిలినట్లయింది.

పేజీ మధ్యలో కొన్ని పిచ్చిగీతలు! చీకట్లో రాసినట్లుగా 'బాలు' అనే అక్షరాలు..!

ఇదేంటి? ఈ పేరు డైరీలో ఎందుకు రాసింది తను? స్వప్నకి ఏమీ అర్థంకాక, అయోమయంగా అనిపించింది.

'బాలు' అంటే.. వరండా రూమ్‌లో రెంట్‌కి దిగిన కుర్రాడు. అతడి పేరు తనెందుకు రాసిందసలు?

అప్రయత్నంగా వరండాలోనే ఒక మూలగా ఉన్న గదివైపు చూసింది స్వప్న. ఆ గది తలుపులు తాళంవేసి ఉన్నాయి.

డైరీలో రాసిన 'బాలు' అనే అక్షరాల్ని చెరిపే పనిలో పడింది వెంటనే స్వప్న.

తెల్లకాగితం మీద రాసిన అక్షరాల్ని చెరపగలిగే మనుషులు.. మనసు పొరల్లో ముద్రించుకుపోయిన జ్ఞాపకాల్ని, అనుభూతుల్ని ఎంత ప్రయత్నించినా చెరపలేరని ఆ క్షణంలో స్వప్నకి తెలీదు.

అప్పుడామె మనసులో స్నేహం, ప్రేమ అనే వాటిమీద సరైన స్పష్టత ఏర్పడలేదు. డైరీలో రాసి, చెరిపేస్తున్న ఆ రెండు అక్షరాలు.. రానున్న జీవితంలో ఎలాంటి కీలకపాత్ర వహించబోతున్నాయో.. ఆమె కొంచెం కూడా ఊహించలేదు.

★ ★ ★

సమాంతరంగా సాగిపోయే రైలు పట్టాల మధ్య గులకరాళ్లలో నడుస్తున్నారు వాళ్లు. అమ్మాయికి ఇరవై, అబ్బాయికి ఇరవై రెండేళ్ల వయసుంటుంది. ఇద్దరూ ఒకరి చేతులొకరు గట్టిగా పట్టుకున్నారు.

స్టేషన్‌కి దూరంగా ఔటర్ సిగ్నల్ ప్రాంతంలో ఉన్న వాళ్లిద్దరినీ గమనించడానికి ఆ చుట్టుపక్కల ఎవరూ లేరు.

ఇంతలో దూరంగా.. మలుపులో రైలు హారన్ వినిపించింది.

దూరం నుంచి వస్తున్న ఆ రైలు వాళ్లిద్దరి కళ్లలో ఒక విధమైన ధైర్యాన్ని కలిగిస్తోంది. అబ్బాయి చెయ్యి గట్టిగా పట్టుకుని ఒక్కొక్క అడుగు ముందుకేస్తున్న ఆ అమ్మాయి అబ్బాయి వైపు చూసింది. సరిగ్గా అదే సమయానికి అలాగే చూశాడు ఆ అబ్బాయి. ఇద్దరి కళ్లు కలుసుకుని, చూపులు ముడివేసుకున్నాయి.

లోకంలోని కుట్రలూ, కుతంత్రాలు, జీవితంలోని ఎత్తుపల్లాలు అంతగా తెలీని, ఇంకా తెలుసుకునే వయసు, వివేకం రాని

ఆ ఇద్దరి కళ్లు, కల్మషం లేకుండా దిగులుగా మెరుస్తున్నాయి. ఏదో అనిర్వచనీయమైన తెగింపు, పట్టుదల ఆ కళ్లలో!

ఇంతలో ఉన్నట్టుండి, ఇద్దరి కళ్లలో సన్నటి నీటితెర అల్లుకోవడం మొదలయింది. మలుపు అవతల వేగంగా రైలు వస్తుండటం స్పష్టంగా తెలుస్తోంది.

ఇక జీవితానికి ఇదే చివరిసారి అన్నట్లుగా.. ఇద్దరి చేతులూ మరింతగా పెనవేసుకున్నాయి. అతని చెయ్యి ఆమె నడుం చుట్టూ.. ఆమె చెయ్యి అతని చుట్టూ.. కాళ్ల కింద నలుగుతూ శబ్దం చేస్తున్న కరుకు గుండెల గులకరాళ్లు! ఎక్కడో మొదలయి.. మరెక్కడికో వెళ్తున్నట్లుగా.. ఎప్పటికీ కలవని జీవితాల్లాగా కనిపిస్తున్న రైలుపట్టాలు.

ఇంతలో గులకరాళ్ల మధ్య అడ్డంగా ఉన్న కంకర స్లీపర్లు కాలికి తగిలి తట్టుకుని ముందుకి పడబోయింది అమ్మాయి. పక్కనే ఉన్న అబ్బాయి చప్పున ఆమెను పట్టుకున్నాడు.

కలిసి బతకడానికి తగిన వయసు, స్థితి అప్పటికింకా ఏర్పడకుండానే.. ఈ లోకం అందుకు అంగీకరించట్లేదనే మానసిక స్థితిలోకి వెళ్లిపోయిన వాళ్లిద్దరూ- చావులోనైనా ఒకటిగా ఉండాలని నిర్ణయించుకున్నారు.

సరిగ్గా అప్పుడే వెనుక నుంచి వేగంగా వచ్చిన సూపర్‌ఫాస్ట్ రైలు ట్రాక్ మీద నడుస్తున్న వాళ్లిద్దరి మీద నుంచి మెరుపు వేగంతో దూసుకెళ్లింది. ఆ ప్రేమజంట తునాతునకలైపోయింది. ఇద్దరి చివరి చావుకేక రైలు హారన్‌లో కలిసిపోయింది.

అప్పటిదాకా ఈజీఛైర్‌లో నిద్రపోతున్న అనిత ఉలిక్కిపడి లేచింది. ఒక్క క్షణం తనెక్కడున్నదీ అర్థంకాలేదు. రైలు పట్టాలు.. ఒక అమ్మాయి.. అబ్బాయి ట్రాక్ మీద నడుచుకుంటూ వెళ్లడం.. రైలు వచ్చి ఢీ కొట్టడం.. అంతా అప్పటిదాకా కలలో చూసినట్లు అర్థమైంది.

ఆ రైలు హారన్ పెద్దగా మోగడం.. పట్టాల మీద శబ్దం చేసుకుంటూ వెళ్లడం ఇంకా చెవుల్లోనూ, గుండెలోనూ ప్రతిధ్వనిస్తోంది. తన గుండె వేగంగా కొట్టుకోవడం తనకే వినిపిస్తోంది. అలాగే కాసేపు ఈజీఛైర్‌లో కూచుండిపోయింది. తమ్ముడు ఇంకా కాలేజీ నుంచి రాలేదు. టీవీలో ఏవో కామెడీ సీన్లు వస్తున్నాయి. దగ్గరే ఉన్న రిమోట్‌ని అందుకుని ఛానల్ మార్చింది అనిత.

న్యూస్ ఛానల్‌లో సినిమా ప్రోగ్రామ్ వస్తుంటే అక్కడ ఆపి చూసింది. సరిగా అప్పుడు.. బ్రేకింగ్ న్యూస్ స్ట్రిప్‌లో 'రైలు కింద పడి గుర్తు తెలియని ప్రేమ జంట ఆత్మహత్య. పెద్దలు ఒప్పుకోలేదనే మనస్తాపంతో దారుణానికి ఒడిగట్టిన ప్రేమికులు..' అంటూ ఎర్రటి అక్షరాల్లో న్యూస్ ఫ్లాష్ అవసాగింది.

అనిత దృష్టిని ఆ బ్రేకింగ్ న్యూస్ ఆకర్షించడం.. ప్రేమజంట ఆత్మహత్య వార్త చదివిన ఆమె మళ్లీ షాక్‌కి గురవడం.. వెంటవెంటనే జరిగిపోయాయి.

కొద్దిక్షణాల కిందట తన కలలో జరిగిన సంఘటన.. ఇప్పుడు నిజంగా టీవీలో కనిపించడంతో అనిత మనసులో అలజడి, ఆందోళన కలిగాయి.

ప్రేమికులు.. ప్రేమజంట.. ఆత్మహత్య.. ప్చ్..! తెలీకుండానే ఆమె గుండెలో దుఃఖం పెల్లుబికింది. కన్నీళ్లు ప్రవహించడం మొదలుపెట్టాయి.

ఒక అనాలోచిత నిర్ణయం కారణంగా శశాంక్ ఈ లోకం నుంచి సెలవు తీసుకెళ్లిపోయాడు. అటు కన్నవాళ్ళకి శోకం.. ఇటు ప్రేమించిన తనకి జీవితకాలానికి సరిపడే దుఃఖాన్ని మిగిల్చి.. అతను మాత్రం.. శాశ్వతంగా దూరమైపోయాడు.

ఆ సంఘటన అరనిమిషం వాయిదాపడితే.. తామిద్దరం ఆత్మహత్యకి పాల్పడే వాళ్లం కాదేమో? ప్రేమని గెలిపించుకో

వడం కోసం శశాంక్ తనవాళ్లని కన్విన్స్ చేయించడానికి ప్రయత్నిస్తూండేవాడేమో!

అంతా ముగిసిపోయాక అలా ఆత్మహత్యకు పాల్పడకుండా ఉండాల్సిందని తీరిగ్గా అనుకుంటోంది ఇప్పుడు. తమలాగే రోజూ ఎందరో ప్రేమోపహతులు- క్షణికావేశంతో నూరేళ్ళ జీవితాన్ని చేజేతులా అంతం చేసుకుంటున్నారేమో? ప్రేమని బతికించుకోవడానికిలా ఎంతమంది తమని తాము బలిచేసుకుంటారు? ఇలా ఎన్నాళ్ళు? అనితకి దిగులు, దుఃఖం పెల్లుబుకాయి.

పరిచయం ఇష్టంగా, ఇష్టం ప్రేమగా రూపాంతరం చెందాక.. ఇక ఎప్పటికీ కలిసే బతకాలని బలంగా అనుకున్నాక.. ప్రేమని గెలిపించుకోవడం కోసం, తల్లిదండ్రులను ఒప్పించి ఒకే జీవితంలో ఐక్యం అవడానికి.. ప్రేమించుకున్నంత గాఢంగా, నిజాయితీగా ప్రయత్నిస్తే.. ఎందుకు విజయం సాధించలేరు?

విశ్వవిద్యాలయాల్లో సైన్స్, ఇంజినీరింగ్, కామర్స్, ఆర్ట్సుకి బ్యాచిలర్ డిగ్రీ కోర్సులు ఉన్నట్లే.. ఒక సబ్జెక్టులోని అనుకూల, ప్రతికూల అంశాల్ని పాఠాలుగా బోధించి, పరీక్షలు పెట్టి ఉత్తీర్ణతని నిర్ణయించే గ్రాడ్యుయేట్ కోర్సు ఉన్నట్లుగా.. ప్రేమకి కూడా ఒక బ్యాచిలర్ డిగ్రీ కోర్సు ఉంటే..!! నిజంగా, నిజాయితీగా, గాఢమైన హృదయంతో ప్రేమించుకునే ప్రతి ఒక్కరూ తమ ప్రేమలో ఉత్తీర్ణులై, జీవితంలో విజయం సాధించడానికి.. ఏదైనా ఒక్క కోర్సు.. ఎక్కడైనా, ఎవరైనా బోధించగలిగితే.. అప్పుడు ఇలా ప్రేమ విఫలమై ప్రేమికులు ఆత్మహత్యలకి పాల్పడకుండా ఉంటారేమో?

కాలింగ్‌బెల్ మోగడంతో ఆలోచనల్లోంచి బయటకొచ్చింది అనిత. కాలేజీ నుంచి వచ్చిన తమ్ముడు శ్రీకాంత్- తెరిచి ఉన్న తలుపు తీసుకుని క్రచెస్ శబ్దం చేసుకుంటూ లోపలికి అడుగుపెట్టాడు.

అక్కని చూసి చిన్నగా నవ్వాడు.

> ## కొత్తగాలి...
>
> **జైలుకెళ్లడం**
> **ఒకనాడవమానాల పెట్టు**
> **రాజకీయాల్లో**
> **నేడదే పదవికి తొలిమెట్టు!**
>
> – కె.వి. సుబ్రహ్మణ్యం,
> సింహాచలం

"లైబ్రరీకి వెళ్ళానక్కా! బుక్స్ మార్చుకుని వచ్చేసరికి కొద్దిగా లేటయింది" అన్నాడు.

అప్పటిదాకా చూస్తున్న న్యూస్‌ఛానల్‌ని మార్చి ఏదో సినిమా ఛానల్ పెట్టి కుర్చీలోంచి లేచి తమ్ముడి కాలేజీ బ్యాగ్ అందుకుంది అనిత. అదే హాల్లో ఉన్న చిన్న డైనింగ్ టేబుల్ మీద లంచ్‌కి అన్నీ ఏర్పాటుచేసింది. ఈ లోపల ఫ్రెషప్ అయిన శ్రీకాంత్ వచ్చాక ఇద్దరూ భోజనం చేయసాగారు.

ఆ రోజు కాలేజీలో జరిగిన సంగతులు ఒక్కొక్కటి అక్కకి చెప్తూ.. ఆమె ముఖంలో అప్పుడప్పుడు మెరుపులా మెరిసి మాయమయ్యే నవ్వు తెరని గమనిస్తూ చిన్నగా నిట్టూర్చాడు శ్రీకాంత్.

"అక్కా! మా లైబ్రరీలో చాలా లిటరేచర్ బుక్స్ ఉన్నాయి తెలుసా? ఈసారి నీకిష్టమైన ఠాగూర్ బుక్స్ తెస్తాలే!" అన్నాడు.

టేబుల్ దగ్గర తన పక్కనే ఎప్పుడూ ఉంచుకునే పలక మీద చాక్‌పీస్‌తో కొన్ని అక్షరాలు రాసింది అనిత.

ఆమె రాసింది చదివాక అక్కవైపు అర్థం కానట్లుగా చూశాడు శ్రీకాంత్.

'అవును!' అన్నట్లుగా తల ఊపింది అనిత. అప్పుడామె కళ్లలో సన్నటి నీటితెరతో పాటు ఏదో ఆశ నక్షత్రంలా మెరవడం కనిపించింది అతనికి.

డైనింగ్‌టేబుల్ దగ్గర నుంచి లేచాక, తన బుక్స్‌లోంచి మంచి నోట్‌బుక్‌ని, బాగా రాసే పెన్‌ని అనిత చేతికిచ్చాడు శ్రీకాంత్.

అందుకుని తన ఈజీఛైర్ పక్కన ఉన్న రైటింగ్‌ప్యాడ్ మీద పెట్టింది అనిత. అప్పుడామె మనసులో తను చేయాల్సిన పనికి సంబంధించిన ఆలోచన ఒక్కొక్క రేకు తొడగసాగింది.

★ ★ ★

బాలు ఆఫీస్ నుంచి వచ్చేసరికి బాగా రాత్రి అయింది. తన రూమ్ తలుపులు శబ్దం కాకుండా తీసి, లోపలికెళ్ళాడు.

ఇంటి ఓనర్ పోర్షన్‌లో ఏ అలికిడి లేదు. బయటే తిని రావడంతో నిద్రపోదామనుకున్నాడు. కానీ కొత్తస్థలం కావడంతో అంత త్వరగా నిద్ర రాలేదు. మళ్ళీ శబ్దం కాకుండా రూమ్ తలుపులు తీసుకుని బయటికి వచ్చి చూశాడు బాలు.

తూర్పు దిక్కున ఆలస్యంగా ఎర్రగా చంద్రుడు ఉదయిస్తున్నాడు. అక్కడక్కడ తెల్లటి మబ్బు తునకలు. గాలి చల్లగా వీస్తోంది. గేటు దగ్గర నిలబడి ఇంటిని చూశాడు. చిన్న పొదరిల్లులా పొందికగా కనిపించింది. ఓ మూలగా నైట్‌క్వీన్, మరోవైపు పారిజాతం మొక్క. రెండూ కూడా రాత్రిళ్ళు పూలతో వికసించి సువాసన వెదజల్లేవే!

నిశ్శబ్దంగా ఉన్న ఆ నిశీధి సమయంలో తన జీవితమంతా ఒక్కసారిగా గుర్తొచ్చింది బాలుకి. హాస్టల్లో గడిచిన బాల్యం.. కాలేజీచదువు.. మళ్ళీ హాస్టల్.. తనతో పాటు చిన్నవాళ్ళయిన యాభై మంది అనాథ బాలలూ.. అన్నీ కళ్ళలో మెదిలాయి.

ఇలా ఆలోచిస్తూ ఇంటి పక్కనే ఉన్న ఖాళీ స్థలంలోకి అడుగులు వేశాడు. అక్కడ కూడా ఏవో పూల మొక్కలు తెల్లగా నవ్వుతున్నాయి. అప్పటికే కొంచెం పైకి పాకిన చంద్రుడు మసకగా పరిసరాల్లో కాంతిని పరిచాడు.

సరిగ్గా దీనికి కొన్ని నిమిషాల ముందు వరకూ టేబుల్‌లైట్ వెలుతురులో ఏదో రికార్డు రాసుకుంటూ లోపల హాల్లో కూర్చున్న స్వప్న.. లైట్ ఆఫ్‌చేసి, బడలికగా కుర్చీలోనే వెనక్కివాలి కళ్ళు మూసుకుంది. కొన్ని క్షణాల తర్వాత కళ్ళు తెరచిన స్వప్న యథాలాపంగా కిటికీ లోంచి బయటికి చూసింది.

అంతే! ఆమె కళ్ళు పెద్దవయ్యాయి. నిద్ర మత్తు వదిలిపోయింది. తోటలో, ఏదో పూల మొక్క దగ్గర.. ఎవరో వ్యక్తి.. నీడలాగా..! ఎవరు? దొంగేమో? ఒక్క క్షణం ఊపిరి బిగపట్టింది.

టైమ్ చూస్తే పన్నెండు దాటింది. ఈ టైమ్‌లో వచ్చేది దొంగలేగా?!

గుండె వేగంగా కొట్టుకుంటుంటే కదలకుండా కుర్చీకి అంటుకుపోయి బయటికి చూడసాగింది.

బయట ఉన్న ఆకారం చిన్నగా కదిలింది. 'ఒకవేళ కిటికీ దగ్గరకొచ్చి, గ్రిల్స్ తొలగించి, చోరీ ప్రయత్నాలు మొదలుపెడతాడేమో దొంగ..' అనుకుంటూ లోపల గదిలో నిద్రపోతున్న తండ్రిని లేపుదామా? అనిపించింది స్వప్నకి.

తోటలో కదిలిన ఆకారం- ముందు వైపుకు నడవడం కినిపించింది. అలా నడుస్తూ అడుగుల చప్పుడు.. వరండా మెట్లెక్కడం.. తలుపు తెరచి, సుతారంగా మూసిన చప్పుడు వినిపించాయి.

కొన్ని క్షణాలు ఊపిరి బిగపట్టి చూసింది. అంతే! తర్వాత ఇంకే శబ్దమూ లేదు. నిమిషాలు గడిచాయి.

ఎలాగో కాసేపటికి ధైర్యం కూడగట్టుకుని వీధి తలుపు ఓరగా తీసి చూసింది.

బయట వరండాలో ఎవరూ కనిపించలేదు. సరిగ్గా అప్పుడు గుర్తొచ్చింది ఆమెకి, వరండా రూమ్‌ని రెంట్‌కి ఇవ్వడం

గురించి. అంటే ఇంతకు ముందు తోటలో కనిపించిన ఆకారం ఆ కుర్రాడిదేనేమో? అని ఆలోచించింది.

తను భయపడడం సంగతి అటుంచి.. 'అర్ధరాత్రప్పుడు దొంగలా తోటలో తిర గడం ఏంటసలు? వరండా రూమ్ కుర్రాడు చాలా ఎక్కువ చేస్తున్నాడు!' అని తిట్టుకుంది.

హాల్లోనే మంచం మీద నిద్రపోతున్న తమ్ముడు కలవరిస్తూ.. 'అరేయ్! బాల్ ఎక్కడ? బాలు విసరండిరా!' అంటూ క్రికెట్ ఆడుతున్నట్లుగా కల కంటున్నాడు.

బాల్.. బాలు.. వరండా గదిలో దిగిన కుర్రాడి పేరు బాలు.. ఇదేం పేరు? ఆట వస్తువులాగా! అనిపించి నవ్వొచ్చింది స్వప్నకి. పక్కనే ఉన్న తన బెడ్ మీద పడుకుని నిద్రపోవడానికి ప్రయత్నించింది.

★ ★ ★

తన టేబుల్ ముందు కూచుని సిస్టమ్ ఆపరేట్ చేస్తుండగా ప్రాజెక్ట్ హెడ్ నుంచి పిలుపు వచ్చింది బాలుకి.

ప్రాజెక్ట్ హెడ్ ఛాంబర్‌లోకి అడుగుపె ట్టిన బాలుని "ఈ రోజూ లేట్‌గా వచ్చా రేంటి బాలూ? ఆఫీస్ క్యాబ్ పికప్ చేసు కోలేదా? " అడిగింది శిరీష.

"లేదు. నేనుండే కాలనీ సిటీకి కాస్త దూరం. క్యాబ్ వచ్చే రూట్‌లో లేదు. బస్‌లో వచ్చాను" చెప్పాడు బాలు.

"అదేంటి? బైక్ లేదా? " అడిగింది.

లేదన్నట్లు తల అడ్డంగా ఊపాడతను.

"ఓకే! నిన్న ఈవినింగ్ మీటింగ్‌లో మీకు ఎలాట్ చేసిన ప్రాజెక్ట్ త్వరగా పూర్తిచేయండి. రేపు సాటర్‌డే కాబట్టి హాఫ్ డే" చెప్పింది శిరీష.

తలూపి, బయటికొచ్చి పనిలో నిమగ్న మయ్యాడు బాలు.

మధ్యలో ఇంటి ఓనర్ తల్లి జానకమ్మ ఆఫీస్‌కి వచ్చేముందు ఇచ్చిన లంచ్‌బాక్స్‌ని ఖాళీ చేశాడు.

సాయంత్రం ఆరు దాటాక అందరూ వెళ్ళిపోతూంటే, త్వరగా ప్రాజెక్ట్ వర్క్ పూర్తిచేసి, కారిడార్‌లోకొచ్చి లిఫ్ట్ కోసం నిలబడ్డాడు బాలు.

సరిగ్గా అదే సమయానికి ఆఫీస్‌లోంచి ప్రాజెక్ట్ హెడ్ శిరీష బాలు దగ్గరకొచ్చి "హాయ్!" అంటూ పలకరించింది.

బదులు కోసం చూడకుండా ఎర్రగా వెలుగుతున్న స్విచ్‌ని మళ్ళీ మళ్ళీ నొక్కింది శిరీష. అప్పుడామె సన్నని, పొడ వాటి నాజూకువేళ్ళు తెల్లగా.. చివర చిల కముక్కులాగా, ఎర్రగా మెరుస్తున్న నెయి ల్‌పాలిష్‌వైపు చూస్తూ నిలబడ్డాడు బాలు.

లిఫ్ట్ పైకి రాగానే తెరుచుకున్న తలుపు లోంచి లోపలికి నడిచింది శిరీష. బాలు కూడా అనుసరించాడు. తలుపు మూసుకో గానే బటన్ ప్రెస్ చేసింది. గ్రౌండ్ ఫ్లోర్ లోకి దిగసాగింది లిఫ్ట్. ఈ లోపల హేండ్‌బ్యాగ్‌లోంచి స్మార్ట్‌ఫోన్ తీసి ఎవ రికో మెసేజ్ పంపడంలో బిజీ అయింది.

సరిగ్గా అప్పుడు సెకండ్ ఫ్లోర్ వరకు లిఫ్ట్ దిగగానే హఠాత్తుగా పవర్ ఫెయిల్ అయిపోవడం, లోపల లైట్లు ఆరిపోవడం ఒకే క్షణంలో జరిగాయి. "డోన్ట్‌వర్రీ! జన రేటర్ స్టార్ట్ అవుతుందిలే! రెండు నిమి షాలు!" బాలుతో చెప్పిన శిరీష సెల్‌ఫోన్ ఆపరేట్‌చేస్తూ ఉండిపోయింది.

చుట్టూ చీకటి! శిరీష ముఖం మీద మాత్రం నీలం రంగులో సన్నని వెలుగు! అసలే తెల్లగా ఉండే ఆమె ముఖం, చెంపలూ, నుదురూ.. ఆయిలీగా, మరింత గ్లోతో మెరవడం, షేప్ చేసిన ఐబ్రోస్, వాటి కింద చురుగ్గా కదిలే కళ్ళు, నుదుటి మీద పడుతున్న జుట్టుకొసలు, కొద్దిగా పట్టుదలతో బిగించిన ఎర్రని పెదవులూ, చిన్న చుబుకమూ.. శిరీషను అలాగే చూస్తూ ఉండిపోయాడు బాలు.

రెండు నిమిషాలు గడవగానే లిఫ్ట్‌లో లైట్లు వెలగడం.. చిన్న జర్క్‌తో కిందకి

దిగడం మొదలయింది. సెల్లార్‌లో లిఫ్ట్ ఆగాక ఇద్దరూ బయటికి నడిచారు.

పార్కింగ్ ప్లేస్‌లోని తన కారు వైపు నడవబోయి ఆగి "బాలు! మీరెలా వెళ్తారు? ఎటువైపు? " అడిగింది శిరీష.

"ఫ్లై ఓవర్.. సిటీబస్.." ఎలా చెప్పాలో తెలీక పొడిపొడిగా అన్నాడు బాలు.

"మీరుండేది..? " మళ్ళీ అడిగింది.

తనుండే కాలనీ పేరు చెప్పాడు బాలు.

"నేను ఇప్పుడు అటువైపే వెళ్తున్నాను! రండి! తీసుకెళ్తా!" అంటూనే కారు ఎక్కి కూచుంది. తప్పదన్నట్లుగా ఇటువైపు డోర్ తెరిచి లోపలికి ఎక్కాడు బాలు.

సెల్లార్‌లోంచి బయటికి దూకిన కారు మెయిన్ రోడ్డులోకి ప్రవేశించిన వెంటనే బాలు ఫోన్ రింగయింది. చూస్తే జానకమ్మ. ఈ రోజు ఆఫీసుకి వచ్చేటప్పుడు తన ఫోన్ నెంబరు వరండాలోని కేలండరు మీద రాయమంది. అలాగే రాశాడు. ఇప్పుడు ఆవిడ ఫోన్.

"ఏమయ్యా బాలూ! ఆఫీసయిపోయిందా? " అడిగింది జానకమ్మ.

"ఆ.. అయింది. జస్ట్ ఇప్పుడే బయల్దేరానండీ!" చెప్పాడు.

"సరే! వచ్చేటప్పుడు టాబ్లెట్లు తీసుకొస్తావా? " అంటూ ఏం తేవాలో కూడా చెప్పింది. కారు డాష్‌బోర్డు మీద కనిపించిన పేపర్ నాప్‌కిన్ తీసుకుని టాబ్లెట్ల పేర్లు రాసుకున్నాడు బాలు.

కాల్ కట్ అయ్యాక.. "ఇంటి దగ్గర నుంచా? " అతడివైపు చూడకుండానే అడిగింది శిరీష.

"అవునండీ! ఏవో టాబ్లెట్స్ కోసం. కొంచెం ముందుకెళ్ళి సిగ్నల్స్ దగ్గర ఆపితే దిగుతాను" అన్నాడు బాలు.

"ఓకే! ఆపుతాను!" అంటూ కొంచెం ముందుకు పోయాక సిగ్నల్స్ దగ్గర కారు ఆపింది శిరీష.

★ ★ ★

స్కూల్ నుంచి వచ్చాక కాలనీ ఫ్రెండ్స్‌తో ఆటలాడి ఇంటికి చేరాడు అనిల్. వరండాలో సైకిల్ పెట్టి స్టాండ్ వేస్తుండగా, గేటు తీసుకుని లోపలికి వచ్చాడు బాలు. ఇంతవరకూ బాలు గురించి వినడమే తప్ప చూడని అనిల్, కొత్తవ్యక్తి ఎవరా? అన్నట్లుగా చూశాడు.

వరండా మెట్లెక్కిన బాలు "బాబూ! మీ నానమ్మని పిలుస్తావా? " అని అడిగాడు.

"ఎందుకు? అసలేం కావాలో చెప్పండి!" తల ఎగరేసి అన్నాడు అనిల్.

"ఈ టాబ్లెట్స్ తెమ్మన్నారు.. ఇవ్వాలి!" అన్నాడు చేతిలో చిన్న కవర్‌ని చూపిస్తూ.

ఇంతలో బయటికొచ్చిన జానకమ్మ- "బాలూ! తెచ్చావా? " అని అడిగింది.

"ఇదిగోండి!" అంటూ ఇచ్చాడు బాలు.

ఇద్దర్నీ పరీక్షగా చూస్తూ నిలబడిన అనిల్‌కి అతనెవరైందీ అప్పుడు అర్థమైంది.

"బాలూ! వరండా రూమ్‌లో దిగింది తమరేనా? " అని అడిగాడు.

"ఎస్! ఇంతకీ తమరు ఎవరు? " తమాషాగా కళ్ళు ఎగరేసి అడిగాడు బాలు.

"నేను అనిల్‌ని!" చెప్పాడు.

"అలా చెబితే ఎలా తెలుస్తుందిరా? నువ్వేమైనా ప్రైమ్‌మినిస్టర్‌వా? వీడు నా మనవడు. చెప్పా కదా! గడుగ్గాయి అని.. వీడే!" అంది జానకమ్మ.

"నేనేం అలా కాదు" చెప్పి, కోపంగా

## కొత్తగాలి...

**చురుక్కులు చమక్కుల గాలి**
**మదిని తాకాలంటే**
**'కొత్తగాలి' వీచే వరకు**
**ఆగాలి!**

– కె.వి. లక్ష్మణరావు,
మానేపల్లి, తూ.గో. జిల్లా

లోపలికి వెళ్ళిపోయాడు అనిల్.

జానకమ్మతో మాట్లాడి తన రూమ్‌లో కెళ్ళి తలుపు దగ్గరగా వేశాడు బాలు.

అందుకోసమే చూస్తున్నట్లుగా ఉన్న అనిల్ లేచి బాలూ దగ్గరికెళ్లాడు.

"ఈ రూమ్‌ని ఇప్పటివరకూ నేను, అక్క వాడుకున్నాం. మాకు ఇష్టం లేకపోయినా నాన్న ఇలా రెంట్‌కి ఇచ్చారు. మాకేం నచ్చలేదు" ఉక్రోషం నిండిన గొంతుతో చెప్పాడు అనిల్.

బాలుకి నవ్వొచ్చింది.

మహా ఉంటే పద్నాలుగేళ్ళు ఉంటా యేమో అనిల్‌కి. ఇంకా హైస్కూల్‌లో చదువు. ఇంట్లో గారాబానికి, స్కూల్లో పెంకితనానికి.. చదువుల్లో, ఆటల్లో చురుగ్గా ఉండే పిల్లలకి- ప్రతిరూపంలా కనిపిస్తున్న అనిల్‌ని చూస్తుంటే.. తను పెరిగిన హాస్టల్లోని ఏభై, అరవై మంది పిల్లలు గుర్తొచ్చారు.

పిల్లల్లో సహజంగా ఉండే 'నాది' అనే మనస్తత్వం గురించి తెలిసిన బాలూ.. "ఛ! అలా అనకు! ఇది నీ రూమే అనుకో! జస్ట్ నేను రాత్రిళ్ళు వచ్చి నిద్రపోతుం టాను. ఓకేనా? నీ పుస్తకాలు, ఆట సా మాను ఈ రూమ్‌లోనే పెట్టుకో అనిల్! రా.. లోపలికి!" అంటూ భుజం మీద చెయ్యేసి అనిల్‌ని రూమ్‌లోకి తీసుకెళ్ళాడు బాలు.

లోపల రూమ్ అంతా నీట్‌గా సర్దినట్లు కనిపించింది. గోడకి మంచి సీనరీతో కూడిన పోస్టర్! టేబుల్, బుక్స్, ఇలా అన్నీ చూశాడు అనిల్.

"ఇంత నీట్‌గా ఎప్పుడూ లేదు ఈ రూమ్. బాగా సర్దావు బాలూ! గుడ్!" అన్నాడు అనిల్.

"ఆc..!" ఆశ్చర్యంగా అన్నాడు బాలు.

"నిన్ను 'బాలు' అని పిలుస్తా! ఓకేనా? నా క్రికెట్ కిట్ ఇక్కడే పెడతా" అన్నాడు అనిల్.

"సరే..! సరే..!" అన్నాడు బాలు.

చప్పున ఇంట్లోకి పరిగెత్తి క్రికెట్ బ్యాట్లు, స్టంప్స్ లాంటి సరంజామా అంతా తెచ్చి బాలు రూమ్‌లో ఒక మూల పెట్టాడు.

"ఇప్పుడు హ్యాపీనా? " అడిగాడు బాలు.

బదులుగా నవ్వి "మనిద్దరం ఫ్రెండ్స్! నీకు బైక్ ఉందా? " అడిగాడు.

"ప్చ్! లేదుగా..!" అన్నాడు బాలు.

"అయ్యో! ఉంటుందని ఆశపడ్డానే! అక్క తో కూడా చెప్పా! నన్ను తిట్టింది. ఇప్పుడు తను ఆనందిస్తుందిలే!" అన్నాడు అనిల్.

"మీ అక్క పేరేంటి? " అడిగాడు బాలు.

"అక్క పేరా? ఎందుకు? చెప్పను పో!" తుంటరిగా అంటూ పరిగెత్తాడు అనిల్.

ఆ కుర్రాడి మాటలు, ప్రవర్తన చూస్తుంటే.. తన హాస్టల్ వాతావరణం గుర్తొచ్చింది బాలుకి. చిన్నగా నిట్టూర్చాడు.

★ ★ ★

"బ్లడ్ ఈజ్ థిక్కర్ దేన్ వాటర్" పుస్త కంలో ఉన్నది చదువుతూ "అక్కా! ఈ వాక్యానికి అర్థమేంటి? " అడిగాడు అనిల్.

రైటింగ్ టేబుల్ ముందు చిన్న బెడ్ ల్యాంప్ వెలుగులో రికార్డ్ రాసుకుంటున్న స్వప్న తల తిప్పి తమ్ముడివైపు చూసింది.

దివాన్ కాట్ మీద అడ్డదిడ్డంగా పడే సిన పుస్తకాల మధ్య, నిర్లక్ష్యంగా పడుకుని ఇంగ్లీష్ టెక్స్ట్‌బుక్ చదువుతూ ఆమెనే చూస్తున్నాడు అనిల్.

"అది కూడా తెలీదా? నీళ్ళకన్నా రక్తం చిక్కగా ఉంటుంది అని. దీన్ని ఎలా చెప్తా రంటే రక్తసంబంధం గాఢమైందనీ, స్ట్రాంగ్‌గా ఉంటుందనీ. మామూలు రిలే షన్స్ కన్న బ్లడ్ రిలేషన్స్ గాఢంగా ఉంటా యని! మట్టిబుర్రకి అర్థమైందా? " రికార్డ్ రాసుకుంటూ చెప్పింది స్వప్న.

అక్క చెప్పిన వివరణని మనసులోకి ఎక్కించుకున్నాడో? లేదో? తెలీదు కానీ.. ఆ బుక్ చదువుతూ అలాగే నిద్రలోకి జారిపోబోతూ.. ఏదో గుర్తొచ్చినట్లుగా..

"అక్కా! ఇందాక బాలుని కలిశానే!" అన్నాడు.

"రూమ్‌లోకి వెళ్ళావా? " అడిగింది.

"వెళ్ళా! చక్కగా సర్దుకున్నాడు రూమ్‌ని. నా ఆటవస్తువులన్నీ అక్కడే పెట్టుకోనిచ్చాడు" చెప్పాడు.

"ఫర్వాలేదే! ఇంతకీ బైక్ ఉందా? లేదా? " అడిగింది స్వప్న.

"అడగలేదు. తనే ఏదో అడిగాడు నీకెందుకు చెప్పాలీ! అని వచ్చేశా!" అక్క ముఖంలోకి తమాషాగా చూశాడు.

"ఏమడిగాడేంటి? "

"మీ అక్క పేరేంటి? అన్నాడు. నీకెందుకు! నేను చెప్పను అన్నాన్లే!"

"ఛా! అలా అనకూడదు!" అసంకల్పితంగా అంది స్వప్న.

అప్పుడామెకి అర్ధరాత్రి దాటాక తోటలో దొంగలాగా కనిపించిన 'బాలు' అనే యువకుడి అస్పష్టరూపం గుర్తొచ్చింది. కొన్ని క్షణాలు మౌనంగానే ఉంది. కాసేపట్లోనే అనిల్ నిద్రలోకి జారుకున్నాడు.

రికార్డ్ వర్క్ ముగించాక స్వప్న అక్కడే కూర్చుండిపోయింది. ఎందుకో నిద్ర రానట్లుగా కళ్ళు పొడిగా మారాయి. కిటకీలోంచి చీకటి కనిపిస్తోంది. అప్పుడామెకి వరండా రూమ్ కుర్రాడు బాలు నిన్నటిలాగ మళ్ళీ తోటలో తిరుగుతున్నాడేమో అనిపించింది. చప్పున లేచి బయటివైపు లైట్ ఆన్ చేసింది. చూస్తే.. ఎవరూ కనిపించలేదు. ఆ లైట్ అలాగే ఉంచి మళ్ళీ టేబుల్ ల్యాంప్ ఆన్ చేసింది. అక్కడే ఉన్న తన డైరీ తెరిచింది.

అంతకుముందురోజు 'బాలు' అనే పేరు రాసిన పేజీలో ఆ అక్షరాల్ని కొట్టేస్తూ పిచ్చిగీతలు.. గజిబిజిగా.. డిస్టర్బ్ అయిన మనసులా చిరాకుగా కనిపించాయి.

అప్పుడామె మనసు కూడా ఏదోలా.. చిరాకుగా అనిపించింది. తన కాలేజీ, క్లాస్‌మేట్స్.. చుట్టూ ఉన్న సొసైటీ, అమ్మాయిలూ, అబ్బాయిలూ.. స్నేహాలు, కలివిడిగా, విచ్చలవిడిగా తిరగడాలు, ప్రేమలు, విడిపోవడాలు.. ద్వేషాలు, కోపాలు.. అ

## చతురలో ఇదే నా తొలి నవల



ఆకునూరి హాసన్

నేను రాయడం మొదలుపెట్టి అప్పుడే పాతికేళ్లయింది! 'రోలింగ్ స్టోన్ గేదర్స్ నో మాస్' అన్నారని దశాబ్దాలుగా ఎటూ కదలకుండా ఒకచోటే నివాసం.

ఆలోచిస్తూ.. అంతలోనే ఏవో గుర్తొచ్చి కళ్లు విప్పార్చి.. మామూలు ప్రపంచపు మసకలోంచి - మళ్లీ ఎక్కడికో.. ఏ దిగంతాల అంచుల్లోకో ఎగిరిపోవాలనే వెర్రి ప్రయత్నంలో.. అప్పుడప్పుడూ ఇలా రాతలూ.. కథలూ.. నవలలూ..!!

'సీల్డ్ కవర్, అతడి కోసం, అందని ఆకాశం, నిదురించే తోటలో.., శిలాపుష్పం, తెల్లచీకటి, అందమైన తుపాన్' నవలలు సీరియళ్లుగా పత్రికలలో వచ్చాయి. ఇంకా అరవై వరకూ కథలూ..! ఇప్పుడు ఈ 'బ్యాచిలర్ ఆఫ్ లవ్' నవల చతురలో..!

ఇష్టం కన్నా, ప్రేమకన్నా ఇంకా మించింది.. ఏదో, ఎక్కడో ఉందనే ఆశతో.. అందుకోవాలనే తపనతో.. ఇంకా ఇలా మామూలు జీవితంలో ఇమడలేననిపించినప్పుడల్లా.. కథో.. నవలో రాస్తూ.. ఇలా..!

చిరునామా :
ఆకునూరి హాసన్
డబ్ల్యుబి. 3-384/4, రోడ్ నెంబర్ : 1
విజయలక్ష్మీపురం, బాపట్ల - 522 101
గుంటూరు జిల్లా

న్నీ కలగాపులగమై మనసులో ఆలో చనలు అల్లుకుపోయాయి.

అలానే కూర్చుండిపోయింది స్వప్న.

సరిగ్గా అదే సమయంలో ఇంట్లో తమ్ముడు శ్రీకాంత్ కాలేజ్ బుక్ చదువు కుంటూ ఉంటే.. మూగదైపోయిన అనిత అనే అమ్మాయి రైటింగ్ ప్యాడ్‌కి క్లిప్‌చేసిన అందమైన డిజైన్‌తో ఉన్న గులాబీరంగు పేపర్ మీద స్కెచ్ పెన్‌తో రాయసాగింది.

'ప్రేమ- రూపం లేని కెమికల్ రియా క్షన్. దీనికి ప్రారంభం, ముగింపూ.. రెండూ ఉండవు. ప్రేమ- ఆకాశం లాం టిది. కనిపించని శూన్యంలో.. విశ్వంలోని నక్షత్రాల్ని, గ్రహాల్ని, పాలపుంతల్ని నియం త్రించే అద్వితీయమైన శక్తిలాంటిది. దీనికి హద్దులు, సరిహద్దులు ఉండవు.

వర్షించే మేఘాన్ని తాకాలనుకుంటే.. చేతికి అందదు! ఆ మేఘం కురిపించిన వాన చుక్కలే మనకు మిగులుతాయి! అదే.. ప్రేమ! రంగు, రుచి, వాసన లేని స్వచ్ఛమైన బాష్పకణం! ప్రేమ.. బతికి స్తుంది. బతుకునీ ఇస్తుంది.

ప్రేమించడం, ఆ ప్రేమని వ్యక్తపర చడం.. స్వచ్ఛమైన, గాఢమైన ప్రేమని గుండె నాలుగు గదుల్లో పచ్చటి జ్ఞాపకా లుగా, నులివెచ్చటి అనుభూతులుగా మలు చుకోవడం.. ఎంతమందికి తెలుస్తుంది? నిన్ను చూసి ఎన్నో రోజులయింది! ఎలా ఉన్నావు? ఏం చేస్తున్నావు? నీ కోసమే ఎదురుచూ సే..

నీ.. నేను!'

రాయడం పూర్తిచేశాక ఈజీఛైర్‌లో వెనక్కి వాలి కళ్లుమూసుకుంది అనిత. అప్పుడామె కళ్లలో ఏవేవో దృశ్యాలు గిర్రున తిరిగాయి.

తన చేతుల్తో శశాంక్‌ని చుట్టేసి దగ్గరకు హత్తుకున్న క్షణాలు.. అతని గుండె మీద తలానించి.. అల్లుకున్న నిశ్శబ్దంలోంచి అతని గుండె లయబద్ధంగా కొట్టుకునే శబ్దం.. వింటూ కళ్లుమూసుకున్న సన్నివే శాలు.. తన లేత పెదవులతో ముడివడిన అతని పెదవుల వెచ్చదనం.. ముద్దులతో చేసుకున్న వాగ్దానాలు.. గుర్తొచ్చాయి.

అంతగా ఇష్టపడి, ప్రేమించిన తను.. విషం కలిపిన జ్యూస్ బాటిల్‌ని ఈ చేతు ల్తోటే శశాంక్‌కి అందించింది. ఈ చేతు లతో అతని జీవితాన్ని పెనవేసుకుని.. ఇదే చేతులతో మృత్యువుకి అప్పగించింది!

జరిగిపోయిన సంఘటన మళ్ళీ మళ్ళీ జ్ఞాపకం రాసాగింది.

మనసుని బ్లాంక్‌గా మార్చుకుంటూ.. కొన్ని క్షణాలు అలాగే కళ్లు మూసుకుంది అనిత. శశాంక్! శశాంక్!! గుండెగదుల్లో గుడిగంటలా ఈ పేరు మార్మోగేలా పదే పదే తల్చుకుంటూ పిలుచుకుంది. గొంతు దాటి మాటగా మారలేని ఈ అక్షరాలు గుండె గదుల్లో మాత్రం.. మార్మోగాయి.

ప్రేమ కోసం అతను చనిపోయాడు. ప్రేమతోనే ఆమె ఇంకా బతికి ఉంది.. ఈ లోకంలో లేని అతడిని ఎంత త్వరగా చేరాలా? అని ఎదురుచూస్తూ!!

ఏదో గుర్తొచ్చినట్లుగా చప్పున లేచి, రైటింగ్‌ప్యాడ్‌కి క్లిప్‌చేసిన ఇంతసేపు తను రాసిన పేపర్‌ని తీసి నీట్‌గా మడతలు పెట్టింది అనిత.

అదే హాల్లో అప్పటిదాకా చదువుకుం టున్న శ్రీకాంత్ నిద్ర వస్తుండడంతో ఆపు లించి, క్రచెస్‌తో గదిలోకి వెళ్లబోయాడు.

తమ్ముడ్ని చూసి ఈజీఛైర్‌లోంచి లేచింది అనిత. అనితని చూసి బ్లాంక్‌గా నవ్వాడు శ్రీకాంత్.

చిన్నగా తలూపిన ఆమె, అతడి దగ్గరకొచ్చి అప్పటిదాకా రాసిన పేపర్‌ని, మడతలు పెట్టి.. అతని చేతికిచ్చి 'సరేనా?' అన్నట్లుగా తలూపింది.

అక్క ఇచ్చిన పేపర్‌ని చూడగానే తను ఏంచేయాలో శ్రీకాంత్‌కి అర్థమైపోయింది. టేబుల్ మీద ఉన్న కాలేజీబ్యాగ్ తీసి,

లైబ్రరీలో రేపు వాపసు చేయాల్సిన రిఫరెన్స్‌బుక్ మధ్యపేజీల్లో దాన్ని ఉంచాడు.

తమ్ముడు చేస్తున్న పని గమనిస్తున్న అనిత ముఖంలో ఏదో తెలీని అనుభూతి.. కళ్లలో ఒకవిధమైన దిగులు, బెంగ, సంతృప్తి, అన్నీ కలగాపులగంగా కనిపించాయి.

"సరే అక్కా! రేపు లైబ్రరీలో రిటన్ చేస్తాను ఈ బుక్‌ని. ఇది అందరికీ కావాల్సిన రిఫరెన్స్‌బుక్. రేపు ఎవరో ఒకరు తీసుకెళ్తారు. చూద్దాం ఏం జరుగుతుందో" అన్నాడు శ్రీకాంత్.

కాలేజీ బస్ దిగి ఇంటికెళ్తోంది స్వప్న.

చిన్నప్పటి క్లాస్‌మేట్ సందీప్ - చదువు ఆపేసి అల్లరిచిల్లరగా తిరుగుతూ, అమ్మాయిల్ని టీజింగ్ చేస్తున్నాడు. ఫ్రెండ్స్‌తో కలిసి బస్టాప్‌కి, ఇంటికి మధ్య ఉన్న రోడ్‌లోని టీస్టాల్ దగ్గర బైక్‌ల మీద కూర్చుని వచ్చేపోయేవాళ్లని కామెంట్ చేయడం స్వప్న గమనిస్తూనే ఉంది.

ఈ మధ్య సందీప్ తను కనిపించగానే ఏదోవంకతో 'స్వప్నా' అని పిలిచి మాట్లాడాలని ప్రయత్నిస్తుంటే, తను చిరాకుగా ముఖం తిప్పుకుని వెళ్లిపోతోంది.

ఇప్పుడు సరిగ్గా అక్కడే టీస్టాల్ దగ్గర తన గ్యాంగ్‌తో కూర్చుని ఉన్నాడు సందీప్. దూరంనుంచే తనని చూసి అతను దగ్గరకి రావడం గమనించింది స్వప్న.

వాడికి గట్టివార్నింగ్ ఇవ్వాలని ప్రతిసారీ అనుకుంటోంది. కానీ తెలీని భయంతో నోరు పెగలడం లేదు. నాన్నకి వీడి గురించి చెబితే, ఆయన ఏమైనా హడావుడి చేస్తారేమో అని భయం. ఏం చేయాలో తెలీనట్లుగా నడవసాగింది.

దగ్గరకొచ్చిన సందీప్ "ఏం స్వప్నా! మీ వరండా రూమ్ మా ఫ్రెండ్‌కి కావాలని చెప్పాగదా! వేరేవాళ్లకి ఇచ్చేశారేంటి? నా మాటంటే లెక్కలేదా? " దబాయించాడు.

సందీప్ ఇలా అంటాడని ఊహించని స్వప్న ధైర్యం తెచ్చుకుని "ఓవర్ చేస్తున్నావ్! మా ఇల్లు మా ఇష్టం. ఎక్కువగా మాట్లాడకు" అంది.

సందీప్‌కి సర్రున కోపమొచ్చింది.

"ఏంటీ? చాలాదూరం వచ్చావే! అవన్నీ నాకనవసరం. రెండ్రోజుల్లో ఖాళీ చేయించి మా ఫ్రెండ్‌కివ్వాలి. అర్థమైందా? " చాలా రాష్‌గా అన్నాడు.

దాంతో స్వప్న కళ్లలో నీళ్లు తిరిగాయి.

సరిగ్గా అదే సమయంలో టీస్టాల్ దగ్గర నిలబడి ఉన్న ఒక యువకుడు సగం తాగిన టీగ్లాస్‌ను అక్కడ పెట్టి కూల్‌గా నడుచుకుంటూ వీళ్ల దగ్గరకి వచ్చాడు.

"ఏంటి బాస్! గొడవేంటి? రూమ్ ఖాళీ అంటున్నావేంటి? " కూల్‌గా అన్నాడు.

సందీప్ అతడివైపు ముఖం చిట్లించి చూసి, "ఏయ్! నీకెందుకోయ్? నీ పని చూసుకో!" అన్నాడు.

"అహఁ! రోడ్డుమీద అమ్మాయిని దబాయిస్తుంటేను.." అన్నాడు.

"ఎవడ్రా నువ్వు? మా పర్సనల్ మేటర్ నీకెందుకు? పో!" కసిరాడు సందీప్.

"పర్సనల్ మేటరా? సారీ అన్నయ్యా!" అని చెప్పి రెండడుగులు వెనక్కేశాడతను.

అప్పుడు నోరు విప్పింది స్వప్న. "అది కాదు, మా వరండా రూమ్ వాడి ఫ్రెండ్‌కి ఇవ్వమని గొడవ చేస్తున్నాడు. వీడికి ఇదే పని.. ఈవ్‌టీజింగ్ చేయడం" అంది.

స్వప్నవైపు అలాగే చూస్తూ.. సందీప్‌తో "అదేంటి బాస్! పర్సనల్ మేటర్ అన్నావ్? " మళ్లీ స్వప్నని చూసి "మీ ఇల్లు.. మీ ఇష్టం.. కదండీ! నేనయితే చెప్పుదీసి నాలుగు తగిలించేవాడ్ని" అని చెప్పి మరో రెండడుగులు వెనక్కి వేసి తమాషా చూస్తూ నిలబడ్డాడు.

"ఏరా! ఎక్కువ మాట్లాడుతున్నావ్! నేనెవరో తెలుసా? " చూపుడు వేలితో బెదిరిస్తూ అన్నాడు సందీప్.

అప్పుడొచ్చింది స్వప్నకి మొండిధైర్యం.

"ఏంట్రా వాగుతున్నావ్? ఆవారాలాగా గాలికి తిరిగే నీకు భయపడాలా? మా ఇల్లు.. మా ఇష్టం.. మాకు నచ్చిన వాళ్లకి ఇచ్చుకుంటాం!" అంటూ చప్పున కిందకి వంగి చెప్పుదీసుకుంది స్వప్న.

ఊహించని పరిణామానికి సందీప్ షాక్ అయ్యాడు. అందరి ముందూ నిజంగానే స్వప్న తిరగబడితే..? ఇలా ఊహించి వెంటనే వెనక్కి తిరిగి ఏమీ మాట్లాడకుండా టీస్టాల్ దగ్గరకెళ్ళి, బైక్ స్టార్ట్‌చేసి వెళ్లిపోయాడు. దాంతో అతని ఫ్రెండ్స్ కూడా ఎవరికి వాళ్లు జారుకున్నారు.

దాంతో స్వప్నకి గుండె నిండా నవ్వు, ఆనందం పొంగాయి. 'హమ్మయ్య!' అనిపించింది. కొద్దిదూరంలో నిలబడి ఉన్న ఆ అపరిచిత యువకుడ్ని చూసి చిన్నగా, రిలీఫ్‌గా నవ్వింది.

"చాలా థ్యాంక్సండీ! మీరలా చెప్పకపోతే ఇంత ధైర్యం వచ్చేది కాదు. వీడికి రోజూ భయపడుతూనే ఉండేదాన్ని" అంది.

"దీనికి థ్యాంక్స్ ఎందుకు? ఇలాంటి వెధవలకి ఒక్కసారన్నా దెబ్బలు పడాల్సిందే!" అన్నాడు.

ఇక అక్కడ ఉండలేనట్టుగా ముందుకి అడుగులేస్తూ "ఎనీవే, మెనీ మెనీ థ్యాంక్స్! నా పేరు స్వప్న! బై!" చెప్పి వెళ్ళింది.

పొడవాటి సిమెంట్ రోడ్డుమీద వడివడిగా నడుస్తున్న ఆమెనే చూస్తూ ఉండిపోయాడు అతను.

సరిగ్గా అప్పుడు అతని భుజం మీద చెయ్యేసి "హాయ్ బాలూ! ఏం చేస్తున్నావ్? " అంటూ పిలిచారు ఎవరో.

వెనక్కి తిరిగి చూస్తే- ఆరుగురు పిల్లలు.. క్రికెట్ బ్యాట్లతో.. అనిల్!

"ఏంటి బాలూ! ఏం చేస్తున్నావు? ఆఫీస్ నుంచి త్వరగా వచ్చావా? " అన్నాడు.

"ఏమీలేదు. అవునూ..! నిన్ను అడిగితే



చెప్పను పో! అన్నావు. మీ అక్క పేరు తెలిసిందిలే" సరదాగా అన్నాడు బాలు.

"అవునా! చెప్పు చూద్దాం!" క్రికెట్ బ్యాట్ భుజం మీద పెట్టుకుని అడిగాడు.

"చెప్పనా? చెప్పనా? చెప్పేస్తున్నా.. స్వప్న" అన్నాడు బాలు.

"నీకెలా తెలుసు? " అర్థం కానట్లుగా అడిగాడు అనిల్.

నవ్వి ఊరుకున్నాడు బాలు.

★ ★ ★

ఇంటికి చేరుకున్న స్వప్న, తలనొప్పిగా ఉందని చెప్పి మంచం ఎక్కింది.

కాసేపటికి ఇంటికి వచ్చిన అనిల్, బాలు రూమ్‌లో క్రికెట్ ఆటసామానులు సర్దుకున్నాడు.

"నాకు రేపు ఆఫీసు లేదు. కొన్ని వస్తువులు తెచ్చుకోవాల్సిన పనివుంది. ఊరె



ళ్తున్నా! మళ్ళీ సోమవారం ఉదయం వస్తాను" అనిల్‌తో చెప్పాడు బాలు.

"అవునా? ఏ ఊరు? అమ్మానాన్న.. ఇంకా ఎవరుంటారు అక్కడ?" చిన్నబ్యాగ్‌లో ఏవో సర్దుకుంటున్న బాలుని చూస్తూ అడిగాడు అనిల్.

కొన్నిక్షణాలు మౌనంగా ఉన్నాక.. "నాకు ఎవరూ లేరు! ఊహ తెలిసేసరికే అనాథ శరణాలయంలో ఉన్నాను. అదే ఇల్లు. అక్కడ యాభైమంది పిల్లలు. వాళ్ళే నా వాళ్ళు.." చెప్పాడు నవ్వుతూ.

ఆశ్చర్యంగా కళ్ళు పెద్దవి చేశాడు అనిల్.

"నా పేరు కూడా నిక్‌నేమ్! అదే అసలు పేరుగా రికార్డుల్లో రాశారు. ఓకేనా? ఇప్పుడు నేను చెప్పింది ఇక్కడే మర్చిపోవాలి!" అన్నాడు.

అనిల్ కెందుకో 'బాలు అనాథ' అని తెలిశాక మనసంతా అదోలాగ అయిపోయింది. కానీ అంతలోనే సర్దుకున్నాడు.

"సరే! మర్చిపోతాను! నువ్వూ ఆర్ఫన్ అనే విషయం మర్చిపోవాలి" అన్నాడు.

అనిల్ భుజం మీద చేత్తో తట్టాడు బాలు. "నాకేమీ అలాంటి ఫీలింగ్ లేదులే! నేను నా జీవితంలో చాలా హ్యాపీగా, సంతృప్తిగా ఉన్నాను" అన్నాడు.

"మరి, ఈ రూమ్ కీస్ తీసుకెళ్తున్నావా? రేపు హాలిడే కదా! క్రికెట్ కిట్ కావాలి. ఆట అయ్యాక మా ఫ్రెండ్స్ ఇక్కడికి వస్తారు. ఎలా మరి?" అడిగాడు అనిల్.

"ఓహో! నీ సమస్య అదా! నువ్వు నా ఫ్రెండ్‌వి కదా! ఏం చేస్తాను మరి!

బయట స్టాండ్‌లో నీ బ్లాక్ కలర్ స్కూల్ షూస్‌లో రూమ్ తాళాలు పెట్టివెళ్తా! ఎవ రికీ తెలియకుండా తీసుకో! మళ్ళీ అక్కడే పెట్టేయ్!" చెప్పాడు బాలు.

"ఓకే.. డన్! అమ్మ పిలుస్తోంది.. వెళ్తున్నా!" చెప్పి పరిగెత్తాడు అనిల్.

ఆ రోజు రాత్రి భోజనాలప్పుడు అమ్మా, నాన్నా ఏదో మాట్లాడుకుంటూంటే టీస్టాల్ దగ్గర జరిగిన సంగతి చెప్పాలా? వద్దా? అని ఆలోచించింది స్వప్న.

చివరికి సందీప్ గురించి చెప్పేసింది. అయితే ఎవరో ఒక యువకుడొచ్చి తనను ఎదిరించమని చెప్పడం దాచేసింది.

అంతా విన్నాక "మంచి పనిచేశావు! వాళ్ళ నాన్న నాకు ఎప్పటి నుంచో తెలుసు. సందీప్ గాలికి తిరుగుతున్నాడని చెప్పి చాలాసార్లు బాధపడ్డాడు. పోనీలే కొట్టకుండా వదిలేశావు" అన్నాడు స్వప్న తండ్రి రంగనాథ్.

'హమ్మయ్య!' అనుకుంది స్వప్న.

ఇంతలో అనిల్ అందుకుని "నాన్నా! బాలు ఇందాక వాళ్ళ ఊరెళ్ళాడు" అన్నాడు.

"బాలూ..! ఓ..! వరండా రూమ్ కుర్రాడా? చెప్పాడ్లే! అయ్యగారికి అప్పుడే ఫ్రెండ్ అయ్యాడా ఏంటి? " కొడుకు వైపు చూస్తూ అడిగాడు తండ్రి.

"మరి! అవకుండా ఉంటాడా? నాకు చెప్పాడు నాన్నా ఊరెళ్తున్నానని.." అన్నాడు అనిల్.

భోజనాలయ్యాక కాసేపు అందరూ కలిసి టీవీ చూశారు.

ఏదో ఛానల్‌లో ప్రేమ జంటకి సంబం ధించిన వార్త వస్తూంటే.. స్వప్న తండ్రి ముఖంలో ఫీలింగ్స్ మారిపోయాయి. పెద్దల్ని ఎదిరించి, వాళ్ళు కాదన్నా విన కుండా పెళ్ళి చేసుకున్న జంటకి సంబంధిం చిన స్టోరీ టెలీకాస్ట్ అవుతోంది.

అది అలా చూస్తూ.. చప్పున అనిల్ చేతిలోని రిమోట్ లాక్కొని వేరే ఛానల్ మార్చాడు ఆయన. ఇది గమనించిన జాన కమ్మకి ఎప్పటి జ్ఞాపకమో మనసు పొరల్లో మెదిలినట్లుగా చిన్నగా నిట్టూ ర్చింది. దిగులు తెరలాంటిది ఆమె హృద యాన్ని తాకినట్లయింది. వెంటనే అక్క డ్నుంచి లేచి వరండాలోకి నడిచింది.

రంగనాథ్ అది గమనించాడు. తల్లి మనసులో ఏ జ్ఞాపకం కదిలిందో ఆయనకి అర్థమైంది. ఎందుకో ఓ విధమైన దిగులు.. గుండెని అలా పట్టుకోవడంతో, బలవంతాన మనసులోని సున్నితమైన భావాన్ని అణిచేసి.. ఫీలింగ్స్‌కి అతీతమైన స్థితిలోకి రావడానికి ప్రయత్నించాడు.

సరిగ్గా అప్పుడు రంగనాథ్‌కి ఒక స్త్రీమూర్తి గుర్తొచ్చింది. అంతా క్షణంలోనే.. తల విదిలించి.. జ్ఞాపకాల్ని వదిలించుకునే ప్రయత్నం చేశాడు.

అక్కడ్నుంచి లేచి "నిద్ర వస్తోంది! అమ్మని లోపలికి రమ్మను! బయట చలిగా వుంది" అని చెప్పి బెడ్‌రూమ్‌లోకి వెళ్లాడు.

ఇదంతా గమనించని స్వప్న, అనిల్.. ఏవో మాటల్లోపడ్డారు.

అపరిచిత వ్యక్తి సందీప్‌ని చెప్పుతో కొట్ట మన్నాడనే సంగతి తమ్ముడికి చెప్పాలా? వద్దా? అనే డైలమాలో ఉంది స్వప్న.

కాసేపటికి హాల్లో తమ్ముడితో రోజు లాగే మాట్లాడసాగింది స్వప్న. అప్పుడు సందీప్‌తో జరిగిన గొడవ సంగతి చెప్పి- అక్కడే ఉన్న ఒక అపరిచితుడు ఎదురుతి రిగేలా తనకు ధైర్యం చెప్పాడని- అతనె వరో తెలీదని అంది స్వప్న.

అక్క చెప్పింది విన్నాక అనిల్ ఆలోచ నలో పడ్డాడు.

"ఇందాక క్రికెట్ ఆడి వస్తోంటే టీస్టాల్ దగ్గర బాలు కనిపించాడక్కా! అక్కడతను తప్ప మరెవరూ లేరే! నీతో మాట్లాడింది బాలూయేనా అనిపిస్తోంది" అన్నాడు.

"అలా ఎందుకనిపిస్తోందిరా? " అడి

గింది స్వప్న.

"నీ పేరు అడిగాడని చెప్పా కదా! నేను చెప్పనన్నాను. ఇందాక మీ అక్కపేరు తెలిసిందిలే అని నీ పేరు చెప్పాడు. నువ్వు గానీ అతనితో చెప్పావా? " అడిగాడు.

ఇందాక తను అతను అడగకపోయినా పేరు చెప్పింది.

అంటే వరండా రూమ్‌లో దిగిన బాలూ, అతనూ ఒక్కరేనా? స్వప్న గుండె వేగంగా కొట్టుకోసాగింది.

అనిల్ ప్రశ్నకి సమాధానం ఇవ్వకుండా అలాగే మంచానికి అంటుకుపోయింది. కనురెప్పలు ఆర్పకుండా అలాగే సీలింగ్ వైపు చూడసాగింది.

వరండా రూమ్‌లో రెంట్‌కి దిగిన బాలూని ఒక్కసారి చూడాలనిపించింది. ఇలా అనిపించడం కూడా కేవలం ఒక్క క్షణంసేపే.. మరుక్షణం మామూలుగా మారిపోయింది.




**వీ**కెండ్ పార్టీలో ఉంది శిరీష.

ఆ రోజు కాలేజీలో క్లాస్‌మేట్ బ్యాచిలర్స్ పార్టీ. అందరూ బలవంతపెడితే పబ్‌కి వచ్చింది. తెలిసిన ముఖాల్ని పలకరించి ఒక్కతే కూర్చుని ఫ్రూట్‌కాక్‌టైల్స్ తీసుకుంటూ.. చివరికి బోర్ అనిపించి లేచింది.

అందరినీ తప్పించుకుంటూ బయటకు నడిచి, తన కారు లోపల కూర్చుంది. కారు స్టార్ట్ చేయబోతుంటే సడన్‌గా కళ్ళు తిరిగినట్లుగా అనిపించింది.

కొన్నిక్షణాలు కళ్ళు మూసుకుని, తర్వాత వాటర్ బాటిల్ కోసం చూస్తే, అక్కడ ఏదో ఐడీకార్డ్.. దాన్ని తీసుకొని రెండోచేత్తో వాటర్ బాటిల్ ఓపెన్ చేసి రెండు గుక్కలు తాగాక.. కాస్త చేదుగా అనిపించింది.

బాటిల్ అక్కడ పెట్టేసి, ఐడీకార్డ్ ఎవరిదా అని చూసింది. ఆ కార్డ్.. బాలుది! అతడి ఫొటో, ఫోన్ నెంబర్‌తో సహా ప్రింట్ చేసిన తమ కంపెనీ కార్డ్. మెడలో తగిలించుకునే స్ట్రాప్‌తో సహా..

'అరెరె! ఇక్కడ ఎప్పుడు పడిపోయింది బాలూ కార్డ్' అని ఆలోచించింది శిరీష. మధ్యాహ్నం కారులో వచ్చాడు కదా! బస్టాప్ దగ్గర దిగిపోయేప్పుడు మర్చిపోయి ఉంటాడు అని అర్థమైంది.

ఐడికార్డ్‌లో బాలు ఫొటో.. అలాగే చూసింది శిరీష.

'బాలు' పేరంటే అమెకి 'మరో చరిత్ర' సినిమా అంత ఇష్టం. ఆ సినిమా లెక్కలేనన్నిసార్లు చూసింది. అదే పేరున్న ఇతడి మీద తనకి ఆసక్తి కలుగుతోందా?

పెదాలపై చిరునవ్వు మెరిసింది.

'ఏ తీగ పువ్వునో.. ఏ కొమ్మచేతినో.. కలిపింది ఏ వింత అనుబంధమవునో' పాట గుర్తొచ్చింది. మళ్ళీ నవ్వొచ్చింది.

ఐడీకార్డ్‌లోని బాలు ఫొటోని చూస్తూ.. అతని ఫోన్ నెంబర్‌ని తన సెల్‌లో ఫీడ్ చేసుకుంది. బాలుకి ఫోన్ చేయాలనే చిలిపి కోరిక కలిగింది శిరీషకి.

రాత్రి పన్నెండు గంటలవడానికి అయిదు నిమిషాల సమయం ఉంది. ఇంతకు ముందు తాగిన ఫ్రూట్‌పంచ్ కాక్‌టెయిల్‌లో ఎక్కువ మోతాదులో కలిపిన ఓడ్కా.. అప్పుడామెకు నరాల్లో, రక్తంలో పనిచేయడం మొదలుపెట్టింది. అంతే! బాలు నెంబర్‌కి డయల్‌చేసింది.

సిగ్నల్ దొర్కపోవడంతో 'బీప్.. బీప్' అనే శబ్దం, తర్వాత 'నాట్ రీచ్‌బుల్' అనే వాయిస్. అప్పటిదాకా బిగపట్టిన ఊపిరి వదిలేసింది శిరీష. మళ్ళీ డయల్ చేసింది. అలా నాలుగైదుసార్లు.. అయినా అలాగే నాట్ రీచ్‌బుల్.

'ఏమయ్యాడు ఈయనగారు? ఊరెళ్ళాడా?' అనుకుంటూ కారు స్టార్ట్‌చేసి ముందుకి దూకించింది.

అదే సమయంలో స్వప్న అనే అమ్మాయి కూడా తనలాగే 'బాలు' గురించి ఆలోచిస్తోందని శిరీషకి తెలీదు. 'మరోచరిత్ర' సినిమాని, అందులో హీరో పేరునీ ఇష్టపడే ఆమెకి.. అదే సినిమాలో హీరోయిన్ పేరు 'స్వప్న' అని బాగా తెలుసు.

★ ★ ★

రూమ్‌లో చుట్టూ చూసింది స్వప్న. అంతకు ముందులా కాకుండా చాలా నీట్‌గా ఉంది. ఇంతలో టేబుల్ దగ్గరకెళ్ళిన అనిల్ అక్కడున్న బుక్స్ తీసి చూడడం మొదలుపెట్టాడు. ఓ పుస్తకంలోంచి బాలు ఫొటో కిందపడింది. చప్పున అది తీసుకుని, "అక్కా! ఇదిగో బాలు ఫొటో! నిన్న నీతో మాట్లాడింది ఇతనో? కాదో? చూస్తావా?" అన్నాడు అనిల్.

కానీ, స్వప్న మాత్రం తల అడ్డంగా ఊపింది. నిన్న తనలో ఎదిరించాలనే తెగింపు కలగజేసిన వ్యక్తి.. ఈ రూమ్‌లో ఉంటున్న బాలు.. ఇద్దరూ ఒక్కరేనని అర్థమైంది తనకి. కానీ నిన్న అంతగా మనసులో రిజిష్టర్ కాని రూపాన్ని ఇప్పుడీ ఫొటోతో పోల్చి చూసుకోవడం మాత్రం కరెక్ట్ కాదనిపించింది. ప్రత్యక్షంగా చూడాలని నిర్ణయించుకుంది.

"వద్దులేరా!" అంది తమ్ముడితో.

"ఏం? ప్లీజ్ అక్కా!" ఫొటో చేతిలో పట్టుకుని అడిగాడు అనిల్.

"వద్దన్నా కదా! ఆ ఫొటో అక్కడే పెట్టెసెయ్!" అని గదిలోంచి బయటకి నడిచింది స్వప్న.

బాలు ఫొటోని బుక్‌లో పెట్టేసి అనిల్ ఆమె వెనకాలే నడిచాడు. ఇద్దరూ వరండాలో కూర్చుని చెస్ ఆడుకోవడం మొదలుపెట్టారు.

మధ్యలో ఏదో గుర్తొచ్చినట్లుగా "ఇంతకీ బాలు ఎక్కడికెళ్ళాడు? ఇంటికా?" అడిగింది స్వప్న.

బాలుకి ఎవరూ లేరనీ, అనాథ శరణాలయానికి వెళ్ళాడనీ అక్కతో చెప్పేయాలనిపించింది అనిల్‌కి. కానీ ఆ విషయం ఎవరికీ చెప్పకూడదని బాలు మాట తీసుకోవడం గుర్తొచ్చి 'అవును' అన్నాడు.

చెస్ ఆడుతూ.. ఎత్తుకి ఎత్తుకీ మధ్య సమయంలో అక్క, తమ్ముడు.. లాక్ వేసిన వరండా గదిని అప్పుడప్పుడు చూడడం.. బాలుని తల్చుకోవడం చేస్తున్నారని ఎవరికి వాళ్ళు గమనించుకోలేదు.

★ ★ ★

కాలనీలోని కల్చరల్ క్లబ్‌లో కూర్చుని ఉన్నాడు రంగనాథ్. క్లబ్ ఆవరణలోని వాకింగ్ ట్రాక్‌లో చాలామంది తన వయసువాళ్ళు వాకింగ్ చేస్తున్నారు. మరికొందరు ఒకచోట చేరి ఏదో మీటింగ్ పెట్టుకున్నారు. వాళ్ళెవరితో కలవాలనిపించలేదు రంగనాథ్‌కి. మనసంతా ఎందుకో అలజడిగా అనిపించింది. రాత్రి ఏదో టీవీఛానల్‌లో ప్రేమజంట- ఇంట్లో వాళ్ళు కాదన్నా ఒకటై, జీవితంలో ఉన్నత శిఖరాలకి చేరుకోవడం గురించిన స్టోరీ చూసినప్పటి నుంచీ- మర్చిపోవాలనుకునే గతం గుర్తుకొస్తూనే ఉంది రాత్రంతా.

దీనికితోడు ఎప్పటి స్నేహితుడో ఇందాక ఫోన్‌చేసి మాట్లాడాడు. చివర్లో "నీలిమ ఎక్కడుంది? ఏమన్నా తెలుస్తున్నాయా సంగతులు?" అని అడిగాడు.

ఈ ప్రశ్న గతాన్ని ముందు నిలబెట్టింది. ఇక ఆలోచనకి అంతం లేకుండా పోయింది.

‘చమత్కారం’

# శ్రీకృష్ణుడికో చురక

సాక్షాత్తు శ్రీకృష్ణభగవానుడిపై శ్రీనాథమహాకవి విసురు ఈ పద్యం. వైభవప్రాభవాలు కోల్పోయి పలనాడు చేరిన శ్రీనాథుడికి అక్కడి తిండి సహించేదికాదు. అసలే భోజనప్రియుడైన ఆయనకు అక్కడి జనం తినే జొన్నన్నం నచ్చలేదు. నవకాయపిండివంటలతో రాజభోజనానికి అలవాటు పడిన జిహ్వ చింతచిగురు, బచ్చలాకు కూరలు తినలేక అల్లాడిపోయింది. అదుగో ఆ సందర్భంలో చెప్పిన పద్యమిది.



పుల్లసరోజనేత్ర! అల పూతన చన్నుల చేదుద్రావి నా
డల్ల దవాగ్ని ద్రింగితినటంచును నిక్కెదవేల? తింత్రిణీ
పల్లవ యుక్తమైన ఉడుకు బచ్చలి శాకము జొన్నకూటితో
మెల్లన నొక్కముద్ద దిగమ్రింగుము నీ పస కాననయ్యెడున్!

దీని స్థూలార్థం ‘వికసించిన తామరపూలవంటి కన్నులుగల శ్రీకృష్ణా! పూతన చనుబాలుతాగి, కాలకూటంలాటి ఆ పాలను అరాయించుకున్నానని మిడిసిపడ్డావుగానీ, ఈ సీమకొచ్చి చింతచిగురు బచ్చలికూరతో ఒక్కటంటే ఒక్కముద్ద జొన్నన్నంతిని చూపించు.. నీ సత్తా ఏంటో తేలిపోతుంది’ అని.

అంటే పూతన విషపూరిత పాలకన్నా తను తినే జొన్నకూడు మహాభయంకరంగా ఉందనేది ఆయన ఎత్తిపొడుపు. శ్రీనాథుడా మజాకానా?

- సేకరణ: చంద్రప్రతాప్

నీలిమ! రంగనాథ్ చెల్లెలు. జానకమ్మ కూతురు. దాదాపు పాతికేళ్ళ కిందట క్లాస్ మేట్‌ని ఇష్టపడింది. తను వాళ్ళ పెళ్లికి ఒప్పుకోలేదు. అంతే.. అందర్నీ కాదని అతనితో వెళ్ళిపోయింది. వెళ్ళిపోయింది అనేకంటే.. తనే ఇంట్లోంచి వెళ్ళగొట్టాడు. మళ్ళీ తన ఇంటి గుమ్మం తొక్కొద్దని- రక్తం పంచుకు పుట్టిన చెల్లెల్ని తరిమే శాడు. బంధాన్ని తెంచేసుకున్నాడు.

రంగనాథ్‌కి నోరంతా చేదువిషంలా అనిపించింది. చెల్లెలి జ్ఞాపకాలు ఈరోజు ఇంత ఎక్కువగా ఎందుకు చుట్టుకుంటు న్నాయో అర్థం కాలేదు. పాతికేళ్ళుగా.. ఆమె ఊసైనా ఎరగడు. కూతురి సంగతి మాట్లాడకుండా తల్లి జానకమ్మ నోరునొక్కేశాడు. ఆమెకి సంబంధించిన ఎలాంటి గుర్తులు లేకుండా అన్నీ తీసేశాడు.

కానీ.. గుండె పొరల్లో అట్టడుగున పడి ఉన్న జ్ఞాపకాలు మాత్రం ఇంకా అలాగే పచ్చగా ఉన్నాయని రంగనాథ్ ఎప్పుడూ అనుకోలేదు.

వెంటాడే ఆలోచనల నుంచి తప్పించుకో వడం కోసం కొలీగ్‌కి ఫోన్ చేసి బార్‌కి రమ్మని పదినిమిషాల్లో అతనూ వెళ్లాడు.

అప్పుడప్పుడు ఇలా ఫ్రెండ్‌తో బార్‌కి వచ్చే రంగనాథ్ లిమిట్‌గానే మందు కొడు తుంటాడు.

ఇప్పుడు కూడా ఇలా మొదలుపెట్టి, రెండు పెగ్గులు కొట్టేసరికి.. మర్చిపోవా లని ఆశ పడిన విషయం మళ్ళీమళ్ళీ గుర్తురాసాగింది.

నీలిమ! ఈ పేరుని కూడా ద్వేషిస్తూ వచ్చాడు. మనసులోంచి తొలగించాడు. కానీ.. ఈ రోజు మళ్ళీమళ్ళీ ఎందుకు గుర్తొస్తోంది?

తాగితే మరిచిపోతారు అంటారు. ఇది నిజం కాదు! మర్చిపోవాలని అనుకున్నది మరింత గాఢంగా గుర్తొచ్చి బాధని పెంచడం.. ఆల్కహాలు నైజం అని అర్థమవుతోంది ఇప్పుడు.

"ఇక చాలు! వెళ్దాం!" ఒక్కగుక్కలో గ్లాస్ ఎత్తేసి, టేబుల్ మీద పెట్టాడు రంగనాథ్

"అప్పుడే? " ఆశ్చర్యంగా అడిగాడు కొలీగ్.

ఇద్దరూ నడుచుకుంటూ బయటకొ స్తుంటే, స్టేజ్‌మీద పాటలు పాడుతున్న ఎవరో కుర్రాడు సరికొత్త హిందీపాట అందుకున్నాడు.

★ ★ ★

ఆత్మహత్యాయత్నానికి పాల్పడిన నేరా నికి అనితకి కోర్టు నుంచి సమన్లు వచ్చాయి. ఇల్లు వెతుక్కుంటూ వచ్చిన కానిస్టేబుల్ అనితని చూడగానే మనసు వికలమైనట్లయ్యాడు.

అనిత హాస్పిటల్ నుంచి డిశ్చార్జయిన రోజు స్టేట్‌మెంట్ తీసుకోడానికి వచ్చిన హెడ్‌కానిస్టేబుల్‌తోపాటు ఈ కానిస్టే బుల్ కూడా ఉన్నాడు. ఆత్మహత్యకు ప్రయత్నించిన అనిత మూగదైపోవడం, ఆమెని ప్రేమించిన శశాంక్ చనిపోవడం.. ఒంటరిగా, ఈ లోకంలో మౌనసాక్షిగా మిగిలిన అనిత, చట్టం ముందు దోషిగా నిలబడడం.. ఇదంతా ఎందుకు జరి గింది? ఈ పిల్లలిద్దరూ గత జన్మలో ఏ పాపం చేసుకున్నారు? అని బాధపడ్డాడు ఆ కానిస్టేబుల్.

ఇప్పుడు కోర్టులో హాజరవమంటూ నిందితురాలిగా సమన్లు అందించడం.. ఇంకా బాధ కలిగించింది.

ఆ సమయంలో తమ్ముడు శ్రీకాంత్ కూడా ఇంట్లోనే ఉండడంతో మాటలు రాని అనితకి కోర్టు సమన్లు అందించడం సులువయింది.

"అక్క! కోర్టులో ఏం చేయాలి? " గుండె నిబ్బరంతో అడిగాడు శ్రీకాంత్.

అతనికి ఏ సమాధానం చెప్పాలా అని ఆలోచించాడు కానిస్టేబుల్.

"బోనులో ముద్దాయిగా నిలబడాలి!

సాక్షుల విచారణయ్యాక.. కొన్ని వాయిదాలు కోర్టుకి రావాల్సి ఉంటుంది" అని కానిస్టేబుల్ చెప్పాడు.

అప్పుడు తన ముందున్న టేబుల్ మీది పలక మీద చాక్‌పీస్‌తో ఇలా రాసింది అనిత "నేను నేరం చేశానని.. ఆత్మహత్యాయత్నం చేశానని కోర్టులో చెప్పేస్తే..? "

ఇది చదివిన కానిస్టేబుల్‌కి గుండెలో తెలియని దిగులు, గుబులు కలిగాయి.

"జడ్జిగారు శిక్ష విధిస్తారు. సంవత్సరం జైలు, లేదా జరిమానా లేదా రెండూనూ" నిర్వికారంగా చెప్పాడు కానిస్టేబుల్.

ప్రాణంలా ఇష్టపడిన శశాంక్ లోకం నుంచి వెళ్లిపోతే.. ఒంటరిగా మిగిలిన తను.. జీవితకాలం శిక్ష భరిస్తోంది. చివరి ఊపిరి వదిలేంతవరకూ శశాంక్ లేని లోటుకు మౌనంగా దుఃఖిస్తూ జీవిస్తోంది. అలాంటిది ఆత్మహత్యాయత్నం చేసినందుకు కోర్టు విధించే ఏడాది జైలు శిక్ష ఏ పాటిది? శిక్ష విధించాకయినా చనిపోయిన శశాంక్ తిరిగి వస్తాడా? ఏ కోర్టు తిరిగి శశాంక్‌ని బతికిస్తుంది?

ఇలా ఆలోచిస్తున్న అనిత.. "నేను కోర్టులో నేరం చేశానని ఒప్పుకుంటాను" అని పలక మీద రాసింది.

ఇది చదివిన శ్రీకాంత్ ఎలాంటి షాక్‌కూ గురవలేదు. కానిస్టేబుల్ మాత్రం నిర్ఘాంతపోయాడు.

అవునన్నట్లుగా తల ఊపింది అనిత.

ఇంకేమీ మాటలు రానట్లు, వెళ్తున్నానని కూడా చెప్పకుండా సమన్లు ఇచ్చి వెళ్ళిపోయాడు కానిస్టేబుల్.

"నీకు ఏది చేయాలనిపిస్తే అది చెయ్యి!" అన్నాడు శ్రీకాంత్. అప్పుడు అతని కళ్ళలోంచి కన్నీళ్ళు ధారాపాతంగా కారిపోతున్నాయి.

అనిత కుర్చీలోంచి లేచి వచ్చి తమ్ముడి భుజం మీద చేత్తో చిన్నగా తట్టింది. చెంపల మీద జారుతున్న కన్నీళ్ళని తుడిచి.. గదిలోకి నడిచింది.

## కొత్తగాలి...

**కాకులు, గద్దలు**
**రాబందులు కనబడటం లేదు!**
**అవును అవన్నీ**
**మనుషుల్లోనే దాక్కున్నాయిగా!**

– ధవ్వూరి శ్రీధరాచార్యులు,
సీతారాంబాగ్, హైదరాబాద్

టేబుల్ ముందు కూర్చుని రైటింగ్ ప్యాడ్ మీదున్న తెల్లకాగితం మీద రాయడం మొదలెట్టింది.

"ప్రేమ అనేది ఒక ఫీలింగ్! హృదయాల మధ్య పుడుతుంది. రెండో వ్యక్తితో సంబంధం లేకుండా, తిరిగి పొందకుండా కలుగుతూనే ఉంటుంది. దీనికి ఎడారిలో సైతం ఒయాసిస్సుని ప్రత్యక్షం చేయగల శక్తి వుంటుంది. మనసుకి తట్టుకునే శక్తి ఉందని తెలుసుకోడానికే అప్పుడప్పుడు చిన్న, పెద్దా గాయాలు తగిలించుకోక తప్పదేమో! అది గాయమే అనుకుంటే బాధ కలుగుతుంది. లేకపోతే అది కేవలం ఒక అనుభవం మాత్రమే. అందుకే నువ్వు లేవనే బాధని.. నీ కోసం త్వరగా వచ్చేయాలనే ఆశ అతిక్రమిస్తోంది. ఈ లోకం.. చట్టం.. మనం చేసింది నేరం, తప్పు అంటున్నాయి. నిజమేనేమో? విజయం సాధించాలంటే పోరాటం చేయాలి. కానీ, అపజయం పొందుతామనే భయంతో, ఆందోళనతో పోరాటాన్ని మనమే అంతం చేసుకుని.. మనల్ని మనం ఓడిపోతే.. చివరికి నువ్వెక్కడో..? ఏదో దివ్యలోకంలో..! నేనిక్కడ చట్టం దృష్టిలో నిందితురాలిలా! నేస్తం! తప్పు చేశాం! ఆత్మహత్యకు పాల్పడకుండా.. మన ఆత్మల్ని ఆశయ సాధన కోసం నిరం

తరం సానపెట్టాల్సింది కదూ!"

★ ★ ★

స్వప్న కాలేజీకి, అనిల్ స్కూల్‌కి బయ ల్దేరారు.

"నాన్నని స్కూటీ కొనమంటే వినరు. మనకిలా బస్సెక్కి వెళ్ళడం తప్పుతుంది కదాక్కా!" అన్నాడు అనిల్.

పిల్లలు చదువు తప్ప మరే వ్యాపకం లేకుండా క్రమశిక్షణతో ఉండాలనే అభి ప్రాయం రంగనాథ్‌ది. అందుకే కనీసం ఇద్దరికీ కలిపి ఒక స్కూటీ అయినా కొన లేదు. గేటు తీసుకుని బయటకి వెళుతుం డగా జానకమ్మ "స్వప్నా! ఒక్కసారి ఇటు రావా? " అని పిల్చింది.

"ఏంటి నానమ్మా! వెళ్ళేముందు పిలు స్తావ్? " విసుగ్గా అంది స్వప్న.

"కళ్లద్దాలు కనిపించలేదు. ఈ కేలండర్ మీద ఫోన్‌నెంబర్ రాసుంది. కాస్త ఫోన్ కలిపి ఇవ్వవే! ప్లీజ్!" అంది జానకమ్మ.

"రేయ్! అనిల్ వెళ్ళి చూసి కాల్‌చేయి! పో!" అంది స్వప్న.

"నా స్కూల్‌బస్ వచ్చే టైమయింది. నీకింకా లేట్ ఉందిగా! నువ్వే చెయ్యి!" అంటూ స్కూల్‌బ్యాగ్ తగిలించుకుని వెళ్ళి పోయాడు అనిల్.

ఇక తప్పదన్నట్లుగా స్వప్న కేలండర్ మీదున్న ఫోన్ నెంబర్‌ని చూస్తూ, నానమ్మ చేతిలోని సెల్‌ఫోన్ అందుకుని డయల్‌చేసింది.

కాల్ లిఫ్ట్‌చేసిన అవతలి వ్యక్తి "హలో! బామ్మగారూ! ఎలా ఉన్నారు? చెప్పండి..!" అన్నాడు.

అంతే! ఆ గొంతు వినగానే ఒక్కసారిగా ముఖంలోకి వెచ్చటి ఆవిరి చిమ్మినట్లుగా అనిపించింది స్వప్నకి. ఆ కంఠస్వరం.. టీస్టాల్ దగ్గర సందీప్ గొడవ చేస్తున్న ప్పుడు తిరగబడమంటూ చెప్పిన అపరిచిత వ్యక్తిది!

స్వప్నకి ఏదో తెలీని ఉద్వేగం కలిగింది.

"ఏయ్ పిల్లా! కాల్ కలవలేదా? " పక్క నుంచి అడుగుతోంది జానకమ్మ.

చిన్నగా కంపిస్తున్న చేతుల్తో సెల్‌ఫో న్‌ని నానమ్మకి అందించింది స్వప్న.

మౌనంగా కాలేజీ బ్యాగ్‌తో బయటికి నడిచింది

కాలేజీబస్ ఎక్కాక సీట్లో కూర్చుని ఆలో చనలో పడింది స్వప్న.

నిన్న బాలు ఫొటో అయినా చూడకపో వడం, ఈ రోజు ఫోన్లో అతనితో కనీసం 'హలో!' అనైనా అనకపోవడం గురించి ఆలోచిస్తే.. ఇలా పరోక్షంగా కాకుండా ప్రత్యక్షంగా అతన్ని చూసి, మాట్లాడాలనే ఎవాయిడ్ చేసినట్లు అర్థమయింది.

'అయినా ఇప్పుడు అతన్ని గురించి ఆలో చించడం ఎందుకు? ' అనుకుంటూ కాలేజ్ బుక్ తీసి పేజీలు తిప్పింది స్వప్న.

★ ★ ★

హాస్టల్‌నుంచి తిరుగు ప్రయాణమై వచ్చిన బాలు - ట్రెయిన్ బాగా లేటవ టంతో రూమ్‌కి వెళ్ళకుండా నేరుగా ఆఫీ స్‌కి వెళ్ళిపోయాడు. స్టేషన్‌లోనే ఫ్రెషప్ అవడంతో వర్క్‌లో మునిగిపోయాడు.

చాలా సేపటి తర్వాత మేడమ్ నుంచి పిలుపు వచ్చింది.

రెండు నిమిషాల్లో శిరీష ఛాంబర్‌లోకి వెళ్ళాడు.

లాప్‌టాప్‌లో వర్క్ చేసుకుంటున్న శిరీష ప్రాజెక్ట్ గురించి అయిదు నిమి షాలు మాట్లాడి "ఇంకేంటి బాలూ! వీ కెండ్ ఎలా గడిపారు? పార్టీ? జోష్? " అని అడిగింది.

"లేదండీ! మా ఊరెళ్ళి వచ్చాను" అన్నాడు బాలు.

"ఇంకా..!" అతడి ముఖంలోకి కళ్లా ర్పకుండా చూసింది.

"అంతే..!" పెదవి విరిచాడు బాలు.

"మీ ఐడీ కార్డ్ ఎక్కడ? " అడిగింది.

చప్పున మెడలో చూసుకుని.. ప్యాంట్

రూ.116/- గెలుచుకున్న

# ఉత్తమ సమీక్ష

# మానవత్వపు విలువలకు పట్టం!




సెప్టెంబరు 'చతుర' హృదయంగమంగా ఉంది. పుష్కరాలు ఘనంగా నిర్వహించుకున్న తరుణంలో ప్రచురించిన 'నదీ నరుడు' నవల గోదావరి నేపథ్యంగా సాగి సందర్భోచితంగా ఉంది. పెద్దకథ కూడా హృదయాలను కదిలించేదే. చిన్నికృష్ణుడి ముఖచిత్రం నుంచి పడుచుపిల్ల ఇంద్రనీలాల వనులు దాకా ఆద్యంతం అందంగా, ఆకట్టుకొనేలా ఉంది.

రచయిత సింహప్రసాద్ నవల వర్తమాన సమాజాన్ని పరీక్ష నాళికలో చూపించినంత సునిశితంగా ఉంది. సజీవపాత్రలతో, యథార్థ సంఘటనలతో మెప్పించి, ఏకబిగిని చదివించింది. స్వచ్ఛంగా సెలయేరులా పుట్టిన గోదావరి తన ప్రస్థానంలో ఎన్నో కలుషితాలను మూటకట్టుకుంటూ మలినమవుతోంది. అలాగే స్వచ్ఛమైన పల్లెటూరిలో పుట్టిన వేణుగోపాలరావు ఒకేసారి పై అంతస్తుకి ఎదిగిపోవాలనే పేరాశతో, కన్నతల్లిని, సొంతవూరిని నిర్లక్ష్యం చేశాడు. జీవితంలో ఉత్కృష్టమైన మానవత్వపు విలువలను మంటగలిపాడు. డబ్బే పరమావధిగా, భోగభాగ్యాలే లక్ష్యంగా, ఎందరో అమాయకుల జీవితాలను నిలువునా నట్టేట ముంచడానికి కూడా వెనుకాడలేదు. ఎండమావుల్లాంటి రంగుల ప్రపంచాన్ని నిజమని భ్రమించిన వేణుగోపాలరావుకి, తలదాచుకోవడానికి సొంతవూరే గతి అయింది. మానవత్వపు విలువలతో గుబాళిస్తూ పదిమందికి ఉపయోగపడుతూ, ఆనందంగా జీవిస్తున్నాడు తన బాల్యమిత్రుడు గురుమూర్తి. ఆప్యాయత, అనురాగాలకి మారుపేరైన మూర్తి, అతని కూతురు గౌతమి.. తనలో అడుగంటిన మానవత్వాన్ని తట్టి లేపడానికి ఎంత ప్రయత్నించినా వేణుగోపాలరావులోని అహంభావం వాళ్లని చిన్నచూపే చూసింది. తను అనామకంగా భావించిన సొంత ఊళ్లోనే ఎందరో వ్యక్తులు తనకంటే ఎంతో ఆత్మసంతృప్తితో జీవిస్తున్న తీరు చూసి కూడా వేణుగోపాలరావు తన కపట నాటకాన్ని వదులుకోలేదు. పెను తుపానులో చిక్కుకున్నపుడు తన దగ్గర ఉన్న డబ్బు ఎందుకూ పనికిరాదని తెలిసింది. కటిక దరిద్రులైన కనకమాలక్ష్మి దంపతులు తన ప్రాణాలని నిలబెట్టారని తెలుసుకున్నాకే వేణుగోపాలరావు పునర్జన్మనెత్తినట్లు భావించాడు.



అలాగే 'అదేమన్నమాట' పెద్దకథలో కూడా రైతుల ఇక్కట్లను ఎంతో వాస్తవంగా రచయిత చంద్రకిశోర్ జైస్వాల్ చిత్రించారు. ఈనాడు వ్యవసాయం జూదంగా మారడం, పంట పండించడం మాని రైతు కూలీగా మారడంలో పడే ఆవేదనను మనస్సుకి హత్తుకునేలా చెప్పగలిగారు. మొత్తానికి రెండు కథలూ మనస్సుని బాగా ఆకట్టుకున్నాయి.

**– యస్.వి.వి.యస్.పద్మావతి,**
కాకినాడ

పాకెట్ తడుముకున్నాడు.

"కనిపించడంలేదు! పోయినట్లుంది మేడమ్!" అన్నాడు బాలు.

"పోయిందా? లేక పోగొట్టుకున్నారా? క్లియర్‌గా చెప్పండి బాలు!" కళ్ళలోకి చూస్తూ అడిగింది శిరీష.

"నా అంతట నేను పోగొట్టుకోను! ఎక్కడో పడిపోయినట్లుంది సారీ!" చెప్పాడు బాలు.

"ఇట్సాల్ రైట్ బాలూ! మీ దగ్గర పోయింది! నాకు దొరికింది! నా కార్లో ఉంది" తమాషాగా చెప్పింది శిరీష.

"హమ్మయ్య! అయితే ఫర్వాలేదు! థాంక్ గాడ్!" అన్నాడు బాలు.

"ఇదిగోండి!" అంటూ ఐడీ కార్డ్‌ని అందించింది శిరీష. "మరి..! పార్టీ ఇవ్వాలి" అంది.

ఐడీ కార్డ్ అందుకుని మెడలో వేసు కుంటూ "తప్పకుండా ఇస్తాను" చెప్పాడు.

"సరే..! బై..!" చెప్పింది.

నవ్వి బయటకి నడవబోయాడు బాలు. డోర్ తీస్తుండగా, "ఐడీ కార్డ్‌లాంటి వస్తువులు పోగొట్టుకుంటే.. దొరికినవాళ్ళు తిరిగిచ్చేస్తారు బాలూ! ఇలాగే మనసు కూడా పారేసుకున్నారో.. ఇక అంతే! ఎవ రికైనా దొరికినా.. తిరిగి ఇలా ఇవ్వరు. తమ దగ్గరే ఉంచేసుకుంటారు" అంటున్న శిరీష మాటలు గాలిలో తేలుతూ, పరిమ ళంలా.. అలల్లా తాకాయి.

ఎందుకో ఒక్కసారి గుండె జల్లుమంది. వెనక్కి తిరిగి చూడకుండా అలాగే బయ టకి వచ్చేశాడు బాలు. సరిగ్గా అప్పుడు.. అతని కళ్ళలో ఎవరో అమ్మాయి అస్పష్టంగా కనిపించింది.

ఫలానా రూపం అంటూ తెలీని అపరి చిత యువతి! ఎవరు? ఎవరు? ఆమె ఎవరు? గుప్పెడంత గుండెని ప్రేమ గాలంతో తనవైపు లాక్కుంటున్నది ఎవరు? తనలో తనే చిన్నగా నవ్వు కుంటూ సీట్‌వైపు నడిచాడు.




ఆ రోజు కాలేజీలో సెమినార్ ఏర్పాటు చేశారు. క్లాస్ అవగానే అందరూ ఆడిటో రియం దగ్గిరకి బయల్దేరారు.

తన ఫ్రెండ్స్‌తో స్వప్న కూడా అటు నడి చింది. దారిలో క్యాంటిన్ దగ్గర చెట్లకింద అమ్మాయిలూ, అబ్బాయిలూ జంటలుగా, గుంపులుగా ఏదో తింటూ, తాగుతూ మాట్లాడుకుంటున్నారు.

అప్పటిదాకా పక్కనే నడుస్తున్న హిమజ "ఏయ్! నువ్వు వెళ్తూండు! వస్తాను!" అంటూ చప్పున తప్పుకుని ఓ చెట్టుకింద ఫ్రెండ్స్‌తో నిలబడి ఉన్న తన బాయ్ ఫ్రెండ్ మహి దగ్గరకెళ్ళింది.

ఇక హిమజ ఇప్పట్లో రాదని అర్థమ యిన స్వప్న.. ఒక్కతే ఆడిటోరియం వైపు నడుస్తుంటే "హాయ్! స్వప్నా!" అంటూ వెనక నుంచి పిల్చారెవరో?

తిరిగి చూస్తే, అదే కాలేజీలో వేరే బ్రాంచ్‌లో చదివే హరీష్.

"హాయ్! హరీష్!" అంది స్వప్న.

"ఏంటి ఒక్కదానివే? సెమినార్‌కా? " అడిగాడు ఆమెతోపాటు నడుస్తూ..

"అవును! నువ్వు కూడా సెమినార్ కేనా? " అడిగింది.

"ప్చ్! లేదు! రేపటి నుంచీ ప్రాజెక్ట్‌వర్క్! చెన్నై వెళ్లాలి! నాలుగు వారాలు. రేపు మార్నింగ్ బయల్దేరుతున్నాం!" చెప్పాడు.

"సరే! పీజీ చేయడం లేదా? " అడిగింది.

"లేదు స్వప్నా! క్యాంపస్ ప్లేస్‌మెంట్‌లో సెలెక్టయ్యాకదా! జాబ్ రెడీ! ఇక లైఫ్‌లో సెటిలవడమే..!" ఆమె ముఖంలోకి చూస్తూ చెప్పాడు హరీష్.

అప్పటికే వాళ్లిద్దరూ ఆడిటోరియం సమీపించారు.

హరీష్ ఆగాడు.. స్వప్న కూడా ఆగింది.

"లైఫ్‌లో సెటిల్ అవడమంటే..? పెళ్లికి రెడీ..! ఒప్పుకుంటే..!" ఒకొక్క మాటనీ అన్నాడు హరీష్.

"అమ్మాయిని కూడా సెలెక్ట్ చేసుకున్నావా ఏంటి అప్పుడే..? " సరదాగా అడిగింది స్వప్న.

ఒక్కక్షణం మౌనంగా ఆమె కళ్లలోకి చూశాడు హరీష్.

"అవును స్వప్నా! నువ్వే..! నువ్వు ఒప్పుకుంటే..! నీ కోర్సు అవగానే.. ఐ వాంట్ టు మ్యారీ యు! నిన్ను ఇష్టపడుతున్నాను" చెప్పేశాడు హరీష్.

హరీష్ ఇలా అంటాడని ఎన్నడూ ఊహించని స్వప్న.. కొద్దిగా షాక్ అయింది.

ప్రపోజ్! హరీష్ ప్రపోజ్ చేశాడు తనకి.. తను కూడా అందరిలా.. మరొకరిలా.. హిమజలా.. తనతో స్నేహంగా మెలిగే ఫ్రెండ్ ప్రపోజ్ చేసే స్థితికి చేరుకుంది. నో..! నెవర్..!

"ఛ! అదేంటి హరీష్! జోక్ చేస్తున్నావా? మనం ఫ్రెండ్స్! అంతే!" స్థిరంగా చెప్పింది స్వప్న.

ఆ మాటతో కొద్దిగా కళ తప్పింది హరీష్ ముఖం.

"కానీ.. కానీ.. నువ్వంటే నాకు చాలా ఇష్టం" అన్నాడు.

"ఇష్టందేముంది? ఉండొచ్చు! ఫ్రెండ్స్‌గా ఇన్నాళ్లు ట్రావెల్ చేశాం అంటే.. ఒకరంటే ఒకరికి ఇష్టం ఉన్నట్లేగా! అంతమాత్రాన పెళ్లి చేసుకుంటామా? నీకర్థం కాదులే హరీష్! సారీ! నాకిష్టం లేదు! ప్లీజ్ హర్ట్ అవకు!" చాలా పొలైట్‌గా చెప్పింది.

ఆమె మాటలు వినగానే వెంటనే తేరుకున్నాడు హరీష్.

"ఐయామ్ సారీ స్వప్నా! నేను ప్రపోజ్ చేయడాన్ని ఇంతటితో మర్చిపో! ప్లీజ్! మనం ఫ్రెండ్స్! అంతే! ఇంకేమీ లేదు! సరేనా? " అన్నాడు.

చిన్నగా తలపంకించింది స్వప్న.

"ఎప్పుడు నీ ప్రయాణం? " అడిగింది.

"రేపు! ఎర్లీమార్నింగ్!"

"ఓకే హరీష్! ఆల్ ది బెస్ట్! బై!" చెప్పి అక్కడ్నుంచి ఆడిటోరియంలోకి అడుగులు వేసింది స్వప్న.

అక్కడే నిలబడి.. అలా వెళ్తున్న స్వప్నని చూస్తుండిపోయాడు హరీష్.

అప్పుడతనికి దిగులనిపించింది.

ఫ్రెండ్స్‌గా మసలే అమ్మాయిలూ, అబ్బాయిలూ ఒకరితో ఒకరు క్లోజ్‌గా మూవ్ అవడం.. ఫ్రెండ్స్‌ని కేవలం ఫ్రెండ్స్‌గానే చూడడం.. ఇప్పుడు సర్వసాధారణం. అయితే స్నేహంలోంచి ఇష్టం.. ఇష్టంలోంచి ప్రేమ ఎందుకు ఏర్పడకుండా ఉంటాయి? స్నేహితులందరూ క్రమంగా ప్రేమికులుగా ఎందుకు మారరు? అనే ప్రశ్నలకి హరీష్‌కే కాదు చాలా మందికి సమాధానం లభించదు.

ఒకవేళ స్వప్న మరెవరినన్నా ఇష్టపడుతోందా? ఎవరినైనా ప్రేమిస్తోందా? ఆమెకి ఎందరో స్నేహితులు ఉండొచ్చు కానీ జీవితాంతం కలిసి బతకాలనిపించే ఫీలింగ్ కలిగించే వ్యక్తి.. ఎవరూ లేరా? ఇంతవరకూ కనిపించలేదా? అనేది హరీష్‌కి అర్థం కాలేదు.

'స్వప్నా! ఐ మిస్ యు!' అనుకున్నాడు మనసులో.

స్వప్న జీవితంలోకి ఒక వ్యక్తి ప్రవేశించబోతున్నాడనీ, అతడంటే స్వప్నకి కూడా ఇష్టం, ప్రేమ కలుగుతున్నట్లు ఆమె ఇంకా

## కొత్తగాలి...

**ఆమె కంటి కాటుక జారి
చీకటయ్యింది!
ఆమె చిరునవ్వు విరిసి
వెలుగై మెరిసింది!**

*- గడియా విజయకుమార్,*
చిత్తూరు

గుర్తించలేదని.. అప్పుడు హరీష్‌కి తెలీదు.

★ ★ ★

ఆఫీస్ నుంచి బయల్దేరేసరికి చాలా ఆలస్యమైంది బాలుకి. అప్పటికీ శిరీష తన ఛాంబర్లోనే ఉండడంతో తన పని ముగించి బయటపడ్డాడు.

దగ్గరలోని సిటీబస్ స్టాప్‌లో నిలబడ్డాడు.. చాలా రష్‌గా ఉంది. బస్సులు కూడా ఓవర్‌లోడ్‌తో వచ్చి ఆపకుండా వెళ్లిపోతున్నాయి. తరువాతి స్టాప్ వరకూ నడుచుకుంటూ వెళ్దామని నడక సాగించాడు.

కొద్దిదూరం వెళ్లగానే పక్కనే ఏదో కారు వచ్చి ఆగింది.

చూస్తే.. శిరీష! ఇక తప్పక డోర్ తెరచుకుని కారెక్కాడు బాలు.

"ఈవినింగ్ వాక్?" అడిగింది.

"లేదు! బస్‌లు ఆపడంలేదు! అలా నడుద్దామని.." చెప్పాడు.

"గుడ్! అయితే ఈ రోజు మీ కాలనీవైపు వెళ్తున్నా! తమర్ని ఇంటి దగ్గర డ్రాప్ చేస్తాను" అంది.

"అంత దూరం ఎందుకండీ..?" నసిగాడు బాలు.

"ఇది మూడోసారి కారెక్కడం.. మధ్యలో దిగిపోవడం.. ఏమన్నా బాగుందా బాలూ? అన్నట్లు పార్టీ ఏదో ఇస్తానన్నారు ఇందాక" అంది శిరీష.

"ఇంకోరోజు ప్లాన్ చేసుకుందాం! ఊరెళ్లి నేరుగా ఇటే ఆఫీస్‌కి వచ్చాను!" అన్నాడు.

"ఓకే ఇట్సాల్‌రైట్! ఇంతకీ ఎక్కడికెళ్లారు? ఇక్కడ ఎవరితో ఉంటున్నారు?" అడిగింది.

"ఇక్కడే ఒక రూమ్‌లో రెంట్‌కి ఉంటున్నా. నా వాళ్లంతా ఉండేది వేరే టౌన్‌లో. అక్కడికే వెళ్లివస్తున్నా" చెప్పాడు.

"మీ పేరెంట్స్ ఏం చేస్తుంటారు? బ్రదర్స్, సిస్టర్స్?" అడిగింది.

ఆమెకి నిజం చెప్పాలా? వద్దా? అని క్షణం ఆలోచించాడు బాలు.

"మామ్ స్టేట్స్‌లో ఉంటారు. మేం మొత్తం యాభైమంది బ్రదర్స్" ప్రశాంతంగా చెప్పాడు.

కారు నడుపుతూనే ఆశ్చర్యంగా బాలు వైపు తలతిప్పి చూసింది శిరీష.

"ఆర్ యు జోకింగ్?" అంది.

తల అడ్డంగా ఊపి నవ్వాడు బాలు.

"నిజమే! జోక్ కాదు. నాతోపాటు యాభైమంది.. అందరూ ఆర్ఫన్స్! హాస్టల్‌లో ఉంటారు. అదే మా అందరికీ ఇల్లు" చెప్పాడు.

శిరీష షాక్ తింది.

ఎంత షాక్ అంటే- మెయిన్ రోడ్‌లో వెళ్తున్న కారుని వెంటనే రోడ్ మార్జిన్‌లోకి తిప్పి, సడన్ బ్రేక్‌తో ఆపేంత.

"ఈజిట్?! ఐయామ్ సారీ బాలూ!"

"సారీ ఎందుకండీ? నాకూ, నాలాంటి ఎందరికో పేరెంట్స్.. బంధువులు ఉండరు! నేను అక్కడే పెరిగాను, చదువుకున్నాను. నా కాళ్లమీద నిలబడ్డాను. మేమెవరమూ ఒంటరి, అనాథలం అని ఎప్పుడూ ఫీల్ అవలేదు. అసలు నేను ఇలా అని ఎవరికీ చెప్పను తెలుసా? కానీ, ఇక్కడికి వచ్చాక ముగ్గురికి చెప్పాల్సి వచ్చింది. ఒకరు మీరు, మిగతా ఇద్దరూ మా ఇంటి ఓనర్ తల్లి, ఆయన.." అంటుండగా శిరీష ఫోన్ రింగయింది. దాంతో వాక్యం పూర్తి చేయకుండా ఆపే

శాడు బాలు.

శిరీష కాసేపు ఫోన్‌లో మాట్లాడి మళ్లీ కారు స్టార్ట్ చేసింది.

"మా అన్న కెనడాలో ఉంటాడు. అమ్మ చిన్నప్పుడే చనిపోతే.. మా ఇద్దర్ని నాన్నే పెంచారు. రెండేళ్ల కిందట నాన్న చనిపోయారు. అన్న కెనడా వెళ్లిపోయాడు. నేను ఇక్కడే ఒంటరిగా..! నన్ను కూడా అక్కడికి రమ్మని.. ఫోన్ చేసిన ప్రతిసారి అడుగుతాడు అన్న" తన గురించి నాలుగు మాటల్లోనే అంతా చెప్పేసింది శిరీష.

ఏదో ఆలోచిస్తున్నట్లుగా "ఒంటరిగా ఉండటం వేరు.. ఒంటరితనం వేరు" అన్నాడు బాలు.

అతనివైపు అర్థం కానట్లు చూసి "ఏంటి? రెండూ ఒకటేగా? " అంది శిరీష.

"లోన్లీనెస్.. ఎలోన్‌గా ఉండటం. తను ఎవరూ లేని ఏకాకి.. అని ఫీల్ అవడం.. లేదా ఒంటరితనాన్ని జీవితంలో, గుండెలో నింపుకుని.. అలా ఒంటరితనంలోనే ఎప్పటికప్పుడు రీచార్జ్ అవడం.. మీరు ఇందులో ఏ టైప్? " తమాషాగా ముఖం పెట్టి అడిగాడు బాలు.

ఆ మాటల్తో శిరీషకి నవ్వొచ్చింది.

"మీరు భలేగా మాట్లాడతారు బాలు! ఇందాక మీరు అనాథ అని నాతో కాకుండా మరో ఇద్దరికి చెప్పానన్నారు. మీ ఇంటి ఓనర్ తల్లి.. మూడో మనిషి ఎవరు? ఆయన కూతురా? " ఊరికే గాల్లో రాయి వేసింది శిరీష.

బాలుకి స్వప్న గుర్తొచ్చింది.

"అబ్బే! స్వప్నకి కాదు. ఆమె తమ్ముడు అనిల్‌కి చెప్పానంతే!" అన్నాడు.

"ఏంటి..! స్వప్న..? స్వప్న అంటే..? " కొద్దిగా షాకింగ్‌గా అడిగింది శిరీష.

"మా ఇంటి ఓనర్ కూతురు. ప్రొఫెషనల్ కాలేజ్.. ఫైనలియర్" చెప్పాడు.

ఆ పేరు వినగానే శిరీషలో 'ఇదీ' అని చెప్పలేని భావం.

తర్వాత ఏమీ మాట్లాడకుండా కార్ డ్రైవ్ చేయసాగింది. కాలనీ రోడ్డు దగ్గరికి రాగానే.. "ఇంటివరకూ వద్దులెండి! ఇక్కడ ఆపేయండి!" అన్నాడు బాలు.

"ఏం? మీ రూమ్‌లోకి రాకూడదా? మీ ఇంటి ఓనర్ కూతురు స్వప్నని పరిచయం చేయరా ఏంటి? " అడిగింది శిరీష.

"ఛా! అలాకాదు! ఇంకోసారి వద్దురుగానీ! అయినా స్వప్న ఇంతవరకు నాకే పరిచయం అవలేదు. మీకెలా చేయమంటారు? " అన్నాడు.

"ఓకే..!" అంటూ రోడ్ ఎంట్రన్స్‌లో కారాపింది శిరీష.

బాలు కిందికి దిగాక కారు రివర్స్ చేసుకుని వచ్చిన దారినే వెళ్లిపోయింది.

★ ★ ★

బాలుని చూడగానే వరండాలో కూర్చుని ఏదో డ్రాయింగ్ వేసుకుంటున్న అనిల్ ఒక్కసారిగా ఆనందంతో లేచి నిలబడ్డాడు.

"ఏమయిపోయావు బాలూ..? " అంటూ చప్పున స్టాండ్‌లోని బ్లాక్‌షూలో దాచిన రూమ్‌కీస్ తీసిచ్చాడు.

కీస్‌తో పాటు అనిల్ చేతిని కూడా పట్టుకుని తలమీద చెయ్యేసి దగ్గరకు లాక్కున్నాడు బాలు.

"మీ హాస్టల్ నుంచి నాకేం తెచ్చావు? అందరూ బాగున్నారా? " అడిగాడు అనిల్.

"నీ కోసం ఒక వస్తువు తెచ్చాను. ట్రైన్ దిగి నేరుగా ఆఫీస్‌కి వెళ్లిపోయాను కదా! అక్కడ మర్చిపోయా! రేపు తెచ్చిస్తాలే" అన్నాడు బాలు.

"అవునా? ఏంటా వస్తువు? " ఆసక్తిగా అడిగాడు అనిల్.

"నేను చెప్పనుగా! రేపు నువ్వే చూద్దువుగాని..!" అంటూ అనిల్‌ని వదిలేసి రూమ్ తలుపుతీసి లోపలికెళ్లాడు బాలు.

ఇంతలో ఇంట్లోంచి బయటికొచ్చిన జానకమ్మ "ఏరా? ఎవరితో మాటలు?

బాలునా? " అని అడిగింది.

తలూపి 'లోపల ఉన్నాడు..' అన్నట్లుగా సైగ చేశాడు అనిల్.

"నానమ్మా! నీ ఫోన్ ఏదీ..? " అంటూ సెల్ ఫోన్ తీసుకుని.. హిమజ నెంబర్‌కి కాల్ చేశాడు అనిల్.

కాల్ లిఫ్ట్ చేసిన హిమజతో "అక్కకి ఇవ్వవా? " అన్నాడు.

"అనిల్! తను ఆడిటోరియంలో ఉందిరా? రాగానే ఫోన్ చేయిస్తా" చెప్పింది హిమజ.

"రాగానే ఒక సంగతి చెప్పరా! బాలు ఊరి నుంచి వచ్చేశాడు. అతడ్ని పరిచయం చేస్తాను. అక్కని త్వరగా ఇంటికి వచ్చేయమను. అర్జెంట్ అని చెప్పు" హడావుడిగా చెప్పి కాల్ కట్ చేశాడు అనిల్.

ఆడిటోరియంలోంచి బయటకి రాగానే కనిపించింది హిమజ.

"స్వప్నా..!" అంటూ పిలిచి, కాసేపటి క్రితం అనిల్ ఫోన్‌చేసి చెప్పిన సంగతి చెప్పి- "ఎవరే ఈ బాలూ? " అని కొంటెగా అడిగింది.

ఎటువైపు నుంచో వీస్తున్న గాలి.. నీలాకాశంలో కదిలే తెల్లమబ్బు.. పడమట అస్తమిస్తున్న సూర్యుడు.. మనసులో ఏదో.. పిడికెడంత గుండెలో ఏదో తెలీని స్పందన.. నరాల నుంచి గుండెలోకి, అక్కడి నుంచి తిరిగి నరాల్లోకి రక్తం పంపింగ్ కూడా వేగం అందుకుంది. పల్స్ రేట్ పెరిగి, శరీరంలో రక్తం పిచ్చిగా పరుగులు తీసి, కళ్లనుంచి వెచ్చటి ఆవిరి, ముఖంలోకి, శరీరంలోకి.. కనుపాపలు పెద్దవై, సాయంకాలపు నీరెండలో నక్షత్రాల్లా మెలిచి, మెరిసే కళ్లు.. స్వప్నలో ఏదో కెమికల్ రియాక్షన్ దశల వారీగా.. వేగంగా జరిగిపోవడం.. ఆమెకే తెలీలేదు.

భుజం మీద చెయ్యేసిన హిమజ "స్వప్నా!" అని పిలిచింది.

ఆ మాత్రం స్పర్శకి, పిలుపుకీ.. ఒక్కసారిగా ఉలిక్కిపడింది స్వప్న.

"ఏయ్! ఏంటి? ఎనీ ప్రాబ్లమ్? అలా ఉన్నావేంటి? " కంగారుగా అడిగింది.

"ఏంలేదు.. ఏంలేదు.. ఇంటికి వెళ్దామా? " అంది స్వప్న. అప్పుడామె గొంతులో ఏదో అడ్డుపడుతోంది. గొంతు వణుకుతోంది.

"సెమినార్ ఇంకా అవలేదు కదా! ఫర్వాలేదా? " అడిగింది హిమజ. నుదుటి మీద చిరుచెమట అద్దుకుని "వెళ్ళిపోదాం! ఉండాలని లేదు!" ఎందుకో టెన్షన్‌గా అనిపించినట్లు చెప్పింది స్వప్న.

"సరే! పద!" అంటూ హిమజ ఆమె చెయ్యి పట్టుకుని బయటకి నడిచింది. కాలేజీ బస్సులు ఇంకా బయల్దేరడానికి సమయం ఉండడంతో గేటు బయటకి నడిచి ఆటో ఎక్కారు ఇద్దరూ.

వేగంగా వెళ్తున్న ఆటోలో కూర్చున్న స్వప్నని తల తిప్పి చూసింది హిమజ. ఆమెకి స్వప్నలో ఇంతకి మునుపు చూడని ఏదో మార్పు స్పష్టంగా కనిపించింది. ఇంతవరకూ ఫీల్ అవని .. తన అనుభవంలోకి రాని ఏదో వింతైన, మహత్తరమైన ఫీలింగ్.. స్వప్నని, ఆమె హృదయాన్ని చుట్టేశాయని ఆ క్షణంలో హిమజకి తెలీదు.

"ఏయ్! స్వప్నా! ఏంటే? ఏమయింది? సడన్‌గా అలా అయిపోయావేంటి? " అని మాత్రం అడిగింది.

ఆమె చేతి మీద చెయ్యేసిన స్వప్న "ఏం లేదు" అంది.

అప్పుడు హిమజకి అనిపించింది 'స్వప్న ఎవరితోనైనా ప్రేమలో పడిందా? ' అని.

★ ★ ★

ఇంటికి చేరుకున్న స్వప్నకి వరండా గది తలుపులు తీసి కనిపించాయి. ఒక్కక్షణం అక్కడే ఆగి చూసింది. తలుపుల వెనక నుంచి నిశ్శబ్దం తప్ప మరేంలేదు. అప్పుడు తన గుండె అంత వేగంగా ఎందుకు కొట్టు

కుంటోందో స్వప్నకీ అర్థంకాలేదు.

లోపల్నుంచి అమ్మ పిలవడంతో అక్కడ్నుంచి కదిలింది.

హాల్లో అమ్మఒళ్ళో తలపెట్టుకుని కామర్స్ చదువుకుంటూ అనిల్ కనిపించాడు. తనని అసలేమాత్రం పట్టించుకోనట్లుగా పుస్తకంలో తలదూర్చిన వాడిని చూడగానే స్వప్నకి కోపం, చిరాకు కలిగాయి.

"లేవరా వెధవా! అడ్డగాడిదలా పడుకున్నావ్!" అంటూ తిట్టింది.

ఇంతలో రంగనాథ్ కూడా రావడంతో అమ్మ, నానమ్మ అక్కడ్నుంచి లోపలికి వెళ్లారు. వెంటనే అనిల్ చెవి మెలిపెట్టి.. "ఊఁ! ఇప్పుడు చెప్పు! ఫోన్లో ఏం కూశావ్? " అంది స్వప్న

అనిల్ గింజుకుంటూ "అబ్బా! అక్కా వదులు..! ప్లీజ్! బాలుని పరిచయం చేస్తానన్నాను! అంతేగా!" అన్నాడు.

చెవి మెలేయడం ఆపి "మరి ఏడీ అతను? " అంది కోపంగా!

అనిల్ కి నవ్వొచ్చింది "రెండు రాత్రుళ్ళు సరిగ్గా నిద్రపోలేదంట! ఇందాక అమ్మ టిఫిన్ పెడితే తిని, గదిలోకెళ్ళి పడుకున్నాడు. నన్నేం చేయమంటావ్? " దబాయించాడు.

కాలేజీలో తమ్ముడు ఫోన్ చేశాడని చెప్పగానే ఎందుకంత ఉద్వేగం కలిగింది? ఎందుకంత తొందరగా ఇంటికి పరిగెత్తుకొచ్చింది? అసలేమయింది ఈరోజు తనకి? అనేది స్వప్నకి అర్థం కాలేదు.

రాత్రి అందరూ పడుకున్నాక టేబుల్ లైట్ ఆన్‌చేసి డైరీ తెరిచింది. కాసేపు ఏమీ రాయకుండా అలాగే ఉండిపోయింది. ఆ రోజు జరిగినవన్నీ గుర్తొచ్చాయి. హరీష్ పెళ్ళి ప్రపోజల్, బాలు వచ్చాడని తమ్ముడు ఫోన్, తను కాలేజ్ నుంచి ఇంటికి హడావుడిగా వచ్చేయడం, బాలు రూమ్‌లోంచి బయటికి రాకపోవడం, తను అతడ్ని ఇంతవరకూ సరిగా చూడక పోవడం.. ఇలా అన్నీ గుర్తొచ్చాయి. బాలుని ఒకే ఒక్కసారి కళ్ళలో కన్నీటి తెరలు అల్లుకున్నప్పుడు చూసింది. అది కూడా అస్పష్టంగానే! అతడి గొంతు మాత్రం స్పష్టంగా వింది ఆ రోజు! ఇవ్వాళ బాలుని చూడడం కోసమే కాలేజీ నుంచి త్వరగా వచ్చేసింది. కానీ.. చూడలేకపోయింది. నన్ను చూడాలనే ఫీలింగ్ అతనికీ ఉండాలి కదా! అనిపించి.. తనకు తెలీకుండానే దిగులు కలిగింది.

కుర్చీలో వెనక్కి వాలి కళ్ళుమూసుకుంది. కొన్నిక్షణాలు అలాగే వుండిపోయింది. తర్వాత డైరీలో రాయడం మొదలు పెట్టింది.

'నా మనసులోని ఫీలింగ్‌కి ప్రాణం ఉందా? ఊహలో కదిలే ఆ ఫీలింగ్‌కి ఒక రూపమైనా ఉందో? లేదో? ఎక్కడో.. ఎప్పుడో.. ఎలానో.. ఇంతవరకు స్పష్టంగానైనా చూడని రూపం.. సప్తవర్ణాల మిశ్రమం లాంటి ఇంద్రధనుస్సులోనో.. పూలు రాల్చే వెండి పుప్పొడిలోనో.. ఎలాగైనా కనిపిస్తుందని.. ఎంతగా ఎదురు చూశాను?

ఎలా వున్నావు? అసలు నువ్వెలా ఉంటావు? గుండెలోపలి ఊసులాగానా? చిన్నప్పటి నుంచి పుస్తకంలో దాచుకున్న నెమలీక లాంటి జ్ఞాపకం లాగానా? ఎలా ఉంటావు? ఎక్కడున్నావు? '

## కొత్తగాలి...

**ఏడువారాల నగలున్నా**
**బ్యాంకు లాకర్లోనే!**
**ఎంతమంది కొడుకులున్నా**
**వృద్ధాశ్రమంలోనే..!**

– వి. శ్రీలక్ష్మి,
నల్లకుంట, హైదరాబాద్

రాయడం ముగించాక స్వప్నకి ఎందుకనో దుఃఖం వచ్చింది. గుండెలో ఏవో సుడులు తిరుగుతున్నట్లుగా.. ఏదో సుడిగాలి జీవితాన్ని పట్టి ఊపేస్తున్నట్లుగా అనిపించింది.

ఏమయింది? అసలు నాకేమయింది? ఇన్నాళ్లూ హాయిగా, ఆడుతూ, పాడుతూ, చదువుతూ సాగిపోతున్న నాకు.. సడన్‌గా ఏమయింది? ఎందుకిలా? తనని తానే ప్రశ్నించుకుంది స్వప్న.

ఈ వ్యథ అంతా.. ఈమధ్యే.. ఈ వరండా గదిలోకి బాలు అనే వ్యక్తి వచ్చినప్పటి నుంచే..! ఎందుకిలా? అసలేం జరిగింది? అతడ్ని చూసి, మాట్లాడితే, ఈ సంఘర్షణ నుంచి విముక్తి దొరుకుతుందేమో? అనిపించింది.

తనలాంటి అమ్మాయికి చదువే ప్రధానంగా ఉండాలి! జీవిత లక్ష్యాన్ని దెబ్బతీసి, గమ్యం దిశ మార్చేంతగా ప్రభావితం చేసే ఏ ఒక్కటీ మనసుని ఆక్రమించుకోకూడదు. బాలుని కూడా అందరు స్నేహితుల్లా, స్నేహంగా మాత్రమే ఫీల్ అయ్యేలా, తన మనసుని ట్యూన్ చేసుకోవాలి. అలా మారాలంటే.. ఇప్పుడే, ఈ క్షణంలోనే బాలుని కలిసి ఒక్కసారి మాట్లాడాలి! హృదయంలో మరే ఫీలింగ్ మొలకెత్తకుండా.. చాలా క్యాజువల్‌గా మారాలి! అంతే! ఇలా అనిపించి, చప్పున లేచి, తలుపు తీసి వరండాలోకి వెళ్ళింది.

బాలూరూమ్ ముందు నిలబడింది కొన్నిక్షణాలు. అతడిని పిలవడానికి తలుపు మీద చేత్తో కొట్టాలా? వద్దా? అని ఆలోచించింది.

రెండడుగులు ముందుకేసింది. సరిగ్గా అప్పుడే వరండాలో మూలగా ఉన్న ఇత్తడి ఫ్లవర్‌వాజ్ చేతికి తగిలింది. కింద పడబోతున్న ఫ్లవర్‌వాజ్‌ని పట్టుకుంటూండగా వరండాలో నైట్‌ల్యాంప్ ఆఫ్ అయింది. చుట్టూ చీకటి! ఫ్లవర్‌వాజ్‌ని పట్టుకున్న స్వప్న తూలినట్లయి వరండా గది తలుపు మీదకి స్లిప్ అయి చిన్నశబ్దంతో, అలాగే డోర్ మీద వాలిపోయింది. ఇప్పుడేం చేయాలో అర్థం కానట్లుగా నిశ్శబ్దంగా వుండిపోయింది.

తలుపుల వెనక నుంచి "ఎవరదీ?" అంటూ బాలు గొంతు వినిపించింది.

ఆ గొంతు వినగానే స్వప్నలో టెన్షన్ మొదలయింది. ఇప్పుడేం చేయాలి? బదులు పలకాలా? లోపలికి వెళ్ళిపోవాలా? అనేది ఆ క్షణంలో ఆమెకి తెలీలేదు.

లోపల నుంచి ఏదో శబ్దం! ఊపిరి బిగపట్టి అక్కడే తలుపుకి ఎదురుగా నిలబడిపోయింది. మరుక్షణంలో తలుపులు తెరుచుకున్నాయి.

అవతల గదిలో.. రెండడుగుల దూరంలో.. చేతిలో క్యాండిల్ పట్టుకుని నిలబడిన బాలు!

స్వప్న గుండె ఒక్కక్షణం ఆగి, మళ్ళీ కొట్టుకోవడం మొదలుపెట్టినట్లయింది.

"మీరా! స్వప్నా!" ఆశ్చర్యంగా చూస్తూ అన్నాడు బాలు.

అవునన్నట్లుగా తలూపింది. అతనితో ఏం మాట్లాడాలనుకుందో గుర్తురాలేదు.

అసలు తను ఇంట్లోంచి బయటికి ఎప్పుడొచ్చిందో అర్థం కాలేదు. క్యాండిల్ వెలుగులో తననే చూస్తూ నిలబడిన బాలుని కళ్ళెత్తి చూసి తల దించుకుంది.

"నేనే! ఎలా వున్నారు? ఆ రోజు మీరు చేసిన హెల్ప్‌కి థ్యాంక్స్" అంది.

"నేను చేసింది ఏముందసలు? జస్ట్ భయపడకుండా, ఎదిరించండి! అన్నాను. అంతేకదా! చదువుకుంటున్నారా? క్యాండిల్ కోసం వచ్చారా?" అడిగాడు బాలు.

అవునూ.. కాదులకి మధ్యస్తంగా తలూపింది స్వప్న.

"ఇదిగోండి! నేను నిద్రపోతాను! ఈ క్యాండిల్ తీసుకుని, కరెంట్ వచ్చేదాకా

చదువుకోండి!" అంటూ వెలుగుతున్న క్యాండిల్‌ని స్వప్నకి అందించాడు.

"ఓకే..! లోపలికెళ్ళండి!" చెప్పాడు.

చిన్నగా తలూపి, నవ్వి వెనక్కి తిరిగి లోపలికి నడిచింది. తలుపు వేయబోతూ బయటకి చూసింది స్వప్న. అంతా చీకటి! ఏమీ కనిపించలేదు. ఏమైనా కనిపించినా అస్పష్టంగానే! చివరికి బాలు కూడా అంతే!

★ ★ ★

కోర్టుహాలు నిశ్శబ్దంగా ఉంది. చాలా కేసుల్ని వాయిదా వేసిన జడ్జి, ఆ రోజు విచారణ జరపాల్సిన కేసులు చూస్తూ ఒక కేసుని తీసుకుంటానని చెబుతుండగా, కోర్టు కానిస్టేబుల్ వినయంగా ఒక కాగితాన్ని బెంచి క్లర్క్‌కి అందించాడు.

అందులోని విషయాన్ని చదువుతూ కళ్ళు పెద్దవి చేసుకున్న క్లర్క్, బెంచి మీదున్న జడ్జిగారికి ఆ కాగితాన్ని ఇచ్చాడు.

న్యాయానికి, చట్టానికి ప్రతినిధిలా కనిపిస్తున్న న్యాయమూర్తి ఆ కాగితాన్ని పైనుంచి కిందికి చూసి పిలవమన్నట్లుగా బెంచిక్లర్క్‌కి సూచన జారీ చేశాడు.

బెంచిక్లర్క్ దగ్గర నుంచి ఆదేశం అందుకున్న అటెండర్ తలుపు దగ్గరికెళ్లి "అనితా! అనితా! అనితా!" అని మూడుసార్లు బిగ్గరగా పిల్చాడు.

కోర్టు ఆవరణలోనే పార్క్‌చేసి ఉన్న ఆటోలో కూర్చుని ఉన్న అనిత, తన పేరు వినగానే చప్పున కిందికి దిగింది.

అప్పటికే వరండాలో క్రచెస్ సాయంతో నిలబడి ఉన్న అనిత తమ్ముడు శ్రీకాంత్, అక్కని రమ్మనట్లుగా పిలిచాడు. ఆటో దిగి అనిత వడివడిగా నడుచుకుంటూ తమ్ముడి దగ్గరికెళ్లింది. అక్కడ నుంచి లోపలున్న చెక్కబోనులోకి వెళ్ళి నిలబడింది.

ముఖం భావరహితంగా కనిపిస్తోంది.

బెంచిక్లర్క్ ఇచ్చిన పేపర్లు అప్పటికే చదివిన న్యాయమూర్తి బోనులో నిలబడి ఉన్న అనితని బెంచి సమీపంలోకి రమ్మని పిలిచారు.

చెక్కబోనులో నిలబడి ఉన్న అనిత న్యాయమూర్తికి సమీపంలోకొచ్చింది.

"ఏమ్మా! నీ పేరు అనిత కదా? " అడిగారు జడ్జి.

అవునన్నట్లుగా తలూపింది అనిత.

అనిత మాట్లాడలేదని అప్పటికే అర్థంచేసుకున్న న్యాయమూర్తి ఆమెని ఎక్కువ ఇబ్బంది పెట్టదల్చుకోలేదు. తన చేతిలోని పేపర్‌లో రాసున్న వాక్యాన్ని అనితకి చూపించారు.

"ఇది రాసింది నువ్వేనా? " అని అడిగారు జడ్జి.

అవునన్నట్లుగా తలూపింది అనిత.

"ఇందులో నువ్వు రాసింది చదువుతాను విను!" అనితతో చెప్పిన న్యాయమూర్తి పెద్దగా చదవడం మొదలుపెట్టారు.

'అనిత అనే నేను దేవుని మీద ప్రమాణం చేసి చెబుతున్న వాస్తవం ఏమనగా- నేను, శశాంక్ ప్రేమించుకున్నాం. పెద్దలు మా ప్రేమని ఒప్పుకోకపోవడంతో చనిపోవాలని నిర్ణయించుకుని ఆత్మహత్యకు ప్రయత్నించాం. శశాంక్ చనిపోయాడు. నేను మాత్రం బతికాను. ఆత్మహత్యాయత్నం కేసు పెట్టారు కాబట్టి నేను నేరం చేశానని కోర్టులో ఈ రోజున అంగీకరిస్తూ, ఈ స్టేట్‌మెంట్ స్వహస్తాలతో రాసి ఇస్తున్నాను'

"ఏమ్మా! ఇదంతా నువ్వు రాసిందే కదా? నీ సంతకం ఇదేనా? " న్యాయమూర్తి అడిగారు.

నిర్వికారంగా నిలబడి ఉన్న అనితవైపు కోర్టుహాల్లో ఉన్న కొద్దిమంది లాయర్లు, మరి కొంతమంది కక్షిదారులు ఆశ్చర్యంతో చూస్తున్నారు.

ఒకసారి కోర్టుహాలు మొత్తం పరికించి చూసింది అనిత.

గోడ పక్కన చెక్కబెంచీ మీద క్రచెస్‌ని ఆనించి కూర్చుని ఉన్న తమ్ముడు

అక్షరం

అందరినీ నమ్మడం..
ఎవ్వరినీ నమ్మకపోవడం..
రెండూ ప్రమాదమే

– అబ్రహాం లింకన్



శ్రీకాంత్.. విషణ్ణవదనంతో అనితనే చూస్తున్నాడు. అతడి వైపు 'మోనాలిసా లాగా' సన్నగా నవ్వింది అనిత. న్యాయ మూర్తి వైపు తిరిగి, ఆయన దగ్గరున్న పేపర్‌ని ఇవ్వమన్నట్లుగా సైగ చేసింది. బెంచిక్లర్క్‌కి పేపర్‌ని అందించారు న్యాయ మూర్తి. అక్కడ నుంచి అనిత వద్దకు చేరింది, ఆమె స్వహస్తాలతో రాసిన కాగితం.

విట్‌నెస్ టేబుల్ మీద ఆ కాగితాన్ని ఉంచి, బెంచిక్లర్క్ దగ్గరున్న పెన్ తీసు కుని.. తన సంతకం కింద మళ్ళీ ఇంకో సంతకం చేసి, తిరిగి పెన్, కాగితాన్ని క్లర్క్‌కి ఇచ్చేసింది అనిత.

ఇదంతా గమనిస్తున్న న్యాయమూర్తికి మనసంతా అదోలా అయిపోయింది. తన ఇన్నేళ్ళ సర్వీస్‌లో ఇలాంటి కేసునీ, అనిత లాంటి స్త్రీని చూసి ఎరగని న్యాయమూ ర్తికి.. తన ముందు ఉన్న కేసులో ఏ తీర్పు చెప్పాలనేది కత్తి మీద సాము అని అర్థమయింది. అయితే కేసు రికార్డు మేరకు, చట్టప్రకారం మాత్రమే తను తీర్పు వెలువరించాలి కాబట్టి.. ఇకతను ఎలాంటి తీర్పు ఇవ్వబోతాడనేది.. అందరికీ తెలు సని న్యాయమూర్తికి స్పష్టమైంది.

"కేసు వాయిదా ఫర్ జడ్జిమెంట్" అని చెప్పిన న్యాయమూర్తి, మనసు భారమవ డంతో తన ఛాంబర్‌లోకి వెళ్ళిపోయాడు.

★ ★ ★

ఆఫీస్‌లో లంచ్‌బ్రేక్ సమయంలో బాలుకి శిరీష నుంచి పిలుపు వచ్చింది. పాస్‌పోర్ట్ ఆఫీస్‌కి వెళ్ళి అప్లికేషన్లు తీసుకో వాలని, తనతో రమ్మని అడిగింది. తప్పని సరై ఆమెతో కలిసి బయల్దేరాడు బాలు.

పాస్‌పోర్ట్ ఆఫీస్‌కి వెళ్లేవరకూ ఏదో ఒకటి మాట్లాడుతూనే ఉంది శిరీష. ఆఫీసు సంగతులు, తన ఫ్రెండ్స్, కొత్తగా చూసిన సినిమాలు.. ఒకటేమిటి, ఇలా.. మధ్యలో ఫుడ్‌ప్లాజాలో లంచ్ తీసుకుని తిరిగి ఆఫీసుకి వస్తూ ఎఫ్.ఎం. రేడి యోలో ఏదో పాట వస్తోంటే.. "బాలూ! మీరు సినిమాలు చూడనన్నారు. మరి పాటలైనా వింటారా? " అడిగింది శిరీష.

ఆ మాటకి కళ్ళెగరేసిన బాలు "వినడమే కాదు.. పాడతాను కూడా" అన్నాడు.

"అబ్బో! ఏం పాటలు పాడుతారు మహా శయా? " అంది.

"అన్నీ! తెలుగు, హిందీ, ఇంగ్లీష్.. కీబోర్డు కూడా ప్లే చేస్తాను" చెప్పాడు.

అంతసేపూ ట్రాఫిక్‌లో ఆగిన కారు ముందుకి కదిలాక.. "గుడ్! అయితే, నాకె ప్పుడు వినిపిస్తారు మీ పాట? " అడిగింది.

"మీ ఇష్టం! అయితే, పాటపాడి చాలా కాలమయింది. కీబోర్డు కూడా హాస్టల్లోనే ఉండిపోయింది" అన్నాడు.

"ఈసారి మీరు పాడాల్సిందే బాలు! వీకెండ్ పార్టీలో నాతోపాటు వచ్చి అదర గొట్టాలి.. ప్లీజ్!" అంది శిరీష.

ఆమెవైపు ఇబ్బందిగా చూశాడు బాలు.

"నాకు ఈ ఫీల్డ్ సరిగా సెట్ అవలేదు ఇంకా! అప్పుడే వీకెండ్ పార్టీలా..! నావల్ల కాదు! ప్లీజ్! మీలాగా సిటీలో పుట్టి పెరగ లేదండీ!" అన్నాడు.

"అలా అనకండి బాలూ! ప్లీజ్! ఈసారి

నాతో వస్తున్నారు అంతే!" అంది.

ఇంతలో ఆఫీసుకి చేరుకుంది కారు. సెల్లార్‌లో పార్క్ చేసి ఇద్దరూ లిఫ్ట్‌వైపు నడిచారు. లిఫ్ట్ పైకి వెళ్తూంటే- అప్పటిదాకా నాన్‌స్టాప్‌గా మాట్లాడిన శిరీష, ఫోన్‌లో ఏదో మెసేజ్ పెడుతూ బిజీ అయింది.

మెసేజ్ టైప్ చేస్తున్న సమయంలో ఆమె ముఖంలో ఇంతకుముందు లేని ఫీలింగ్స్‌ని బాలు చాలా స్పష్టంగా గమనించాడు. కళ్ళలో నీటిపొర! ఉద్వేగంతోను, కోపంతోనూ అదురుతున్న పెదవులు.. చిట్లించిన కనుబొమలు.. ఏదో సీరియస్ మేటర్ అనిపించింది బాలుకి.

ఒకవేళ ఏదైనా ఎఫైర్‌లో ఉందేమో? ఎంతగా ఫాస్ట్‌లైఫ్‌లో దూసుకెళ్తున్నప్పటికీ, ప్రతిఒక్కరిలోని సెన్సిటివ్ ఫీలింగ్స్ జీవితాన్ని ఏదో సమయంలో పట్టి ఊపేయడం తప్పదేమో అనిపించింది.

సరిగ్గా అదే క్షణంలో బాలుకి స్వప్న గుర్తొచ్చింది!




ఆ రోజు ఎట్టిపరిస్థితిలోను బాలుతో మాట్లాడాలని బలంగా నిర్ణయించుకుంది స్వప్న. కాలేజి నుంచి త్వరగా వచ్చింది. అప్పుడే స్వప్న తల్లి ప్రమీల, నానమ్మ జానకమ్మ షాపింగ్‌కి వెళ్లారు. కాసేపటికి అనిల్ స్కూల్‌నుంచి వచ్చి, నలుగురు ఫ్రెండ్స్‌తో గ్రౌండ్‌కి వెళ్ళిపోయాడు.

ఇక అప్పటి నుంచీ బాలు రాకకోసం చూడడం మొదలుపెట్టింది స్వప్న.

ఎంతకీ బాలు రాలేదు. బయటకెళ్ళిన వాళ్ళు కూడా ఎవరూ రాలేదు. అలా ఎదురుచూసి ఇక ఓపిక లేనట్లుగా, ఏదో గుర్తొచ్చి చెప్పుల స్టాండ్‌లోని బ్లాక్ షూలో చూసింది. అక్కడ వరండా రూమ్ కీస్ కనిపించాయి. అది తీసుకుని తలుపులు తెరచి, ఊపిరి బిగపట్టి లోపలికి చూసింది. ఇలా ఒక్కతే, ఎవరూ లేని సమయంలో గదిలోకి వెళ్లడం కరెక్ట్ కాదేమో అనిపించడంతో.. 'వద్దు! వెళ్ళిపోవాలి!' అని అనుకుంటూ చప్పున గదిలోంచి బయటికి నడవబోయింది.

సరిగ్గా అప్పుడే ఆఫీసు నుంచి వచ్చిన బాలు వరండా మెట్లు ఎక్కుతూ రూమ్ వైపు చూశాడు. తలుపులు తీసి ఉండటంతో- స్కూల్‌నుంచి వచ్చిన అనిల్ లోపల ఉన్నాడేమో అనుకున్నాడు. వాడిని భయపెట్టాలనే కొంటె కోరిక కలిగి, శబ్దం కాకుండా తలుపుల ముందు నిలబడి.. "ఏయ్! దొంగా..!" అని పెద్దగా అన్నాడు.

అప్పుడే బయటికి నడవడానికి వెనక్కి తిరిగిన స్వప్న, ఒక్కసారిగా అతని కేకతో హడలిపోయింది! భయంతో పెద్దగా అరిచి చెవులు, కళ్ళు మూసుకుంది.

అప్పుడు చూశాడు బాలు, గదిలోపల స్వప్నని. వెంటనే ఏంచేయాలో తోచలేదు. బయట నిలబడి, వరండాలో లైట్ ఆన్ చేసి "సారీ! అనిల్ అనుకున్నాను! ప్లీజ్!" అన్నాడు.

తను భయపడింది బాలుని చూసి అని అర్థమైన స్వప్న.. వెంటనే తేరుకుంది. గుండె మాత్రం ఇంకా భయంతో కొట్టుకుంటూనే ఉంది. ఇప్పుడు బాలుని చూడగానే, మరింత భారంగా కొట్టుకోసాగింది.

"ప్లీజ్ స్వప్న! ఏమీ అనుకోవద్దు!" బతిమాలుతూ అన్నాడు బాలు.

అప్పటికి స్వప్న పెదవుల మీద నవ్వొచ్చింది. భయం పోయి, దాని స్థానంలో

కొంటెతనం ప్రవేశించింది.

"చాల్లే! భయపెట్టింది కాక, ఏమీ అను కోకుండా ఉండాలా? అయినా రూమ్ తలుపులు తెరిచి ఉంటే.. అలా దొంగలా, భయపడేలా పిలవాలా? లోపల ఎవరున్నదీ చూడాల్సిన పనిలేదా? " బాలుని సూటిగా చూస్తూ దబాయించింది.

"అవునా? నేను లేనప్పుడు నా రూమ్ తలుపు తీయడమే కాకుండా, నన్నే దబాయిస్తున్నారా? " అన్నాడు బాలు.

"రూమ్ కీస్ ఎక్కడంటే అక్కడ పెట్టకుండా, దగ్గరే ఉంచుకోవాలి మరి!" అంది.

"రూమ్ కీస్ అక్కడ పెట్టింది నా ఫ్రెండ్ అనిల్. మీకేంపని నా రూమ్‌తో? వాడు నా రూమ్‌మేట్!" ఇప్పుడేమంటావ్ అన్నట్లుగా చూశాడు బాలు.

"ఎంటీ? వాడు.. తమరి ఫ్రెండా? మరి నేనెవరినంట? రాత్రి కరెంట్ పోయినప్పుడు వెలిగే క్యాండిల్ ఎందుకిచ్చినట్లు? " అంది స్వప్న.

ఆమె అలా అడగడంతో బాలు పెద్దగా నవ్వడం మొదలుపెట్టాడు. "ఇకెళ్లండి! మీకు కోపంగా ఉండడం కూడా రాదు. 'చెప్పు తీసి కొట్టండి' అని ఆ రోజు ఇండైరెక్ట్‌గా చెప్పినా కూడా ఆ పని చేయలేక పోయారు. జస్ట్‌వార్నింగ్ ఇచ్చారు వాడికి! ఇక నన్నేం తిడతార్లే, ఊరుకోండి!" అన్నాడు.

దాంతో సందీప్ గొడవకి దిగినరోజు జ్ఞాపకం కళ్ళ ముందు కనిపించి స్వప్నకి కూడా నవ్వొచ్చింది.

"అవును అనిల్‌గాడికి ఏదో గిఫ్ట్ తెచ్చారని చెప్పాడు.. ఏంటది? " అడిగింది.

చప్పున రూమ్‌లోకి వెళ్ళిన బాలు రెండు నిమిషాల్లో బయటకొచ్చాడు. అతని చేతిలో ఉన్న ప్యాక్‌ని చూసి "ఏంటది? చాలా పెద్దగా ఉంది" అంది.

"చిన్న మ్యూజిక్ ప్లేయర్. కీబోర్డులాగ అన్నమాట! నేనెప్పుడో కొని దాచి ఉంచాను. ఇంతవరకు వాడలేదు. పాటలు వినొచ్చు- మనమూ పాడొచ్చు" అన్నాడు.

"మరి.. నాకు ఏమీ తేలేదా? " అసంకల్పితంగా అంది స్వప్న.

ఆ మాటతో ఒక్కసారిగా ఏం చెప్పాలో బాలుకి అర్థం కాలేదు.

"సారీ స్వప్న!" అన్నాడు.

అప్పుడతని గొంతులో ధ్వనించిన బాధని గుర్తించిన స్వప్న.. "అరే! ఊరికే అన్నాలే..!" అంటూండగా గేటు తీసుకుని స్వప్న తల్లి, నానమ్మ, అనిల్ అందరూ ఒక్కసారే లోపలికి వచ్చారు.

ఆ తర్వాత అంతా కాసేపు హడావుడి! మ్యూజిక్ ప్లేయర్‌ని ఎలా ఉపయోగించాలో చూపించిన బాలు, అందులోనే ఉన్న కీబోర్డుని కూడా ప్లే చేసి, చిన్నగా హమ్ చేశాడు.

సరిగ్గా అదేసమయంలో ప్రాజెక్ట్‌హెడ్ శిరీష నుంచి బాలుకి కాల్!

'ఈ టైమ్‌లో ఆమె ఎందుకు ఫోన్ చేసిందా? ' అనుకుంటూ అందరి మధ్య నుంచి లేచి గేటువరకూ వెళ్ళి "హలో! చెప్పండి! ఎలా ఉన్నారు? " అడిగాడు బాలు.

"బాలూ! ఏం చేస్తున్నారు? బిజీనా? " అడిగింది శిరీష.

"లేదు, ఇప్పుడే రూమ్‌కి వచ్చాను. అందరం కూర్చుని మాట్లాడుకుంటున్నాం" అన్నాడు బాలు.

"స్వప్న లేదా? తనతో మాట్లాడలేదా ఇంకా? " ఆసక్తి, మరేదో భావం లీలగా ధ్వనిస్తుండగా అడిగింది శిరీష.

"జస్ట్- ఇంతకుముందే మాట్లాడాను. అందరూ ఉన్నారు, చెప్పండి మీరెక్కడ? " అడిగాడు.

"ఇంట్లోనే.. మల్టీస్టోర్డ్ అపార్ట్‌మెంట్.. చివరి అంతస్తులోని ఫ్లాట్‌లో.. టీవీ చూస్తూ.." చెప్పింది.

"మీర్కొరే ఉంటారా? తోడెవరూ

ఉండరా? " అడిగాడు.

"చాలామంది ఉంటారు నాకు తోడుగా! చలం, యండమూరి, వంశీ, ఇళయరాజా, బాలచందర్, పూరీజగన్, దేవీశ్రీప్రసాద్, హిమేష్‌రెష్మియా, సల్మాన్, షారుక్, అమీర్.. ఇంకా రేఖ, కరీనా, ఇలియానా, సమంత, జెనీ, భానుప్రియ, సరిత.. ఇంకా.." చెప్పుకుపోతోంది శిరీష.

అప్పుడర్థమైంది బాలుకి- "చాలు చాలు! అర్థమయింది! వీళ్ళు కాకుండా ఇంకెవ రైనా..? అని అడుగుతున్నా" అన్నాడు.

"ఎవరూ లేరు బాలూ! చెప్పాను కదా! అమ్మ నా చిన్నప్పుడే వెళ్ళిపోతే.. నాన్న కూడా రెండేళ్ళ కిందట అమ్మని వెతు క్కుంటూ వెళ్ళిపోయారు. అన్న కెన డాలో.."

అప్పుడామె గొంతులో విషాదపు జీరని బాలు గుర్తించాడు.

"ఓకే! చెప్పండి! ఈ టైమ్‌లో ఫోన్? " అడిగాడు.

"ఏమీలేదు! జస్ట్ చేయాలనిపించింది అంతే! బిజీగా ఉన్నట్లున్నారు. మళ్లీచే స్తాలే! కాసేపు మాట్లాడాలనిపిస్తోంది అంతే! బై!" చెప్పి కాల్ కట్‌చేసింది శిరీష.

తర్వాత ఆఫీసు నుంచి రంగనాథ్ కూడా వచ్చాక ఆ వరండాలోనే అందరూ కబుర్లు చెప్పుకుంటూ భోంచేశారు. అనిల్ తన స్కూల్ గురించి, బాలు హాస్టల్లో జరిగే తమాషాల గురించీ, స్వప్నకి చెప్తూ చాలాసేపు గడిపారు. పేకాడుకుంటున్న రంగనాథ్, జానకమ్మ మధ్యలో ఏదో కల్పించుకోవడం.. ఇలా సరదాగా గడిచి పోయింది.

ఊహ తెలిసినప్పటి నుంచీ హాస్టల్లో అనాథగా జీవితం మొదలుపెట్టి, కుటుంబ అనుబంధాలు ఎలా ఉంటాయో తెలీ కుండా జీవితం గడిపిన బాలుకి.. ఇప్పుడీ కుటుంబంతో అనుబంధం ఎడారిలో ఒయాసిస్సులా అనిపించింది. స్వప్నతో పరిచయం, స్నేహం కూడా అతడి హృద యాన్ని చాలా గొప్పగా రీచార్జ్ చేశాయి.

రాత్రి బాగా పొద్దుపోయాక, అందరికీ గుడ్‌నైట్ చెప్పి తన రూమ్‌లోకి వెళ్ళి పడు కున్న బాలు అప్పటిదాకా గడిచిన క్షణాల్ని మళ్ళీ గుర్తుచేసుకునే ప్రయత్నంలో ఉండగా.. శిరీష నుంచి కాల్‌వచ్చింది.

"సారీ బాలు! డిస్టర్బ్ చేస్తున్నానా? " అడిగింది శిరీష.

"లేదు.. లేదు..! చెప్పండి! డిన్నర్ అయిందా? " అడిగాడు బాలు.

"లేదు! తినాలనిపించలేదు! పాలు తాగా ను. నిద్రపోతున్నారా? " అడిగింది.

"ఇంకా లేదు! ఏదో మాట్లాడాలన్నారు చెప్పండి!" అడిగాడు.

"అవునా! ఏమో! కొద్దిగా డల్‌గా అని పించింది ఈ రోజు. మనసుకి వెంటిలేషన్ కావాలనిపించింది" అంది.

"ఏదైనా ప్రాబ్లమ్? " అడిగాడు బాలు.

అప్పుడతనికి ఆమెతో లిఫ్ట్‌లో వెళ్తున్న ప్పుడు ఏదో మెసేజ్ రావడం.. రిప్లయి ఇస్తూ ఉద్వేగానికి లోనయినట్లుగా కళ్ళలో నీటితెర కనిపించడం.. గుర్తొచ్చాయి.

"ప్రాబ్లమ్ అంటూ ఏమీలేదు. ఇందాకటి వరకూ డల్! మీతో మాట్లాడాక, మ్యూజిక్ వింటూ గడిపాను. ఆ డిప్రెషన్ అంతా పోయింది. ఇప్పుడు ఓకే" చెప్పింది.

"గుడ్! ఇక హాయిగా నిద్రపోండి!" అన్నాడు.

కొన్నిసెకన్ల తర్వాత "ఎలా ఉంది స్వప్న? ఏమంటోంది? బాగుంటుందా? " అడిగింది.

"బాగుంటుంది! సరదాగా, ఫ్రెండ్లీగా ఉంటుంది" చెప్పాడు.

"తెల్లగా ఉంటుందా? నల్లగానా? " మళ్ళీ అడిగింది.

ఇలా, ఇంత వివరంగా ఎందుకు అడుగు తోందా అనిపించింది బాలుకి.

"తెలుపే! ఎందుకిలా అడుగుతు

న్నారు? ” అడిగాడు.

“ఏంలేదు! ఊరికే..! నల్లగా ఉండే స్వప్న నాకు తెలుసు! తను గుర్తొచ్చింది! అందుకే అడిగాను” చెప్పింది.

“ఇప్పుడు నేనొక విషయం అడగనా? ” అన్నాడు బాలు.

“వైనాట్? అడగండి!” అంది.

“మధ్యాహ్నం మనం లిఫ్ట్‌లో వెళ్లేట ప్పుడు.. మీరు మెసేజ్ పంపుతున్న సమ యంలో, మీ కళ్లలో నీటితెర ఎందుకు? ఏమైంది? ” అడిగాడు.

కొన్నిక్షణాల నిశ్శబ్దం..! “అది.. అది.. ఏం లేదు!” తడబడింది శిరీష.

ఇద్దరి మధ్య మౌనం గూడుకట్టుకుంది.

“ఓకే..! గుడ్‌నైట్ బాలూ..!” చెప్పింది శిరీష.

“గుడ్‌నైట్!” అన్నాడు బాలు.

★ ★ ★

కాలేజీలో అరగంటసేపు బ్రేక్‌టైమ్ ఇవ్వ గానే అందరూ క్యాంటీన్‌వైపు, బాస్కెట్ బాల్ గ్రౌండ్ చుట్టూ ఉన్న చెట్ల కిందికి వెళ్లడం మొదలుపెట్టారు.

క్లాస్‌లోంచి బయటకొచ్చిన స్వప్న రిఫ రెన్స్ బుక్స్ కోసం లైబ్రరీవైపు నడిచింది.

ర్యాక్స్‌లో పావుగంటసేపు వెతికాక, మూడు రిఫరెన్స్ బుక్స్‌లో ఒక్కటి మాత్రం దొరికింది. ఈ బుక్ కూడా నెల రోజుల వ్యవధిలోనే ఎనిమిది మంది తీసు కెళ్లి తిరిగిచ్చినట్లు ఇండెక్స్ పేజీలో అతికిం చిన స్లిప్‌లో నమోదు చేసి ఉంది. నిన్నే ఎవరి దగ్గరి నుంచో తిరిగి లైబ్రరీకి వచ్చి నట్లుగా అర్థమయింది స్వప్నకి.

ఆ బుక్ తీసుకొని, క్లాస్‌కి వెళ్లేసరికి అప్ప టికింకా లెక్చర్ మొదలవలేదు. స్టూడెంట్స్ కూడా పల్చగా ఉన్నారు. తన పక్కనే కూర్చునే హిమజ కూడా రాలేదు. ఏం చేయాలా? అని ఆలోచిస్తూ లైబ్రరీ నుంచి తెచ్చిన రిఫరెన్స్ బుక్‌ని బయటికితీసింది.

ఫారెన్ ఆథర్ రాసిన టెక్స్ట్‌బుక్ అది. అలా తిప్పుతుంటే పేజీల మధ్యలోంచి ఏదో కాగితం జారి కింద పడింది.

పుస్తకం మూసేసి, కింద పడిన పేప ర్‌ని తీసుకుంది స్వప్న.

నాలుగు మడతలుగా ఉన్న పేపర్ అది. అందులో ఏవో అక్షరాలు- పొంది కగా, గుండ్రంగా కనిపించాయి.

ఏం రాసుందా? అనే ఆసక్తితో మడ తలు పూర్తిగా విప్పింది స్వప్న.

అది.. ఏదో ఉత్తరం!!

ఆశ్చర్యంగా చూసింది స్వప్న.

“హాయ్ రా!” అని సంబోధిస్తూ.. “నీ నేను” అని పూర్తిచేసిన ఉత్తరం అది.

ఎవరో.. మరెవరికో రాసిన ఉత్తరం.

నెలరోజులుగా సుమారు ఎనిమిది మంది దగ్గరికి వెళ్లి, తిరిగి లైబ్రరీకి చేరు కున్న ఆ పుస్తకంలో ఈ ఉత్తరం! ఎవరో? వీళ్లలో ఎవరో? ఈ ఉత్తరాన్ని ఇందులో పెట్టి మర్చిపోయారేమో? అనుకుంది.

చదవాలా? వద్దా? అన్నట్లుగా కొంత సేపు తర్జనభర్జన పడింది స్వప్న. అసలిది ఎవరు, ఎవరికి రాశారు? ఇందులో ఏముంది? అనుకుంటూ ఒక నిర్ణయానికి వస్తుండగా క్లాస్‌లోకి లెక్చరర్ రావడం, వెనకే మిగతా స్టూడెంట్స్ లోపలికి వచ్చే యడం జరిగాయి. అంతసేపూ ఎక్క డుందో తెలీని హిమజ కూడా లోపలికి వచ్చి స్వప్న పక్కన కూర్చుంది.

దాంతో ఉత్తరాన్ని తిరిగి బుక్‌లో పెట్టేసి, బ్యాగ్ సర్దుకొని, లెక్చర్ వినడంలో మునిగిపోయింది స్వప్న.

ఆమె మనసు మాత్రం ఆ ఉత్తరం గురించి ఆలోచిస్తూనే ఉంది. బలవంతాన మళ్లించుకుని లెక్చర్ వింటుండగా- సడ న్‌గా బాలు గుర్తొచ్చాడు. సాయంత్రం ఇంటికెళ్లాక- ఈ లెటర్ గురించి బాలుకి చెప్పాలి. అతని అభిప్రాయం తీసుకున్నాక చదవడమో? లేదా చించేయడమో? చేయాలి అనుకుంది.

అయితే ఆ ఉత్తరంలోని అక్షరాల్లో పొందుపరచిన భావాలు, అనుభూతులు, ఆమె హృదయం మీద గాఢమైన ప్రభావాన్ని చూపబోతున్నాయని, ఆ క్షణంలో స్వప్నకి తెలీదు.

అసలు ఆ ఉత్తరం ఒక ఉద్దేశం ప్రకారం రాసిందనీ, లైబ్రరీలోని పుస్తకంలో చేరిందనీ, జీవితాంతం మాటలురాని.. మౌనంతో, గుండెనిండా దిగులు, ఒంటరితనంతో జీవించే అనిత అనే అమ్మాయి రాసిందని, స్వప్నకి తెలిసే అవకాశమే లేదు.

★ ★ ★

లంచ్‌టైమ్‌లో ఆఫీస్ అంతా ఖాళీ అయింది. జానకమ్మ ఇచ్చి పంపిన లంచ్ బాక్స్ ఓపెన్ చేశాడు బాలు తన సీట్లోనే కూర్చుని. ఆ రోజు ఎందుకనో మామూలు కన్నా ఎక్కువ వెరైటీస్, అన్నీ రెండేసి, ఇద్దరు తినడానికి సరిపోయేలా ఇచ్చి పంపినట్లు అర్థమైంది.

సరిగ్గా అప్పుడే జానకమ్మ నుంచి ఫోన్.

"ఏంటి బామ్మగారు! నా ఒక్కడికే ఇన్ని..! ఎలా తినాలి? " అడిగాడు బాలు.

జానకమ్మ నవ్వింది.. "మీ ప్రాజెక్ట్‌హెడ్ శిరీష గురించి చెప్పావు కదా! ఆమెకి వీటిలో షేర్ ఇస్తావని ఎక్కువ పెట్టాలే బాక్స్‌లో! వెళ్లి ఇచ్చి, చెప్పు బాలు.." అంటూ కాల్ కట్‌చేసింది.

వెంటనే అటెండర్‌ని పిలిచి లంచ్ బాక్స్‌ని మేడమ్ రూమ్‌లోకి పంపాడు బాలు. వెనకే తనూ వెళ్లాడు. అటెండర్ ట్రేలో అన్నీ అరేంజ్ చేసి టేబుల్‌మీద పెట్టగానే, శిరీషకి ఆశ్చర్యం కలిగింది.

"ఇదేంటి బాలూ! పార్టీ ఇస్తున్నారా? " అంటూ నవ్వింది.. వెరైటీస్ చూసి.. "స్వీట్స్! కర్రీస్! ఓ! గుడ్!" అంది.

"ఇది పార్టీ కాదులెండి! మా బామ్మగారు మీతో షేర్ చేసుకొమ్మని లంచ్‌బాక్స్‌లో అన్నీ హెవీగా పెట్టారండి! నాకూ తెలీదు. ఇప్పుడు తనే ఫోన్‌చేసి చెప్పారు" అన్నాడు బాలు.

"అవునా! బామ్మగారంటే..? మీ రూమ్ ఓనర్‌గారి మదర్? " అడిగింది.

"అవును! జానకమ్మ..! కానీండి.. ఓ పట్టుపట్టండి" అంటూ ప్లేట్లలో సర్వ్ చేయ సాగాడు బాలు.

అన్ని వెరైటీస్ బాగా రుచిగా ఉండటంతో శిరీషకి చాలా ఆనందం కలిగింది.

"అసలుసిసలైన ఇంటి భోజనం తిన్నట్లే ఉంది బాలూ! ఎన్నో ఏళ్ల తర్వాత. బామ్మగారికి ఫోన్ చేస్తే, థ్యాంక్స్ చెబుతా!" అంది.

జానకమ్మకి కాల్‌చేసి "బామ్మగారూ! మా మేడమ్ మీతో మాట్లాడతారంట!" చెప్పి ఫోన్ శిరీషకిచ్చాడు బాలు.

"బామ్మగారూ! నాపేరు శిరీష! మీ చేతివంట అద్భుతం. మెనీ మెనీ థ్యాంక్స్" ఆనందంగా చెప్పింది శిరీష.

"నీ గురించి బాలు చెప్పాడమ్మా! నిన్న లంచ్‌కి వెళ్లారటగా..! అక్కడ ఏం బాగుంటుంది? అందుకే ఈ రోజు నేను ఇచ్చిన ట్రీట్" అంది జానకమ్మ.

"చాలా బాగుంది బామ్మగారూ! కానీ, రోజూ ఇలాంటి లంచ్ తినగలిగే అదృష్టం మాత్రం లేదుగా! అని ఫీల్ అవుతున్నా! అంత బాగుంది!" చెప్పింది శిరీష.

"ఒకసారి బాలుకి ఇవ్వమ్మా ఫోన్" అంది అటునుంచి.

"బామ్మగారూ చెప్పండి" అన్నాడు బాలు.

"ఇంకేమిటి బాలూ? మీ ప్రాజెక్ట్‌హెడ్ దగ్గర మంచి మార్కులు కొట్టేశావ్! ఇక నీ మీద పెత్తనం తగ్గిస్తుందిలే! ఇంతకీ అమ్మాయి అందంగా ఉంటుందా? ఊరికే అడుగుతున్నానులే!" అంది.

"పొండి బామ్మగారూ! మీరలా అడగొచ్చా? మరీనూ..!" చిరుకోపంగా అన్నాడు బాలు.

"సరేలే..! చూసి చెప్పు ఎలా ఉందో? సాయంత్రం వచ్చినపుడు. వచ్చేటప్పుడు

అక్షరం

ఒక్క క్షణం సహనం
కొండంత ప్రమాదాన్ని దూరం చేస్తే..
ఒక్క క్షణం అసహనం
మొత్తం జీవితాన్నే నాశనం చేస్తుంది

– స్వామి వివేకానంద



బ్రౌన్ బ్రెడ్ తీసుకురా బాలూ..!" కాల్ కట్ చేసింది జానకమ్మ.

బాలు వైపు ప్రశ్నిస్తున్నట్లుగా చూసింది శిరీష.

"చివర్లో బామ్మగారు ఏమని అడిగా రేంటి? అలా అడగొచ్చా? అంటున్నారు" ఆసక్తిగా అడిగింది శిరీష.

ఒక్కక్షణం ఆగి.. "మరి.. తను అలా అడగొచ్చా? మీరు అందంగా ఉంటారా? అని అడుగుతోంది బామ్మ" అన్నాడు.

అప్పటిదాకా టేబుల్ మీద పరిచి ఉన్న పాత న్యూస్‌పేపర్‌ని డస్ట్‌బిన్‌లో పడేసి, తిరిగి తన ఛైర్‌లో కూర్చుని, బాలువైపు చూసి "మరి.. నేను ఎలా ఉన్నాను? అందంగా ఉండనా ఏంటి? " అంది.

ఒక్కసారిగా ఆమె అలా అడిగేసరికి ఏమని చెప్పాలో బాలుకి అర్థం కాలేదు.

"అలా ఏం కాదులెండి! బాగానే ఉంటారు!" అన్నాడు.

"మరి బామ్మగారికి చెప్పొచ్చుగా ఎలా ఉంటానో.." మళ్లీ అంది.

"సాయంత్రం ఇంటికి వచ్చాక చెప్తా లంట! మిమ్మల్ని చూసి..!" అన్నాడు.

అతడి కళ్లలోకి.. ఏదో చదువుతున్నట్లుగా చూసింది శిరీష.

"సరే అయితే, సరిగ్గా చూడండి మరి!" అంటూ నవ్వింది.

బాలుకి ఇక అక్కడ నిలబడటం చాలా అనీజీగా అనిపించింది.

"ఓకే బాలూ..! వర్క్ త్వరగా ముగించుకోండి! ఈ రోజు మా ఫ్లాట్‌కి వెళ్లాలి! మీకు మా అన్న బైక్ ఇస్తాను. తను కెనడా వెళ్లాక వాచ్‌మెన్ రూమ్‌లో పెట్టించాను. మీరు రోజూ బస్‌లో తిప్పలు పడటం బాగోలేదు. మర్చిపోకండి! ప్లీజ్ వెయిట్ ఫర్ మి!" చెప్పి టేబుల్ మీదున్న ల్యాప్‌టాప్ ఆన్‌చేసింది శిరీష.

★ ★ ★

క్లాస్ పూర్తవగానే తను వెళ్లాల్సిన రూట్ బస్ ఎక్కడానికి వెళ్తోంది స్వప్న.

ఇంతలో వెనుక నుంచి క్లాస్‌మేట్స్ కొందరు పిలవడంతో ఆగింది.

"ఏంటి స్వప్నా? అంత తొందరగా వెళ్లాలా? మనం కాలేజ్ టూర్‌కి వెళ్లాలి కదా! దాని గురించి డిస్కస్ చేసుకుంటున్నాం, కాసేపు ఆగవా! ప్లీజ్!" క్లాస్‌మేట్ దినేష్ అన్నాడు.

అతనితోపాటు, కుమార్, యశ్వంత్, సౌజన్య, ప్రవల్లిక, అగర్వాల్.. ఇంకా హిమజ, మరో ముగ్గురు రోడ్డు మీదే మీటింగ్ పెట్టేశారు.

"నేను టూర్‌కి రావడం లేదని చెప్పేశాను. మళ్లీ నన్ను అడుగుతారెందుకు? " అంది స్వప్న.

"అరె యార్! నెక్ట్స్ సెమిస్టర్‌తో కాలేజికి గుడ్‌బై చెప్పబోతున్నాం! టూర్‌కి వెళ్లాల్సిందే అని డిసైడ్ చేశాం కదా! మళ్లీ ఫోజ్ కొడతావేంటి? జస్ట్ వారం రోజులే కదా!" అన్నాడు యశ్వంత్.

"ఏమో బాబూ! మా నాన్న ఒప్పుకోరు! అయినా ఈ టూర్ ఆప్షనలే కదా!" బదులిచ్చింది స్వప్న.

"అయితే డిపార్ట్‌మెంట్ నుంచి ఓ సర్క్యులర్ మీ ఇంటికి పంపించాలి.

## కొత్తగాలి...

**ప్రతినోటా 'స్వచ్ఛభారత్ మంత్రం**
**ప్రతిరోడ్డూ చెత్తకుప్పల మయం**
**డంపింగ్ యార్డులు లేకుండా**
**లక్ష్యం సిద్ధించేనా?**

– బి.వి. నరసింహారావు,
పేరాల, ప్రకాశం జిల్లా

అయినా మన హెచ్ఓడీ ఏమన్నారో గుర్తులేదా? తను కూడా వస్తాను, టూర్‌కి వెళ్లాల్సిందే అని చెప్పారు కదా! టూర్ ఆప్షనల్ కాదు, కంపల్సరీ అని ఆయనతో లెటర్ టైప్ చేయించి, అందరికీ డిస్ట్రిబ్యూట్ చేయిస్తాం! ఏమంటావ్?" అన్నాడు అగర్వాల్.

"సరే! మీ ఇష్టం బాబూ!" అంది స్వప్న.

ఇంతలో బస్ బయల్దేరబోతున్నట్లు డ్రైవర్ హారన్ మోగించాడు. వాళ్లందరినీ వదిలి చప్పున బస్సెక్కింది స్వప్న.

సీట్‌లో కూర్చుని బ్యాగ్‌ని ఒళ్లో పెట్టుకుంది. ఒక్కొక్క స్టాప్‌లో ఆగుతూ.. ట్రాఫిక్ సిగ్నల్స్ దాటుతూ.. ఆగుతూ.. ముందుకెళ్తోంది కాలేజీబస్సు. రోజూలాగే కిటికీ పక్కన కూచుంది స్వప్న.

అయితే, ఈ రోజు మాత్రం- ఒళ్లో పెట్టుకున్న బ్యాగ్ బరువుగా అనిపించింది ఆమెకి. ఈ రోజు పెరిగింది లైబ్రరీ నుంచి తెచ్చుకున్న రిఫరెన్స్ బుక్ మాత్రమే! అయితే అది అంత బరువు కూడా ఉండదు. కానీ, అందులో పెట్టిన ఒక ఉత్తరం.. క్షణక్షణానికీ బరువెక్కుతున్నట్లు అనిపిస్తోంది స్వప్నకి.

ఆ ఉత్తరం ఎవరు రాసి ఉంటారు? అసలు ఏముందా ఉత్తరంలో? ఎప్పుడెప్పుడు చదువుదామా? అనే ఆరాటం.. రోజుకన్నా ఆ బ్యాగ్‌ని ఆలోచనలన్నీ బరువుగా మార్చడం స్వప్న అనుభవంలోకి వచ్చింది.

రోజూకన్నా త్వరగా ఇంటికి చేరుకుని లైబ్రరీ బుక్‌లోంచి లెటర్‌ని తీసి డైరీలో దాచింది. ఫ్రెషప్ అయ్యాక చూస్తే.. బాలూ రూమ్‌కి ఇంకా తాళం వేసి కనిపించింది. అతను వచ్చేలోపల ఉత్తరంలో ఏముందో చదవాలనిపించింది.

ఇక ఆగలేనట్లుగా డైరీ తెరిచింది స్వప్న. కాగితం ఒకొక్క మడత విప్పింది.

*'హాయ్‌రా! ఎలా ఉన్నావ్! ఇప్పటి వరకూ మెసేజ్‌లతోనే మాట్లాడుకున్నాం. నిజానికి ఈ ఫొటోలు, ఉత్తరం, గ్రీటింగ్ కార్డ్- అన్నీ బర్త్‌డే నాటికి అందాలని ప్లాన్ చేశాను. నీకు నన్ను చూపించుకోవాలనీ, నిన్ను చూడాలనీ పెద్దగా ఆసక్తి లేదు నాకు. మనసుకి నచ్చిన నేస్తానివి నువ్వు. మనసుని ఆకట్టుకున్న స్నేహానివి. జీవితం రైలు ప్రయాణమైతే- ముందు దిగే స్టేజ్.. నీదో? లేక నాదో? మనకే తెలీదు. అయినా, ఈ జీవన గమనంలో- కాస్తంత దూరానికి గొప్ప పరిమళం అద్దిన వ్యక్తివి మాత్రం నువ్వే!*

*ఒక వ్యక్తి అనుక్షణం పక్కనే ఉండడం కన్నా- ప్రతిక్షణం ఆ వ్యక్తికి చెందిన జ్ఞాపకాల్లో గడపడం ఎక్కువ ఇష్టం. ప్రతి ఒక్కరు మరొకరివల్ల మంచే నేర్చుకోవాలి. ప్రేమనీ, ప్రేమించడాన్ని నేర్చుకోవాలి. అయితే- నేను ఇంతవరకు ఎవరినీ గాఢంగా ప్రేమించకపోవడం, కోరుకోకపోవడం మాత్రం విచిత్రం. నిన్ను ఇష్టపడ్డానా? లేక ప్రేమించానా? అసలు దీని మీదే నాకు స్పష్టత లేదు తెలుసా?*

*నీకు ఉత్తరం, ఫొటోలు ఇవ్వడానికి స్టేషన్‌కి రమ్మన్నాను. కానీ ఇచ్చింది నేనే అని మాత్రం నీకు తెలియకూడదు. అందుకే నా ఫ్రెండ్ మంజుతో పంపుతున్నానని అబద్ధం చెప్పాను. పిచ్చి బంగారువి! అందుకే నువ్వంటే నాకిష్టం. ఏ మాత్రం*

*సందేహించకుండా నమ్మేస్తావు. అందుకే నువ్వంటే- ఎంత వద్దనుకున్నా ప్రేమే కలుగుతుంది నాలో. ప్రేమ ఎప్పుడు? ఎలా? ఎందుకు? ఎవరి మీద పుడుతుంది?*

*ఈ ఉత్తరం ఇచ్చింది నేనే అని ఇది చదివేదాకా నీకు తెలీదు. రైల్వేస్టేషన్లో ఫుట్‌బ్రిడ్జి దగ్గర ముఖానికి స్కార్ఫ్ ధరించి- ఏమీ మాట్లాడకుండా- నేనిచ్చిన కవర్ అందుకుని వెళ్ళావు. ఎంత నమ్మకం నీకు? నేను చెప్పింది నిజమేనని, ఆ వచ్చింది నేను కాదని..! అందుకే ప్రేమంటే నమ్మకం. ఒకరి మీద ఒకరికి జీవితాంతం ఉండేదే..! అదే ప్రేమ..! బై!*

*- నీ నేను'*

ఉత్తరం చదవడం పూర్తిచేశాక గుండెలో ఏదో సముద్రపు ఘోషలాంటిది స్వప్నలో. అందులో ఉత్తరంతోపాటు ఫొటోలు అని కూడా రాయడంతో వాటికోసం లైబ్రరీ బుక్‌లోని ప్రతి పేజీ వెతికింది. ఇంకేమీ కనిపించలేదు.

ఇది కచ్చితంగా ఒక అమ్మాయి.. ఒక అబ్బాయికి రాసిన ఉత్తరంగా - స్వప్నకి అర్థమైంది.

అయితే ఈ ఉత్తరం అందుకున్న అబ్బాయి అయినా లైబ్రరీ బుక్‌లో పెట్టి ఉండాలి, లేదా ఆ రాసిన అమ్మాయే.. ఎవరికి రాసిందో వాళ్ళకి అందజేయకుండా లైబ్రరీ బుక్‌లోపెట్టి మర్చిపోయి ఉండాలి- అని ఆలోచించింది.

ఇప్పుడేం చేయాలి ఈ ఉత్తరాన్ని? అనేది స్వప్నకి ఏమీ అర్థం కాలేదు.

ఇంతకుముందు ఎనిమిది మంది ఈ పుస్తకాన్ని తీసుకెళ్లారు. వీళ్ళలో ఎవరో ఒకరు.. ఈ ఉత్తరం రాసిన లేదా అందుకున్న వ్యక్తి అయి ఉంటారు.

అదెవరో తెలుసుకుని- అందజేస్తే ఎలా ఉంటుంది? అనిపించింది ఆమెకి.

అలాగే మళ్ళీ ఆ ఉత్తరాన్ని ప్రతివాక్యం చదివింది.

ఇందులో రాసిన ఫిలింగ్స్.. నిజంగా నిజమేనా? ప్రేమంటే.. ఒకరి మీద ఒకరికి కలిగిన, జీవితాంతం అలాగే ఉండాలనిపించే నమ్మకమా?

అసలు ప్రేమంటే ఎలా ఉంటుంది? ప్రేమ.. ఎలా తెలుస్తుంది? ప్రేమని ఎలా గుర్తించాలి? స్వప్న హృదయాన్ని ప్రశ్నలు చుట్టేశాయి.

★ ★ ★

మెయిన్‌డోర్ అన్‌లాక్ చేసి లోపలికి అడుగుపెట్టింది శిరీష.

"రండి బాలూ! వెల్‌కమ్ టు మై హోమ్!" పెద్దలైట్ స్విచ్ నొక్కింది. బయట కారిడార్‌లో నిలబడి ఉన్న బాలు లోపలికి నడిచాడు.

ఫ్లాట్ లోపలంతా రిచ్‌గా, మంచి ఫర్నిచర్, కార్పెట్స్‌తో, పెద్దప్లాస్మా టీవీ, హోం థియేటర్.. పోష్‌గా ఉంది.

"ఎలా వుంది? బాగుందా? కూర్చోండి!" చెప్పి అలాగే లోపలికి వెళ్ళిపోయింది. మెత్తటి సోఫాలో కూచుని చుట్టూ చూశాడు బాలు.

ఎదురుగా గోడకి శిరీష అమ్మ, నాన్న, అన్నల ఫొటోలు.. ఇంకా రకరకాల ఏంగిల్స్‌లో ఆమె ఫొటోలూ కనిపిస్తున్నాయి.

ఇంతలో స్నాక్స్, కూల్‌డ్రింక్స్‌తో హాల్లోకి వచ్చింది శిరీష.

"అవన్నీ- అమ్మ, నాన్న, అన్న ఫొటోలు - ఇవన్నీ శిరీషవి" చెప్పింది.

"బాగున్నాయి ఫొటోలు!"

"మరి..! నేను బాగోలేనా? కనీసం ఫొటోలో అయినా సరిగ్గా చూడండి. ఇంటికి వెళ్ళాక బామ్మగారు.. నేనెలా ఉన్నానని అడుగుతారు కదా! ఏం చెబుతారు? " చిలిపిగా అంది.

ఇబ్బందిగా నవ్వాడు బాలు. "ఏ మాటనీ మర్చిపోరుకదా మీరు" అన్నాడు.

"ఆడవాళ్ళు అంతే! మర్చిపోరు. మనసులోంచి ఏ సంగతీ అంత తేలిగ్గా తీసేయ



లేరు. బాధయినా, సంతోషమైనా, ప్రేమ అయినా, ద్వేషం అయినా" చెప్పింది.

ఆ గదిలో చల్లగా ఉంది. కానీ ఇద్దరి మధ్య మాటల్లో నిగూఢమైంది మాత్రం బరువుగా మారినట్లయింది.

"ఇంత ఇంట్లో.. ఒక్కళ్ళూ ఉండాలంటే బోరు కొట్టదా? " ఏదో ఒకటి అనాలన్నట్లుగా అన్నాడు బాలు.

"రాత్రి చెప్పలేదా..! పాటలూ, సినిమాలు ఇవే నా నేస్తాలు! ఎంతమందిలో ఉన్నా, గుంపులో పార్టీలో ఉన్నా ఒంటరిగానే ఉన్నట్లుంటుంది. ఎందరిలో ఉన్నా.. నాకు నేనే.. నాలో నేనే.." చెప్పింది.

వాచ్‌లో టైమ్ చూసుకున్నాడు బాలు.

అది గమనించి "బయల్దేరుదామనుకుంటున్నారా ఏంటి? " అంది.

"లేటవుతుందేమో అని" అన్నాడు.

"సరే, పదండి! బైక్ కీస్ ఇవిగోండి! ఇందాక సెల్లార్ చూశారు కదా! వాచ్‌మెన్ ఈపాటికి శుభ్రంగా తుడిచి వుంటాడు. రేపట్నించీ బైక్ మీదే ఆఫీస్‌కి రావాలి. అది మా అన్నది. ఇప్పుడు మీకిస్తున్నాను" చెప్పింది శిరీష.

బయటి కారిడార్‌లోకి అడుగు పెట్టిన బాలుని ఎటువైపు నుంచో వచ్చిన చల్లటి గాలి తాకింది. వాన వచ్చే ముందు తడిసిన మట్టివాసన మోసుకొచ్చే, బరువుగా, ఆర్ద్రంగా వీచే ఆ గాలి.. రాబోయే ఏ వర్షానికో సంకేతంలా!!

నాలుగు అడుగులు కారిడార్‌లోకి నడి



కెళ్ళి ఈ బైక్ ఇవ్వడం.. అన్నీ.

తనని కూడా బజారు వరకు తీసుకెళ్లమని పట్టు పట్టింది స్వప్న.

జానకమ్మ కూడా స్వప్నని తీసుకెళ్ళమనడంతో బైక్ మీద ఇద్దరూ బయల్దేరారు. మెయిన్ రోడ్‌లో షాప్ వరకు వెళ్ళి ఐస్ క్రీమ్స్ తీసుకుని తిరిగి వస్తుండగా..

"ఇందాక కాలేజీలో ఏం జరిగిందో తెలుసా? " అంటూ లైబ్రరీలో బుక్, అందులో దొరికిన ఉత్తరం గురించి చెప్పింది స్వప్న.

"అందులో ఏం రాసుంది? " అని అడిగాడు బాలు.

ఇంటికి చేరుకున్నాక కిందకి దిగుతూ "కాసేపాగి ఇస్తా! నువ్వే చదువు!" చెప్పి లోపలికి వెళ్ళిపోయింది స్వప్న.

రాత్రి భోజనం చేసేటప్పుడు కాలేజ్ టూర్ గురించి తండ్రితో చెప్పింది స్వప్న.

"ఎప్పుడు? ఏ ఊళ్ళు వెళ్తారు? " అడిగాడు రంగనాథ్.

అన్ని వివరాలు చెప్పింది స్వప్న.

"సరే! వెళ్దువుగానిలే! నీపేరు ఇచ్చారా మరి? " అడిగాడు రంగనాథ్

"పేరు ఇవ్వడం అంటూ ఉండదు నాన్న. అందరూ వెళ్ళాల్సిందే ప్రొఫెసర్లు

చాడు బాలు.

అప్పటికీ ఇంకా డోర్ దగ్గరే నిలబడి ఉన్న శిరీష, వెనక నుంచి "బాలూ..!" అని పిలిచింది.

ఆగి వెనక్కి తిరిగి చూశాడు బాలు.

అతడిని ఒక్క క్షణం అలాగే చూసి "ఏమీ లేదు! గుడ్‌నైట్!" చెప్పి, లోపలికి వెళ్ళి తలుపు వేసుకుంది శిరీష.

★ ★ ★

బైక్‌తో ఇంటికి చేరుకున్న బాలుని చూడగానే అందరికన్నా ఎక్కువ సంతోషించాడు అనిల్. "అక్కా! నా కోరిక తీరింది" అంటూ బాలుతో బైక్ మీద తిరిగి వచ్చాడు.

"ఎక్కడిది బాలూ? " అడిగింది స్వప్న.

శిరీష సంగతి చెప్పాడు. వాళ్ళ అన్న కెనడాలో ఉండడం - తనని ఇంటికి తీసు

## కొత్తగాలి...

**మన అమ్మమ్మ**
**అమ్మని కడుపులో చిదిమేస్తే**
**మనకి అమ్మ ఏది?**
**మన ఉనికి ఏదీ?**

**– ఆర్.ఎస్. హైమవతి,**
చెన్నై

కూడా వస్తారు" అంది.

"సరే.." అంటూ బయటకి నడిచాడు రంగనాథ్.

అప్పటికే వరండాలో బాలు, అనిల్ ఏదో మాట్లాడుకుంటూ బైక్ దగ్గరకెళ్లారు. రంగనాథ్ కూడా అక్కడికెళ్లాడు.

"ఏవయ్యా బాలూ! బైక్ తెచ్చావట కదా! బాగుంది! అన్నట్లు నీకు కారు డ్రైవింగ్ కూడా వచ్చా? " అడిగాడు.

"లైసెన్స్ కూడా ఉందండీ!"

"గుడ్! మా ఫ్రెండ్ నిన్న ఫారెన్ వెళ్ళాడు కొడుకు దగ్గరికి. ఆరునెలల వరకూ రాడు. కారు అప్పటిదాకా అలా మూలన పడేయడం ఎందుకూ? నన్ను తీసుకెళ్లి వాడుకోమన్నాడు" చెప్పాడు.

"రేపు వెళ్లి తీసుకొద్దామా మరి? " అడిగాడు బాలు.

"అదే పనిచేద్దాం రేపు సాయంత్రం!" చెప్పి లోపలికి వెళ్లిపోయాడు.

కాసేపటికి బయటకొచ్చిన స్వప్న మడతలు పెట్టిన పేపర్ ఒకటి బాలుకి ఇచ్చి ఏమీ మాట్లాకుండా లోపలికెళ్లిపోయింది.

అప్పటికే బాగా రాత్రవడంతో తను కూడా రూమ్‌లోకి వెళ్ళిపోతుండగా పక్కనే ఉన్న సెల్‌ఫోన్ రింగ్ అయినట్లనిపించి చూస్తే శిరీష నుంచి మూడు మిస్డ్‌కాల్స్. అంత రాత్రప్పుడు ఆమె అన్నిసార్లు ఎందుకు ఫోన్ చేసిందో అనుకుంటూ ఆమెకి కాల్‌చేశాడు బాలు.

అతని కాల్ కోసమే చూస్తున్నట్లుగా వెంటనే ఆన్సర్ చేసింది శిరీష.

"హలో బాలు! బిజీనా? " అంది.

"లేదు! ఇప్పుడే రూమ్‌లోకి వచ్చాను"

"బైక్ ఎలా ఉంది? మీఫ్రెండ్ స్వప్నని అలా తీసుకెళ్ళావా? లేదా? " అడిగింది.

తనతో మాట్లాడిన ప్రతిసారీ స్వప్న టాపిక్ ఎందుకు తీస్తోందా అనుకుంటూ "బాగుంది! స్వప్ననీ, ఆమె తమ్ముడు అనిల్‌ని కూడా ఒక రౌండ్ తిప్పాను" చెప్పాడు బాలు.

"ఇంకేంటి? బాలూ చెప్పండి!" అంది.

"ఏమీలేదు. ఇంతసేపు మీరేం చేశారు? సినిమా చూశారా? " అడిగాడు.

"అవును! ఇప్పుడే అయింది. ఈ రోజు మళ్ళీ ఒక సినిమా లెక్కలేనన్నోసారి చూశాను, బ్లాక్ అండ్ వైట్ ఫిల్మ్- మరో చరిత్ర" చెప్పింది.

"సరే" అన్నాడు బాలు.

"ఇంకో విషయం చెప్పనా? నిన్ను ప్రతి సారీ స్వప్న గురించి అడుగుతుంటాను.. ఎందుకు? అని అనుకుంటారు కదూ? " అడిగింది.

తన మనసులో ఫీలింగ్ ఎలా కనిపెట్టిందా? - అని ఆశ్చర్యపోయాడు బాలు.

"ఎందుకంటే..? బాలు అనే పేరుకు, స్వప్న అనే పేరుకు గొప్ప రిలేషన్ ఉంది. నేను ఎంతో ఇష్టంగా ఎప్పుడూ చూసే సినిమాలో హీరో పేరు బాలు. హీరోయిన్ పేరు స్వప్న.." చెప్పడం ఆపింది.

ఆమె మాటలు వినగానే బాలుకి రక్తమంతా ముఖంలోకి వచ్చి చేరినట్లుగా.. గుండె వేగం పెరిగినట్లుగా.. ఏదో ఉద్వేగం.

"బాలు అనే పేరున్న మిమ్మల్ని రోజూ చూస్తూనే ఉన్నాను కానీ, నాకెంతో ఇష్టమైన, ఎన్నో ఏళ్ళ నుంచీ పరిచయమున్న స్వప్న అనే పేరున్న ఆ అమ్మాయి ఎలా

ఉంటుందో చూడాలని విపరీతమైన ఆసక్తి నన్ను స్థిమితంగా ఉండనీదు తెలుసా? బాలూ, స్వప్నలు ఒకే ఇంట్లో నివసించడం, ఫ్రెండ్స్ అవడం.. నన్ను మరీ ఎక్సైట్ చేస్తోంది" చెప్పింది శిరీష.

ఇంత విడమరిచి చెప్పేసరికి బాలుకి సైతం ఆశ్చర్యం కలిగింది.

"అందుకే, ఒక్కసారి స్వప్నని చూడాలని ఉంది. ఎలాగో ఒకలాగా.. సాధ్యమైనంత త్వరగా.. ప్లీజ్ బాలూ..! ఇలా అడుగుతున్నానని.. రేపు సాయంత్రం మీ ఇంటికి వస్తాను" ప్రాధేయపడింది శిరీష.

"రేపు ఆఫీసులో కలిసినప్పుడు మాట్లాడుకుందాం! చాలా రాత్రయింది. గుడ్ నైట్!" చెప్పాడు బాలు.

"గుడ్‌నైట్" కాల్ కట్‌చేసింది శిరీష.

ఏదో, ఎప్పుడో ముప్పై ఏళ్ళ కిందటి సినిమాలోని హీరో, హీరోయిన్ల పేర్లు- తామిద్దరి పేర్లు ఒకటయినంత మాత్రాన, ఇద్దరి మధ్య ఏర్పడిన పరిచయం, స్నేహం చివరికి ఎటు దారితీయబోతున్నాయి? తనేమో అనాథ! దురదృష్టవంతుడు! చిన్న, పొందికైన కుటుంబంలో పుట్టి.. అనుబంధాల మధ్య పెరుగుతున్న అదృష్టవంతురాలు స్వప్న. ఆమెకు, తనకీ.. సముద్రంలో ఉప్పుకీ, చెట్టుమీది కాయకీ ఉన్నంత దూరం, అంతరం ఉంది. మనసులోకి ఏ ఇతర ఆలోచన రానీకుండా ప్రశాంతంగా బతకాలనిపించింది బాలుకి.

ఇలా ఆలోచిస్తూ పరధ్యానంగా లైట్ ఆఫ్‌చేసి, కళ్ళు మూసుకున్నాడు.

ఫ్యాన్ గాలికి కొద్దిసేపటి క్రితం స్వప్న ఇచ్చిన ఉత్తరం మంచం మీద గాలికి కదిలి.. నేల మీద పడింది. అలాగే మంచం కిందకి వెళ్ళిపోయింది. స్వప్న తనకు ఉత్తరం ఇచ్చిన సంగతి బాలు మర్చిపోయి నిద్రలోకి జారుకున్నాడు.

★ ★ ★

అన్ని కేసులు వాయిదా వేశాక అనిత కేసు మాత్రం జడ్జిమెంట్ ఇవ్వడానికి పక్కన పెట్టారు న్యాయమూర్తి.

ఆ రోజు కోర్టుహాల్లో చాలామంది న్యాయవాదులు, కక్షిదారులు, బయటివ్యక్తులు కూర్చుని ఉన్నారు. ఎప్పటిలాగానే అనిత, శ్రీకాంత్ మాత్రం కోర్టు ఆవరణ లోని చెట్టుకింద పార్క్ చేసిన ఆటోలో కూర్చుని ఉన్నారు.

అనిత కేసు డీల్‌చేసే కోర్టు కానిస్టేబుల్‌కి న్యాయమూర్తి ఎలాంటి తీర్పు ఇవ్వబోతున్నారనేది సస్పెన్స్‌గా మారింది. తను చట్టప్రకారం నేరం చేశానని ఒప్పుకుని, ఆమె సంతకం చేసి ఇచ్చింది కాబట్టి- ఇక శిక్షించడం అనివార్యం. అనితకి జైలు శిక్షా? లేక జరిమానానా? అనేది ఇంకాసేపట్లో తేలనుండడంతో కానిస్టేబుల్‌లో ఒక విధమైన టెన్షన్ మొదలయింది.

అనిత, శ్రీకాంత్ మౌనంగా ఆటోలోనే కూర్చుండిపోయారు. కోర్టు విధించబోయే శిక్షకన్నా ఎక్కువ శిక్షని మానసికంగా, జీవితపరంగా అనిత ఇప్పటికే అనుభవిస్తోందని, మూగదైపోయి, మరణించిన శశాంక్ మిగిల్చిన జ్ఞాపకాల్తో జీవచ్ఛవంలా బతుకుతోందని ఆమెకి, శ్రీకాంత్‌కీ తప్ప ఈలోకంలో ఇంకెవరికీ తెలీదు.

లంచ్‌బ్రేక్ ముందు జడ్జి అనితని పిలవమంటూ క్లర్క్‌ని ఆదేశించారు.

కోర్టు బంట్రోతు మూడుసార్లు తన పేరు పిలవడంతో- మళ్ళీ యాంత్రికంగా, నిర్వేదం నిండిన వదనంతో ఆటో దిగి, నడుచుకుంటూ వచ్చిన అనిత బోనులోకి వెళ్ళి నిలబడింది.

బెంచీ మీద కూర్చున్న న్యాయమూర్తి.. ఎదురుగా బోనులో ఉన్న అనితని ఒకసారి పరీక్షగా చూశారు.

తన జీవితంలో ఇలాంటి విపత్కర పరిస్థితి ఇంతవరకు రాలేదని న్యాయమూర్తికి అనిపించింది. రాత్రంతా మనసులో ఏదో తెలీని బాధతో- అనిత కేసుని- రికార్డులనీ

పరిశీలించిన ఆయనకు ప్రేమలో ఆనందంతోపాటు- భరించలేనంత విషాదం కూడా నీడలాగ వెన్నంటే ఉంటుందని అర్థమైంది.

గొంతు సవరించుకున్నారు న్యాయమూర్తి.

"ఐ.పి.సి. 309 ప్రకారం ఆత్మహత్యాయత్నానికి పాల్పడి నేరం చేసినట్లు ముద్దాయి కోర్టులో లిఖిత పూర్వకంగా స్టేట్‌మెంట్ ఇవ్వడంతో- ముద్దాయి నేరం చేసిందని కోర్టు భావిస్తోంది" ఇంతవరకు చెప్పి మాటలు రానట్లుగా కొన్నిక్షణాలు ఆగారు న్యాయమూర్తి.

కోర్టుహాల్లో భయంకరమైన నిశ్శబ్దం. న్యాయవాదులు, కోర్టు సిబ్బంది.. ఒకవిధమైన టెన్షన్‌తో అనితనీ, న్యాయమూర్తిని చూడసాగారు.

"నేరం చేశానని ఒప్పుకున్న ముద్దాయి అనితకి ఏడాది జైలుశిక్ష విధించడమైనది. ప్రొబేషన్ ఆఫ్ అఫెండర్స్ ఏక్ట్ కింద- జైలులో కాకుండా తన ఇంట్లోనే ఈ శిక్షను అనుభవించేలా- ముద్దాయి శారీరక అశక్తత, మానసికస్థితిని పరిగణనలోకి తీసుకుని- సత్ప్రవర్తనతో ఇకపై ఆత్మహత్యాయత్నానికి పాల్పడకుండా మనసుని దిటవుపరచుకుని- ఆత్మస్థైర్యంతో బతకడానికి కోర్టు అనుమతిస్తూ- తీర్పునిస్తోంది" న్యాయమూర్తి ఇక చెప్పేది ఏమీలేనట్లుగా బెంచ్ దిగి ఛాంబర్‌లోకి వెళ్ళిపోయారు.

బోనులో ఉన్న అనితలో తెలీని ఉద్వేగం.

ఆత్మాహత్యాయత్నానికి ఇంత చిన్నశిక్ష విధించారా? తనని ఉరితీస్తే- వెంటనే శశాంక్ దగ్గరికి, పైలోకాలకి వెళ్ళిపోయేదాన్ని కదా! శశాంక్ లేని జీవితమే తనకు కఠినమైన శిక్ష. అలాంటిది.. ఇప్పుడీ ఏడాది జైలుశిక్ష ఏపాటిది? అనుకుంటూండగా.. ఆమె గుండె లోతుల్లో గూడుకట్టుకుని ఉన్న దిగులు లావాలా పెల్లుబికి, కన్నీళ్ళుగా కళ్ళ నుంచి జారిపడ్డాయి. అనితని వింతగా, జాలిగా చూస్తూ.. ఒక్కొక్కరే లేచి బయటకెళ్తున్నారు.

అనితని ఆఫీస్‌లోకి రమ్మంటూ బెంచి క్లర్క్, కానిస్టేబుల్‌తో చెప్పి పంపాడు. బోను దగ్గరకెళ్ళిన కానిస్టేబుల్, చలనం లేకుండా నిలబడిన అనితని- తనతో రమ్మన్నట్లుగా సైగచేశాడు. అప్పుడతనిలో ఇందాకటి టెన్షన్ తగ్గిపోయింది. పి.ఓ. యాక్ట్ కూడా వర్తింపచేసిన న్యాయమూర్తి సరైన తీర్పు ఇచ్చారనే ఆనందం కలిగింది.

అప్పటికి అనితలో చలనం కలిగింది. కోర్టుహాల్లోనే కూర్చుని ఉన్న శ్రీకాంత్ దిగులు నిండిన కళ్ళతో అక్కనే చూస్తూ ఆమెవైపు నడిచాడు.




రోజులు వేగంగా పరిగెత్తాయి. వరండా రూమ్‌లో అద్దెకి దిగిన బాలుకీ ఆ గది మాత్రమే ఇవ్వలేదు రంగనాథ్ కుటుంబం.. తమ హృదయాల్ని కూడా ఇచ్చేశారనిపించింది. అన్నిటికీ, అందరికీ బాలు కావాల్సి వస్తున్నాడు. ఆ ఇంట్లోని మనిషిలా మారిపోయాడు.

ఇంట్లో ఎవరికి ఏ అవసరం వచ్చినా పిలిచేది బాలూనే. అందరి పనులూ, అవసరాలు తీర్చే బాలు అటు అనిల్‌కి, ఇటు స్వప్నకి క్లోజ్‌ఫ్రెండ్‌గా మారాడు. మరో రెండు రోజుల్లో కాలేజ్‌టూర్‌కి వెళ్ళబోతోంది స్వప్న.

ఆ రోజు శనివారం కావడంతో వీక్లీ

మీటింగ్ పూర్తయ్యాక- అందరూ వెళ్ళిపోయారు. శిరీష కూడా తన ఛాంబర్ క్లోజ్ చేసి, బాలు క్యాబిన్ దగ్గరకొచ్చి "పదండి వెళ్దాం!" అంది.

ఇద్దరూ బయటకొచ్చి కారిడార్‌లో నడుస్తుండగా "మిమ్మల్ని అసలు నమ్మకూడదు బాలు!" అంది శిరీష.

ఆమెవైపు చూస్తూ.. "అదేంటి అలా అన్నారు? నేనేం చేశాను? " అడిగాడు.

"మరి! లేకపోతే, 'మా ఇంటికి తీసుకెళ్తాను, స్వప్నని పరిచయం చేస్తా'నని చెప్పి ఎన్నోరోజులయింది? మాట నిలబెట్టుకోలేరు!" అంది విడ్డూరంగా.

"సారీ! పనుల హడావుడిలో మర్చిపోయాను. రెండ్రోజుల్లో స్వప్న టూర్‌కి వెళ్తోంది. మళ్ళీ వారం పదిరోజుల వరకూ రాదు. మీరు ఫ్రీగా ఉంటే ఈ రోజు వెళ్దామా? " అన్నాడు బాలు.

"వెళ్దాం! ఇప్పుడు కాదు. సాయంత్రం నేనే వస్తాను! ఎక్కడికీ వెళ్ళాకుండా రూమ్‌లో ఉండండి!" చెప్పింది శిరీష.

బాలు బైక్ మీద, శిరీష కారులో ఎవరి దారిన వాళ్ళు వెళ్ళిపోయారు. రూమ్‌కి చేరుకున్న బాలు- సాయంత్రం వరకు నిద్రపోయాడు. స్వప్న కాలేజీ నుంచి రావడానికి ఇంకా టైమ్ ఉందనగా, తోటలో మొక్కలకి వాటరింగ్ చేస్తూ అనిల్‌తో, జానకమ్మతో బాలు మాట్లాడుతుండగా ఇంటి ముందు కారాగింది.

చూస్తే.. శిరీష..! లోపలికి వచ్చిన ఆమెని అందరికీ తన ప్రాజెక్ట్‌హెడ్‌గా పరిచయం చేశాడు బాలు.

కాసేపు అలా మాట్లాడాక "మీ రూమ్ చూపించండి బాలు..!" అంది శిరీష.

దాంతో వరండాలోకి, అక్కడ్నుంచి తన రూమ్‌లోకి శిరీషని తీసుకెళ్ళాడు బాలు. అతి సాధరణంగా, మిడిల్‌క్లాస్ యువకుడు, అందులోనూ బ్యాచిలర్ రూమ్ ఎలా ఉంటుందో? అలాగే ఉంది బాలు రూమ్! గోడకి అతికించిన పోస్టర్లు టేబుల్ మీద బుక్స్ అన్నీ చూసింది.

"మీరు పుస్తకాలు బాగా చదువుతారు కదూ!" అంటూండగా బయటనుంచి జానకమ్మ బాలుని పిలవడం వినిపించింది.

"ఇప్పుడే వస్తాను" చెప్పి చప్పున బయటకెళ్ళాడు బాలు.

బుక్స్ చాలా రకాలు! వీటితో పాటు నీలిరంగు పేపర్‌ని కవర్‌గా వేసిన డైరీ కనిపించింది శిరీషకి. డైరీ తీసుకుని చూసింది. మొదట్లో చాలా ఖాళీ పేజీలు- తర్వాత నుంచి వరుసగా ప్రతిపేజీలో కుదురైన అక్షరాలతో రాతలు.. ఇలా ఇంకొకరి డైరీ చదవడం సంస్కారం కాదని పించి, డైరీని మూసేసి, యథాస్థానంలో పెట్టేసింది.

అక్కడ సింగిల్‌కాట్ పక్కనే చిన్న ప్లాస్టిక్ స్టూల్‌లాంటిది కనిపిస్తే, వెళ్ళి కూచుంది. చుట్టూ చూస్తుండగా, విసురుగా వీస్తున్న ఫ్యాన్‌గాలికి మంచం కింద నుంచి రెండు మడతలుగా పెట్టిన ఏదో కాగితం చిన్నగా గిరికీలు కొడుతూ బయటకొచ్చింది.

గాలికి ఎగరబోతున్న ఆ పేపర్‌ని చప్పున పట్టుకుంది శిరీష. ఆ కాగితం మడతలు విప్పి చూసేసరికి.. లోపల ఏదో ఉత్తరం లాంటిది. పొందికైన అక్షరాలతో పేజీ నిండా రాసిన ఉత్తరం. '-నీ నేను' అనే అక్షరాలు కనిపించాయి.. అచ్చంగా ఓ అమ్మాయి రాసిన అక్షరాల్లా!

శిరీష కనుబొమలు ముడివడ్డాయి. మనసులో ఏదో ఆలోచన మెదిలింది. వెంటనే ఆ కాగితాన్ని మళ్ళీ మడతలుగా పెట్టి, తన హ్యాండ్‌బ్యాగ్‌లో ఉంచింది.

బాలు రూమ్‌లోకి వచ్చాడు.

"స్వప్న కాలేజ్ నుంచి వచ్చింది. పరిచయం చేస్తాను రండి!" అన్నాడు తలుపు దగ్గరే నిలబడి.

"అవునా? " ఆశ్చర్యంగా అంటూ బయ

టకి నడిచింది శిరీష.

అంతకు ముందే ఇంటికొచ్చిన స్వప్న, ముఖం కడుక్కుని వరండాలోకి వస్తోంది.

తెల్లటి చుడీదార్! మెడ వెనక క్లిప్ పెట్టి వదిలేసిన జుట్టు భుజాలు దాటింది! కొద్దిగా కోలముఖం! తీర్చిదిద్దిన కనుబొమ్మలు, చిన్నముక్కు, పచ్చటి చెంపలు, ఎప్పుడూ చిన్నగా నవ్వుతున్నట్లుండే ఎర్రని పెదవులు! కొద్దిగా విశాలంగా ఉన్న నుదురులో కుడివైపు కొద్దిగా దిగినట్టుండే హెయిర్‌లైన్..! అయిదున్నర అడుగులకి తక్కువ ఎత్తుగా, చూడగానే, మరోసారి చూడాలని, మళ్ళీమళ్ళీ చూడాలనిపించేంత ఆకర్షణీయంగా.. స్వప్న!! ఏదో కలలో కనిపించి మాయమయిన దేవకన్య లాగా.. మధురమైన కలలాగా.. స్వప్న!! నిజంగా స్వప్నం లాగే!!

కళ్లప్పగించి ఆమెను అలాగే చూస్తుండిపోయింది శిరీష.

తడిసిన జుట్టుకొసలు చెంపల మీద అంటుకుంటూంటే- అప్పుడే ముఖం కడుక్కుని, మెత్తటి టవల్‌తో తుడుచుకుంటూ వచ్చిన స్వప్నకి- వరండా రూమ్‌లోంచి బాలు, వెనకే మరో యువతి బయటకి వస్తూండడంతో అక్కడే ఆగిపోయింది.

"స్వప్న! వీరి పేరు శిరీష! మా ప్రాజెక్ట్ హెడ్! - తను స్వప్న!" ఒకరిని ఒకరికి పరిచయం చేశాడు బాలు.

ముందుగా తేరుకున్న స్వప్న "హాయ్!" అంటూ పలకరించింది.

బదులుగా నవ్వి, చెయ్యి ముందుకి చాచింది శిరీష! "స్వప్న..! ఈ పేరంటే నాకు ఇష్టం! ఇన్నాళ్లకి మిమ్మల్ని కలవడం హ్యాపీగా ఉంది" అంది హుందాగా!

స్వతహాగా ఫ్రెండ్లీ నేచర్ కలిగిన స్వప్న- అప్పుడే పరిచయమైన శిరీషతో కాజువల్‌గా మాటలు కలిపేసింది.

"బాలుని సబార్డినేట్‌గా ట్రీట్ చేయను. ఒక ఫ్రెండ్‌లాగా ఉంటాడు. మిమ్మల్ని చూడాలని ఎన్నోరోజుల నుంచీ అడుగుతుంటే చివరికి ఈ రోజు కుదిరింది" అంది శిరీష.

"నన్ను చూడాలనా? ఏమైనా సెలబ్రిటీనా ఏంటి? నా గురించి ఏదేదో చెప్పి ఉంటాడు ఈయనగారు! ఏంటీ? నా గురించి ఏం చెప్పావ్?" బాలుని దబాయిస్తూ అడిగింది స్వప్న.

అప్పుడు స్వప్న వాయిస్‌లో ఏదో తెలీని అధికారాన్ని, దగ్గరితనాన్నీ శిరీష ఈజీగా గుర్తించింది.

ఇద్దరమ్మాయిల మధ్య అలా ఇరుక్కున్న బాలు "నేనా? నీ గురించి చెప్పడానికి నువ్వేమైనా సెలబ్రెటీవా? మిస్ యూనివర్స్‌వా? నాకు ఫ్రెండ్ అని చెప్పా! అంతే కదా శిరీషగారూ!" అడిగాడు.

కొంతసేపు అలా మాట్లాడుకున్నాక వెళ్ళడానికి లేచింది శిరీష.

కారు వరకూ తోడుగా వచ్చిన బాలుతో "ఇంకేంటి బాలు? రేపు సండే.. ఏమైనా పార్టీలు ఉన్నాయా?" అడిగింది.

"లేదండీ! నాకు అంత సర్కిల్ ఏర్పడలేదు. అయినా నాకిష్టంలేదు!" చెప్పాడు.

"రేపు ఈవినింగ్ బీచ్ దగ్గరి ఫామ్‌హౌస్‌లో గెట్ టుగెదర్ పార్టీ ఉంది. ఈరోజు నైట్ బ్యాచిలర్ పార్టీ ఉంది పబ్‌లో. మీరు నాతో దేనికి వస్తున్నారు? ఈ రోజు? లేదా రేపు? చెప్పండి" అంది శిరీష.

'శిరీషతో పార్టీకి వెళ్లడమే? బాప్‌రే..!' అనుకున్న బాలు.. ముందు ఈ రోజు తప్పించుకుంటే, రేపు ఎలాగో ఒకలాగ స్కిప్ చేయొచ్చు అనిపించి "రేపు సాయంత్రం పార్టీకి వస్తాలెండి!" చెప్పాడు.

ఆ మాటతో శిరీషముఖం వికసించింది.

"థ్యాంక్స్ బాలు! ఈ రోజు లేట్‌నైట్ పార్టీకి నేను కూడా వెళ్లను. రేపు సాయంత్రం ఇటే వస్తాను! రెడీగా ఉండు! ఇటు నుంచి ఇటే వెళ్దాం!" చెప్పి, సమాధానం కోసం చూడకుండా చప్పున కారెక్కి

వెళ్ళిపోయింది శిరీష.

వెనక్కి తిరిగి గేటు తీసుకుని లోపలికి నడిచాడు బాలు.

అప్పటి దాకా వరండాలోనే ఎదురుచూస్తూన్న స్వప్న ముఖంలో, కళ్ళలో.. కోపం, విసుగును బాలు గుర్తించలేకపోయాడు.

దగ్గరకొచ్చిన బాలుతో "నిన్ను.. ఈ మగాళ్ళని.. ముఖ్యంగా నిన్ను అసలు నమ్మకూడదు" అంది కోపంగా స్వప్న.

ఆమె అలా అనేసరికి బాలుకి ఏమీ అర్థంకాలేదు. "అదేంటి స్వప్న? నేనేం చేశాను? " అయోమయంగా అన్నాడు.

"ఏం చేశావా? నేను చెప్పను! నువ్వే గుర్తుతెచ్చుకో!" చెప్పి లోపలికి విసురుగా వెళ్ళిపోయింది స్వప్న.

ఆమెకి అంత సడన్‌గా కోపం ఎందుకు వచ్చిందో బాలుకి అర్థంకాలేదు.

ఇంతసేపు శిరీషతో ఉన్నప్పుడు మామూలుగా మాట్లాడిన స్వప్న ఇప్పుడేంటి? అనిపించింది. ఒకవేళ శిరీషని ఇంటికి, రూమ్‌కి పిలవడం, స్వప్న గురించి ఆమెకి ముందే చెప్పడం.. కోపం తెప్పించాయా అనిపించింది. ఒక్కసారిగా నిస్సత్తువగా, శరీరంలో శక్తినంతా లాగేసినట్లుగా అనిపించింది.

నిశ్శబ్దంగా వెళ్ళి అక్కడే ఉన్న కుర్చీలో కూర్చున్నాడు.

అప్పటిదాకా లోపల టీవీ చూస్తున్న అనిల్ బయటకొచ్చి, బాలు భుజం మీద చేయివేసి, "బాలూ..! ఏంటి సంగతులు? రేపు మమ్మల్ని బీచ్‌కి తీసుకెళ్ళకూడదూ? " అన్నాడు.

అసలే తీరని అసహనంతో ఉన్నాడేమో, బాలుకి చిరాకుగా అనిపించింది.

"ఏయ్..! ఎప్పుడూ ఏదోఒకటి! నాకు వేరే పనులేవీ ఉండవా? తీసుకెళ్ళను పో!" కసురుకుంటున్నట్లుగా అన్నాడు బాలు.

సడన్‌గా బాలు విసుక్కునే సరికి అనిల్ హర్ట్ అయ్యాడు. ఏనాడూ పరుషంగా మాట్లాడని బాలు అలా చిరాకుపడేసరికి బిక్కముఖం వేశాడు. ఎందుకనో ఏడుపొచ్చినట్లయింది.

"నీతో ఫ్రెండ్‌షిప్ కట్! నన్ను ఎందుకు తిట్టావ్? " అంటూ లోపలికి వెళ్లిపోయాడు అనిల్.

బాలు మనసంతా చిరాకుగా మారిపోయింది. స్వప్న తనతో కోపంగా మాట్లాడి వెళ్లిపోవడం, దీంతో తనలో ఏదో గజిబిజి.. అనిల్ మీద కోపం చూపడం.. ఎందుకు ఇలా..?

బాలు మనసులోనే మథనపడ్డాడు. తనెప్పుడూ ఇలా ప్రవర్తించలేదు. కొంతసేపు అలాగే కూర్చుండిపోయాడు.

లోపల నుంచి కూడా ఎవరి మాటలూ, శబ్దాలు వినిపించడంలేదు. స్వప్న, అనిల్ కూడా మౌనంగా ఉన్నట్లు, వాళ్ళ మాటలూ లేవు. వీళ్ళకి సడన్‌గా ఏమయింది? అనేది బాలుకి అర్థంకాలేదు.

★ ★ ★

ఆ రాత్రి స్వప్నకి ఎంతసేపటికీ నిద్ర రాలేదు. ఆమెకెందుకో గుండె లోపల ఏదో సుడి తిరుగుతున్నట్లుగా, ఏడుపు తన్నుకొస్తున్నట్లుగా అనిపించింది. కానీ కన్నీళ్ళు మాత్రం రావడం లేదు. లోపలేదో సాలెగూడు లాగా, దిగులులాంటిది అల్లుకుంటూ అనీజీగా అనిపించింది.

రెండు రోజుల్లో కాలేజ్‌టూర్‌కి వెళ్లబోతోంది. పదిరోజులు. అందుకనే డల్‌గా అనిపిస్తోందా? అని ఆలోచించింది.

కాదు! అందుకు కాదు! గతంలో కూడా ఇలాగే టూర్‌కి వెళ్లింది. అప్పుడు రెండు వారాలు. ఇంటినీ, అందరినీ విడిచి హ్యాపీగా ఫ్రెండ్స్‌తో ఎంజాయ్ చేసి వచ్చింది. మరి ఈసారి ఇలా ఎందుకు ఫీల్ అవుతోంది? దేనికో? ఎవరికో? దూరంగా వెళ్తున్నట్లుగా ఎందుకు అనిపిస్తోంది? ఆమెకే అర్థం కావడంలేదు.

అప్పుడామెకి, అంత చీకట్లో, అంత నిర్వే

దంలో హఠాత్తుగా బాలు గుర్తొచ్చాడు. చెంపలమీంచి చిన్నగా జారింది ఒక కన్నీటి చుక్క.

ఈ రోజు, రేపు మాత్రమే తను ఇక్కడ ఉంటుంది. బాలుతో మాట్లాడకుండా, చూడకుండా గడిపితే.. మళ్లీ పదిరోజుల వరకు చూసే పరిస్థితి కూడా లేకుండా టూర్‌కి వెళ్లిపోతుంది తాను.

తనేదో కోపంలో అంటే- అతనికేమయింది? కనీసం వచ్చి మాట్లాడే ప్రయత్నం కూడా చేయలేదు. బాలుకి కూడా నాలా అనిపించడం లేదా? నేను మాట్లాడకుండా, చూడకుండా ఉన్నా తనేమీ ఫీల్ అవకుండా, ఏమీ పట్టనట్లుగా మాములుగానే ఉండగలడా? అనిపించింది స్వప్నకి.

పక్కన మరొక మంచం మీద అనిల్ హాయిగా నిద్రపోతున్నాడు.

ఇక రేపు ఒక్కరోజే మిగిలి ఉంది. ఎలా? ఎలా? బాలుకి, తనకీ మధ్య హఠాత్తుగా పేరుకున్న నిశ్శబ్దాన్ని ఎలా బద్దలు కొట్టాలి?

చప్పున ఒక నిర్ణయానికొచ్చిన స్వప్న - మంచం మీంచి లేచింది. శబ్దం కాకుండా మెయిన్‌డోర్ తెరిచింది. చిన్నగా అడుగు లేస్తూ వరండాలోకి వచ్చిన ఆమెకి అక్కడి దృశ్యం దిగ్భ్రాంతి కలిగించింది.

అక్కడ.. అక్కడ.. వరండామెట్ల మీద, పిల్లర్‌కి ఆనుకుని, సగం వెన్నెల్లో, సగం చీకట్లో.. నేలమీద కూచుని తల పైకెత్తి ఆకాశంలోకి చూస్తోన్న బాలు..!

అతణ్ణి అలా ఆ పొజిషన్‌లో చూడగానే, స్వప్నకి ఒక్కసారిగా ఆనందంతో కూడిన ఉద్వేగంతో తీరని దుఃఖం గుండెలోంచి తన్నుకొచ్చింది.

శబ్దం కాకుండా తలుపు దగ్గరకేసి, చిన్నగా నడుచుకుంటూ బాలు దగ్గరకెళ్ళి పక్కనే నేల మీద కూచుని, అతని భుజం మీద చెయ్యేసింది.

అప్పటిదాకా ట్రాన్స్‌లో ఉన్నట్లుగా కూచున్న బాలు ఉలిక్కిపడి తిరిగి చూస్తే.. పక్కనే స్వప్న కనిపించింది.

సగం వెన్నెల ఆమె జుట్టుమీద మెరుస్తూ, ఆమె కళ్ళలో చిప్పిల్లిన కన్నీటి తెరని మెరుపులా మెరిపిస్తూ.. అప్పటికే ఆమె కనురెప్పల చెలియలికట్ట దాటిన కన్నీటి అల, చెంపల మైదానం మీంచి కిందకి జారుతుంటే.. చప్పున వేలితో తుడిచాడు బాలు.

వెచ్చటి కన్నీటి స్పర్శ! చల్లని ఆమె శరీర స్పర్శ! అవ్యక్తమైన భావం గుండెలో పొంగింది. "స్వప్నా..! స్వప్నా..!! ఎందుకు? ఏమయింది ఇప్పుడు?" ఆర్ద్రంగా అన్నాడు బాలు.

అప్రయత్నంగా అతని భుజం మీద తల వాల్చింది స్వప్న. వెక్కివెక్కి ఏడవడం మొదలుపెట్టింది. ఎగిరిపడే భుజాలు, వీపు.. ఏమీ తాకకుండా, ఓదార్చకుండా, మౌనంగా అలాగే ఉండిపోయాడు బాలు.

అతడి భుజం మీంచి తల పైకెత్తి "నువ్వే!! ఎందుకు మాట్లాడకుండా, కనిపించకుండా ఉన్నావు? నేనేదో కోపంలో అంటే.. అలాగే ఉండిపోతావా? నీకు.. ఏమీ లేదా? కొంచెం కూడా?" బరువుగా మారిన గొంతుతో అడిగింది స్వప్న.

ఆమె అలా చిన్నపిల్లలా అడుగుతుంటే - అప్పటివరకు డల్‌గా ఉన్న బాలుకి రిలీఫ్ కలిగి, నవ్వొచ్చింది.

అతడ్ని కోపంగా చూసింది స్వప్న.

"నవ్వుతావేంటి?" అంది.

"లేదులే! నవ్వడం కాదు! నీలాగ నేను కూడా డల్ ఇంతసేపు! సాయంత్రం నువ్వు లోపలికి వెళ్ళాక అనిల్ వచ్చి ఏదో అడిగితే విసుగ్గా తిట్టాను. వాడు కూడా నాకు కటీఫ్ చెప్పి లోపలికి వెళ్లిపోయాడు. నా మీద నాకే విసుగు, కోపం వచ్చాయి. ఏమీ తినాలనిపించలేదు. రూమ్‌లోకి వెళ్ళి పడుకున్నా. ఎంతకీ నిద్రపట్టక ఇలా వచ్చి

కూర్చున్నా" చెప్పాడు.

అతడికి కొద్దిదూరంలో కూర్చుని, అలాగే చూస్తూ, అతడి మాటలు వింటున్న స్వప్నకి.. బాలు మీద దిగులుతో కూడిన ఇష్టం.. ఒక్కొక్క రేకు విప్పుకుంటూ విక సించే పువ్వులాగా గుండె గదుల్లో అవ్యక్త మైన పరిమళాన్ని వ్యాపింపచేయడం మొదలుపెట్టింది.

"అసలు నీకు అంత కోపం ఎందుకొ చ్చింది చెప్పు? " అడిగాడు బాలు. ఆమెకి - అసలు కోపం ఎందుకొచ్చిందో? ఎప్పుడొ చ్చిందో? గుర్తే లేనంతగా ఆనందంలో మునిగిపోయి ఉంది ఇప్పుడు. ఇక అతనికి ఏమని చెబుతుంది? "

అంతలోనే ఏదో గుర్తొచ్చినట్లుగా "నీకొక లెటర్ ఇచ్చాను గుర్తుందా? అసలు చది వావా? ఇంతవరకు దాంట్లో ఏం రాసుం దో నాకెందుకు చెప్పలేదు? " అడిగింది.

"ఓ..! సారీ స్వప్నా! లోపల మంచం మీద పెట్టి అలాగే నిద్రపోయాను. తర్వాత పొద్దున చూస్తే కనిపించలేదు. కింద పడిందేమో.. రేపు ఉదయాన్నే వెతికి చదివి, చెబుతాను, సరేనా? " సంజా యిషీ ఇస్తున్నట్లుగా అన్నాడు.

మౌనంగా ఉండిపోయింది స్వప్న.

మళ్ళీ "అసలు.. నా గురించి మీ హెడ్‌కి ఎందుకు చెప్పాల్సి వచ్చింది? "

"శిరీషకా? తనే మాట్లాడిన ప్రతిసారీ నీ గురించి అడుగుతోంది. నిన్ను చూడాలి, మాట్లాడాలి అని అడిగింది. చివరికి తప్ప లేదు" అన్నాడు.

"అయినా.. ఆమెతో అంత క్లోజ్ ఫ్రెండ్ షిప్ అవసరమా? " అడిగింది.

"ఆఫీస్‌లో బాస్! ప్రాజెక్ట్ హెడ్! మాట్లా డకుండా ఎలా? " అర్థం కానట్లు అన్నాడు.

"ఏమో? నాకు నచ్చలేదు! ఇంకోసారెప్పు డూ ఆమెని ఇంటికి వచ్చేలా చేయొద్దు!" గట్టిగా చెప్పింది.

# చతుర ప్రవేశిక

## అక్టోబరు చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాసి బహుమతి పొందండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

| | |
|---|---|
| 1. అనిత ప్రేమించింది? | 6. అనిత తమ్ముడు? |
| జ. | జ. |
| 2. స్వప్న స్నేహితురాలు? | 7. స్వప్నను బెదిరించిన క్లాస్‌మేట్? |
| జ. | జ. |
| 3. జానకమ్మ కూతురు? | 8. శిరీష అన్న ఎక్కడుంటాడు? |
| జ. | జ. |
| 4. బాలు బాస్? | 9. బాలు ఎక్కడ పెరిగాడు? |
| జ. | జ. |
| 5. శిరీషను ప్రేమించింది? | 10. 'ఇంద్రధనుస్సు' రచయిత? |
| జ. | జ. |

పంపినవారి పేరు: ------------------------------------------వయసు (   )

చిరునామా: ------------------------------------------------

---------------------------పిన్‌కోడ్ :                ఫోన్ నెం :

**చిరునామా** : సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్ సోమాజీగూడ, హైదరాబాద్- 82

ఫోన్ : 04023318181, **Ex:** 6658, 6532

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

గడువు తేదీ 17

"సరే! ఇక రాదు! కోపం పోయిందా? " అన్నాడు.

"చూద్దాం! రేపు ఆఫీస్ లేదు కదా! అనిల్ బయటకెళ్దాం అంటున్నాడు. అంద రమూ బీచ్‌కి వెళ్దాం, రేపు సాయింత్రం. ఎక్కడికీ వెళ్ళకుండా రూమ్‌లోనే ఉండు! నాన్న కూడా.. కార్‌లో" చెప్పింది స్వప్న.

"అలాగే! చాలా లేటయింది నిద్రపో! గుడ్‌నైట్!" అన్నాడు.

లేచి నిలబడిన స్వప్న "గుడ్‌నైట్!" చెప్పి, ఇంట్లోకి వెళ్ళి తలుపు వేసుకుంది.

తెల్లటి, చల్లటి వెన్నెల.. అక్కడే కూచున్న బాలు మీదంతా పరుచుకుంది. ఇంతకుముందున్న అనీజీ పూర్తిగా తొలగి పోవడంతో వెన్నెల్లో తడుస్తూ ప్రశాంతంగా కూర్చుండి పోయాడు.

అప్పుడు బాలుకి ఇన్నేళ్ల తన జీవితం - అంతా గుర్తొచ్చింది. హాస్టల్లో కళ్ళుతెరిచిన బాల్యం! అక్కడే అనాథగా మొగ్గతొడిగి, మనసు నిండా ఒంటరితనంతో ఎదిగిన జీవితం! పేరెంట్స్ ఎవరో తెలీకుండా, బంధాలు, బాంధవ్యాలు ఎలా ఉంటాయో చూడకుండా - అలా ఏకాకి నావలా జీవన సముద్రంలో పడుతూ.. లేస్తూ.. ఏ గాలి దుమారంలోనో చిక్కుకుని.. ఏదో కొత్తతీరానికి చేరుకుంటే - ఆ తీరంలో ఒక చిన్న కుటుంబం.. అందులో.. స్వప్న అనే అమ్మాయి.. తనంటే ఇష్టం, అనురాగం చూపించే స్వప్న. మరోవైపు - తోడు కోసమో, స్నేహం కోసమో తపిస్తున్నట్లుగా గుండె తలుపులు తడుతున్నట్లుగా.. శిరీష..! ఎటు వెళ్తుందో జీవితం? ఈ తీరంలోనే ఆగిపోతుందా? లేక మళ్ళీ అలల తాకిడికి దిశ మార్చుకుని.. మరో తీరానికి పయనమవుతుందా?

ఆలోచిస్తూ కూచ్చుండిపోయాడు బాలు.

★ ★ ★

'నేరం చేశానని ఒప్పుకున్న ముద్దాయికి ఏడాది జైలుశిక్ష విధిస్తున్నాను' తీర్పు చెప్పిన న్యాయమూర్తి గొంతు అనిత గుండెల్లో ఇంకా మార్మోగుతూనే ఉంది. ప్రొబేషన్ ఆఫ్ అఫెండర్స్ చట్టం కింద అనితకి విధించిన సంవత్సరం జైలుశిక్షలో భాగంగా ఆమెని జైలులో బంధించడం జరగదు. ఎప్పటిలాగ, ఆమె తన ఇంట్లోనే, జీవితంలో ఏ మార్పు లేకుండా గడిపే యొచ్చు. ముద్దాయి మానసిక పరిస్థితిని, శారీరక స్థితిని పరిగణలోకి తీసుకుని ఏడాదిపాటు సత్ప్రవర్తనతో, మళ్లీ అలాంటి నేరం చేయకుండా ఉండేలా జిల్లాస్థాయి అధికారి పర్యవేక్షణలో, పరిశీలనలో యథాతథంగా దైనందిన జీవితం గడిపేయొచ్చు.

ప్రేమజంట ఆత్మహత్య చేసుకోవడం అనేది అత్యంత సున్నితమైన, అతి విషాదకరమైన ఘటన. అయితే ప్రేమికుడు చనిపోయి, ప్రియురాలు మాత్రం చావుబతుకులతో పోరాడి స్వరపేటిక పూర్తిగా దెబ్బతిని - జీవితాంతం మూగదిగా మిగిలిపోతే.. అనుక్షణం చనిపోయిన ప్రియుడి జ్ఞాపకాలతో బతకాల్సి వస్తే - ఇంతకన్నా పెద్దశిక్ష ఏ చట్టంలో ఉంటుంది?

కోర్టు నుంచి - అన్ని ఫార్మాలిటీస్ పూర్తి చేసుకున్నాక ఇంటికి చేరుకున్నారు అనితా, శ్రీకాంత్‌లు.

అక్కని మాట్లాడించేందుకు ప్రయత్నించకుండా మౌనంగా ఉండిపోయాడు శ్రీకాంత్. ఆమె కూడా అంతకు ముందు కన్నా కుంగిపోయినట్లు కనిపించలేదు.

ఇంటికి చేరుకున్నాక రాత్రి పడుకునే ముందు టీవీ చూస్తూ, పలక మీద రాసిన మాటలు తమ్ముడికి చూపింది.

"ప్రేమికులు కేవలం ప్రేమకోసం బతకాలి! ప్రేమని బతికించుకోవాలి! అంతే కానీ.. ఆ ప్రేమతో, ప్రేమ వల్ల చనిపోకూడదు!" ఇలా రాసిన అక్షరాల్ని ఆసాంతం చదివాడు శ్రీకాంత్.

అంతా చదివాక అతడి కళ్ళు చెమ్మగిల్లాయి. అక్క చేతిని ఓదార్పుగా నొక్కాడు.

ఎన్నిరోజుల తర్వాత.. ఆ క్షణంలో అనిత పెదవుల చివర చిరునవ్వు మొలకెత్తడం.. ఆమె కళ్ళు ప్రకాశంగా మెరవడం గమనించాడు శ్రీకాంత్. అప్పుడు అతనికి - అక్క ఆశయం, ఆలోచన ఫలించాలని, ప్రేమ విఫలమైన ప్రేమజంటలు అర్ధాంతరంగా తమ జీవితాన్ని అంతం చేసుకోకుండా ఆపగలిగే శక్తి కలగాలని బలంగా అనిపించింది.

కాసేపటి తర్వాత శ్రీకాంత్ నిద్రలోకి జారుకున్నాక రైటింగ్ టేబుల్ ముందు కూర్చుని మరొక ఉత్తరం రాయడం మొదలు పెట్టింది.

'హాయ్! ఎలా ఉన్నావ్? నన్ను చూడాలని నీకెందుకంత ఆశ? ఉత్తరం, ఫొటోలు ఇచ్చింది నేనని రూమ్‌కి వెళ్లాక తెలిసిందన్నావు. నిజంగా - నిన్ను మోసం చేసినందుకు నన్ను నేను తిట్టుకున్నాను.

ప్రేమించడానికీ, ఎదుటివాళ్ళ ప్రేమని నమ్మడానికీ చాలా అమాయకత్వం ఉండాలి. ఇప్పటివరకూ నేను అలా అంత అమాయకంగా, గాఢంగా ఎవరినైనా ప్రేమించానా? అని నన్ను నేను ప్రశ్నించుకుంటున్నాను. ఒకవేళ నేను ఎవరినైనా ప్రేమిస్తే - అతను నన్ను తప్ప మరెవరినీ తల్చుకోకూడదు. మరెవరికీ తన హృదయంలో, ఆలోచనల్లో స్థానం ఇవ్వకూడదు. అందుకేనేమో నేనింతవరకు ఎవరినీ గాఢంగా ప్రేమించలేదు. ఒక్క మా అమ్మని తప్ప! ఆమె ఈలోకం నుంచి వెళ్ళిపోయాక తన విలువ తెలిసింది. అందరూ అంతేనేమో? అసలు మనం మరొకరిని ఎందుకు ఇష్టపడతాం? ఎందుకు ప్రేమిస్తాం? ఎప్పటికీ ఆ వ్యక్తి మనతోనే ఉండాలని కోరుకోవడం, అతని కోసం అందరినీ వదులుకోవడానికి కూడా

సిద్ధపడడం.. మనలోని పొసెసివ్‌నెస్, స్వార్థానికి నిదర్శనం కాదా? అందరూ ఒప్పుకోకపోతే- అదే వ్యక్తితో జీవితం దొర కదనే నిరాశ కలిగితే - ఇక జీవించడానికి ఏమీ లేకుండా పోవడం ఎంతవరకు కరెక్ట్? ప్రేమ.. మనల్ని బతికించాలి. ప్రేమ.. మన హృదయాల్లో ఎప్పటికీ అలాగే ఉండిపోవాలి. ప్రేమని ప్రాణంలా కాపాడుకోవాలి. అంతేకదూ! అందుకే నీకు త్వరలో కనిపిస్తాను. అప్పటి వరకూ ఉత్తరాలతో, మెసేజ్‌లతో మాట్లాడుతుంటాను.

నీ- నేను"

రాయడం పూర్తయ్యాక కాగితాన్ని జాగ్రత్తగా మడతలు పెట్టింది అనిత. తర్వాత అక్కడే ఉన్న ఈజీఛైర్‌లో వెనక్కి వాలి అలాగే నిద్రపోయింది. ఎప్పుడో తెల్లారు జామున అయిదు గంటలకి అలారం మోగడంతో మేలుకుంది. కాసేపటికి శ్రీకాంత్ కూడా నిద్రలేచి కాలేజ్‌కి వెళ్ళడానికి రెడీ అవసాగాడు. ఈజీఛైర్‌లోనే కూచున్న అనిత అలాగే ఏ శక్తీ లేనట్లుగా ఉండిపోయింది.

తన పని ముగించుకుని వెళ్ళబోతూ రైటింగ్ టేబుల్ దగ్గరకి వచ్చి చూసిన శ్రీకాంత్‌కి- అక్కడ మడతపెట్టిన కాగితం కనిపించింది. అలవాటుగా దాన్ని తీసుకుని అనితవైపు చూశాడు. "రాయడం అయిందా అక్కా? " అని అడిగాడు

ఆమె చిన్నగా నవ్వి తలూపింది.

ఆ ఉత్తరాన్ని, ఆ టేబుల్ మీదున్న కాలేజ్ లైబ్రరీ నుంచి తెచ్చిన రిఫరెన్స్ బుక్‌లో పెట్టి, దాన్ని తన బ్యాగ్‌లో పెట్టుకొని కాలేజీకి బయలుదేరాడు.

★ ★ ★

ఆ రోజు ఆదివారం కావడంతో కాలేజీలు, స్కూళ్లు, ఆఫీసులకు సెలవు. అందరూ ఇంట్లోనే ఉండిపోయారు.

రంగనాథ్ రమ్మని పిలిస్తే బైక్‌మీద మార్కెట్‌కి వెళ్లి వచ్చాడు బాలు. తర్వాత జానకమ్మ టిఫిన్ ఇస్తే తింటూ దూరంగా కూచుని ఉన్న అనిల్‌ని పిలిచాడు. అప్పటికింకా కోపం తగ్గని అనిల్ - పలకకుండా మౌనంగా ఉండిపోయాడు.

"ఈ రోజు సాయంత్రం బీచ్‌కి వెళ్తున్నాం. కోపం పోయిందా? " అని అడిగాడు బాలు.

అయినా అలాగే మాట్లాడకుండా వేరే వైపు తిరిగాడు అనిల్.

అక్కడే ఉన్న స్వప్న "మరీ ఓవర్ చేయకురా! రేపటి నుండి నేనుండను. మీరిద్దరే ఉంటారు. మాట్లాడకుండా మూతి ముడుచుకునే ఉంటారా? " వెక్కిరించింది.

"అక్క నన్ను కసురుకుంది. అయినా మళ్లీ మాట్లాడుకుంటున్నాం కదా! ప్లీజ్ అనిల్! సారీ!" బతిమాలుతున్నట్లుగా అన్నాడు బాలు.

'అవునా!' అన్నట్లు స్వప్నవైపు చూసి, తలెగరేశాడు అనిల్.

"సరే! ఈసారికి క్షమించాను. ఇంకోసారి అలా తిడితే.. ఇక అంతే!" చెప్పాడు.

కాసేపు గడిచాక, తన రూమ్‌లో మంచం కింద, మూలమూలలా వెతికాడు బాలు. స్వప్న ఇచ్చిన లెటర్ దొరకలేదు.

అప్పుడే గదిలోకి వచ్చిన స్వప్నతో "కనిపించలేదు నువ్విచ్చిన లెటర్. నిదానంగా వెతుకుతాను" అన్నాడు.

"నేను టూర్ నుంచి వచ్చేసరికి నీ దగ్గరుండాలి. నువ్వు చదివి ఏముందో చెప్పాలి. సాయంత్రం రెడీగా ఉండు! నాన్నతో కూడా చెప్పాను. బీచ్‌కి వెళ్తున్నాం. నేను సామాను సర్దుకోవాలి! సరేనా? " అంది స్వప్న.

"సరే!" అంటూ ఆమె కళ్ళలోకి అలాగే చూశాడు బాలు.

స్వప్న కూడా అలాగే చూసింది.

కళ్లు మాట్లాడుతాయి అంటే.. వాళ్ళిద్దరూ అంతకుముందు అంతగా నమ్మే వాళ్లు కాదు. అయితే ఎలా మాట్లాడుకుం

అ
క్ష
రం

ఎవరైనా మనకిచ్చేది
తాత్కాలికమైనది
కృషితో మనం సంపాదించుకొనేది
శాశ్వతమైనది

– మహాత్మాగాంధీ



టాయో ఇప్పుడు వాళ్ళిద్దరికీ తెలుస్తోంది.

చూపులు తిప్పుకుని, ఆ గదిలోంచి బయటకి నడిచింది స్వప్న.

సరిగ్గా అప్పుడే శిరీష నుండి కాల్!

"బాలు! గుడ్‌మార్నింగ్! ఏం చేస్తున్నారు? " అడిగింది అటువైపు నుంచి.

"గుడ్‌మార్నింగ్! ఏమీ చేయడం లేదు"

"సాయంత్రం ప్రోగ్రాం గుర్తుందిగా! బీచ్‌లో ఫామ్‌హౌస్‌లో పార్టీ" అంది.

సాయంత్రమే స్వప్నవాళ్లతో బీచ్‌కి వెళ్ళాల్సిన సంగతి గుర్తొచ్చింది బాలుకి.

"అదే..! ఎలాగా? అని ఆలోచిస్తున్నా మా ఇంటి ఓనర్ ఫ్యామిలీ అందరూ సాయంత్రం బీచ్ ప్రోగ్రాం పెట్టారు. మీరు నేరుగా ఫామ్ హౌస్‌కి వెళ్లిపోండి! వీళ్ళు ఇంటికి బయల్దేరాక నేను మీ దగ్గరకొచ్చి కలుస్తాను! సరేనా? అన్నాడు.

బరువుగా ఊపిరి పీల్చి వదిలినట్టుగా శబ్దం..! తర్వాత "సరే! బై!" చెప్పి కాల్ కట్‌చేసింది శిరీష.

సాయంత్రం వరకూ స్వప్న బిజీగా గడిపింది. ఫ్రెండ్స్ నుంచి వస్తున్న ఫోన్ కాల్స్, లగేజి సర్దుకుంటూ మధ్యమధ్యలో బాలుతో మాట్లాడుతూ.. ఏదో తెలీని టెన్షన్‌తో, ఉద్వేగంతో గడిపింది.

ఎండ తగ్గాక బీచ్‌కి చేరుకున్నారంతా.

స్వప్న, అనిల్ అందరూ సముద్రపు అలల్లో స్నానం చేస్తూ కేరింతలు కొడుతూంటే బాలు ఒడ్డునే ఉండిపోయాడు.

అలల మీద అల్లరి చేస్తున్న స్వప్న మధ్యలో బాలుని చేత్తో రమ్మని పిలిచింది. అలా చాలాసార్లు పిలిచినా బాలు కదలకుండా ఇసుకలోనే కూర్చుండిపోయాడు.

స్నానం చేసి వచ్చిన రంగనాథ్ "ఏమయ్యా! బాలు! వాళ్ళు పిలుస్తున్నా రాకుండా ఇక్కడే ఉండిపోయావేంటి? " అన్నాడు, టవల్‌తో తల తుడుచుకుంటూ.

"నాకు సముద్రమంటే భయం! నీళ్లలోకి దిగాలంటే కాళ్ళు వణుకుతాయి, అందుకే వెళ్ళలే" అన్నాడు.

సముద్రం.. మెరిసే తడి ఇసుక - అలల మధ్య కేరింతలు కొడుతున్న స్వప్న..! అలా చూస్తూ ఉండిపోయాడు బాలు. పదిరోజుల వరకూ కనిపించకుండా, చాలాదూరం వెళ్తున్న స్వప్నని తన మనసు పొరల్లో దాచుకుంటున్నాడు.

చీకటి.. తారలు క్రమంగా పరుచుకోవడం మొదలుపెట్టగానే "ఇక చాలు! వచ్చేయండి!" అంటూ రంగనాథ్ దూరంగా పార్క్‌చేసిన కారువైపు నడిచాడు.

బాలు నడుస్తూ "ఎంత పిల్చినా రావేంటి? ఇక్కడ కూచుంటేనే హ్యాపీగా ఉందా? అలల మధ్య నువ్వు కూడా పక్క నుంటే ఎంత బాగుండేదో? " అంది స్వప్న.

"నాకు సముద్రమంటే ఇష్టమే! కానీ, నీళ్ళలోకి దిగడమంటే భయం!" అన్నాడు.

"ఛా! అయినే నేను పక్కనే ఉంటాగా! నీకు ఏమీకాకుండా జాగ్రత్తగా చూసుకుంటా కదా!" అంది అప్రయత్నంగా.

ఆమె అన్న మాటలు కొన్ని వేల అర్థాలు స్ఫురించినట్టయ్యాయి.

ఏం చెబుతాడతను? పరిచయం స్నేహంగా, స్నేహం దగ్గరితనంగా, ఇష్టంగా.. ఇష్టం ప్రేమగా మారుతోందా?

తను.. స్వప్న.. ఒకరినొకరు ఇష్టపడుతున్నామా? అంతకన్నా ఎక్కువగా ఫీల్ అవుతున్నామా? - ఇలా ఆలోచిస్తున్న బాలుకి చాలా సిల్లీగా అనిపించింది.

'కాదు.. కాదు స్నేహాన్ని.. ఇష్టంగా భావించకూడదు. అక్కడే ఆగిపోవాలి!' అని తనకి తానే చెప్పుకున్నాడు.

అందరూ కారెక్కుతుంటే పక్కనే పార్క్ చేసిన బైక్ తీస్తూ "అనిల్! నువ్వు కూడా వాళ్ళతో వెళ్ళు! నాకు కొంచెం పని ఉంది క్కడ. జస్ట్ పావుగంట! ఒకరిని కలిసి వచ్చేస్తాను" చెప్పాడు బాలు.

దాంతో అనిల్ కూడా అందరితోపాటు కారెక్కాడు.

వెనక సీట్లో కూర్చున్న స్వప్న "ఎందుకు ఆగుతున్నావ్? త్వరగా వచ్చేయ్! రేపు మార్నింగ్ ఆరుగంటలకే నా ట్రైన్ గుర్తుందిగా? " అంది.

తలూపి, నవ్వి.. చెయ్యి ఊపాడు బాలు. కారు కదిలి వెళ్లిపోయింది.

తర్వాత బీచ్‌రిసార్ట్ పక్కనే ఉన్న ప్రైవేట్ ఫామ్‌హౌస్ వైపు తన బైక్‌ని పోనిచ్చాడు బాలు.

గేటులో సెక్యూరిటీ గార్డ్ ఆపడంతో 'శిరీష' పేరే చెప్పాడు. గార్డ్ లోపలున్న మరొకరితో మాట్లాడి లోపలికి వదిలాడు.

ఫామ్‌హౌస్‌లోని గెస్ట్‌హౌస్ ముందున్న విశాలమైన ఆవరణలో టేబుళ్లు, లైట్లు, మధ్యలో డయాస్! ఎవరో మ్యూజిక్ బ్యాండ్. గ్లాసుల గలగల. రకరకాల డిషెస్, డ్రింక్స్ సర్వ్‌చేస్తూ.. వీకెండ్ పార్టీ! మ్యూజిక్ డ్రమ్స్‌కి అనుగుణంగా ఇద్దరు సింగర్లు పాటలు పాడుతున్నారు.

ఆ గందరగోళంలో శిరీష కోసం వెతికాడు బాలు. ఒక చివర టేబుల్ ముందు మరో ఇద్దరు ఫ్రెండ్స్‌తో కూచున్న ఆమె కనిపించింది.

దూరం నుంచే బాలుని చూసిన శిరీష అక్కడ నుంచే రమ్మన్నట్లుగా చెయ్యెత్తి ఊపి పిలిచింది. వెళ్లి ఆమె దగ్గర కూర్చున్నాడు బాలు. ఫ్రెండ్స్‌ని అతనికి పరిచయం చేసింది శిరీష.

ఇంతలో బేరర్ డ్రింక్స్ గ్లాసుల ట్రేతో దగ్గరికి వచ్చాడు. తనకి అలవాటు లేదని తప్పించుకున్న బాలు ఫ్రూట్ జ్యూస్ మాత్రం తీసుకున్నాడు.

అప్పటిదాకా ప్రశాంతంగా ఉన్న పార్టీలో సందడి మొదలయింది. మత్తు తలకెక్కిన వాళ్ళు పాటలకి తగినట్టుగా డ్యాన్స్ మొదలుపెట్టారు. అంతసేపు శిరీష టేబుల్ దగ్గరున్న ఫ్రెండ్స్ వేరేచోటుకి వెళ్ళడంతో బాలు, శిరీష మాత్రమే మిగిలారు.

సడన్‌గా లేచి నిలబడిన శిరీష - బాలు చేయి పట్టుకుని డయాస్‌వైపు తీసుకెళ్ళింది. బాలుకి జరిగింది అర్థమయ్యేసరికి అక్కడే ఉన్న సింగర్ దగ్గరి మైక్ అందుకున్న శిరీష "లేడీస్ అండ్ జెంటిల్మెన్! మీట్ మిస్టర్ బాలు! మై ఫ్రెండ్ అండ్ సింగర్! ఈ రోజు మన కోసం ముఖ్యంగా నా కోసం ఈ పార్టీలో బాలు మంచి పాట పాడడానికి ఒప్పుకున్నాడు" అంటూ అనౌన్స్ చేసింది.

బాలు ఆమె మాటలకి షాక్ అయ్యాడు. అతడికి ఆలోచించడానికి కూడా టైమ్ ఇవ్వకుండా మైక్‌ని చేతికిచ్చి, "ప్లీజ్ బాలు! నీ టాలెంట్ ఏంటో వీళ్ళందరికీ తెలియాలి! వీళ్లకి పార్టీలో తినడం, తాగడం మాత్రమే వచ్చు. నీలాగ అద్భుతంగా పాడే టాలెంట్ లేదు.. ప్లీజ్ బాలు!" అంటూ చేతులు పట్టుకుని ప్రాధేయపడింది.

అప్పటికే కాక్‌టెయిల్ మోతాదుకి మించి తీసుకున్నట్లుగా కనిపిస్తున్న శిరీష, తన మాట వినే స్థితిలో లేదని బాలుకి అర్థమయింది.

కొన్నిక్షణాలు అలాగే మౌనంగా ఉండి తర్వాత గొంతు సవరించుకుని, పాట పాడడం మొదలుపెట్టాడు. హిందీ, ఇంగ్లీష్, మధ్యలో తెలుగు ఫాస్ట్‌నెంబర్..

అక్షరం

కెరటాలు
కాళ్ల దగ్గరకు వచ్చాయని
సముద్రాన్ని చులకన చేయడం ఎంత తప్పో
మంచితనాన్ని తక్కువగా అంచనా వేయడం
అంతే తప్పు

– జార్జి బెర్నార్డ్ షా



ఇలా ఒకటి తర్వాత ఒకటి- అందరూ కేరింతలు కొడుతూ డ్యాన్స్ చేసేలా పాటలు పాడాడు బాలు.

మధ్య గ్యాప్‌లో బాలు దగ్గరకి వచ్చిన శిరీష, చప్పున అతడి చెయ్యి పట్టుకుని "పద! ఇక వెళ్లిపోదాం! నన్ను ఇంటిదగ్గర డ్రాప్‌చేయాలి! బైక్ ఉందిగా!" అంది. మాటలు ముద్దగా తడబడుతున్నాయి.

"కార్లో రాలేదా? " అడిగాడు.

"ఎలాగో ఒకలాగా వచ్చాలే! ఇప్పుడు నీ బైక్ మీద తీసుకెళ్ళు!" ఎప్పుడు ఏకవచనం లోకి వచ్చిందో కూడా తెలీనట్లుగా అంటు న్న శిరీషని ఇబ్బందిగా చూశాడు బాలు.

"పద..! బాగా లేటయింది!" అంటూ అతడి చెయ్యి పట్టుకుని గుంపులోంచి బయటకి లాక్కొచ్చింది. బైక్ దగ్గరికి వెళ్ళి స్టార్ట్‌చేశాక.. జీన్స్ ప్యాంట్, షర్ట్ వేసుకున్న శిరీష, బైక్‌మీద అటుఇటు కాళ్ళేసి వెనక కూర్చుంది. బాలు భుజాలపై చేతులు వేసి, గట్టిగా పట్టుకుంది.

బైక్‌ని ముందుకి పోనిచ్చాడు బాలు.

ఫామ్‌హౌస్ నుంచి బయటకొచ్చాక టౌన్‌కి వెళ్లే రోడ్! అడవి, మైదానం దాటు కుని ముందుకి వెళ్తుండగా "స్వప్న.. స్వప్న.. ఏమంటోంది బాలు..? " ముద్ద ముద్దగా అడిగింది శిరీష.

"బాగానే వుంది! ఏమనలేదు" అన్నాడు.

"బాగానే వుంది కాదు. తను చాలా అందంగా ఉంటుంది. తన పేరు స్వప్న! బట్ నా స్వప్న.. నాకు తెలిసిన స్వప్న.. నల్లపిల్ల! ఈ స్వప్న.. నా ఫ్రెండ్ బాలుకి ఫ్రెండ్ అయిన స్వప్న.. మాత్రం మోస్ట్ బ్యూటిఫుల్‌గా ఉంటుంది..!" వెనక నుంచి అంటోంది శిరీష.

జాగ్రత్తగా డ్రైవ్ చేస్తున్నాడు బాలు.

నల్లత్రాచులాగా మెలికలు తిరిగిన తారు రోడ్డుకి ఇరువైపులా రకరకాల చెట్లతో అడవి.. తెల్లటి వెన్నెల.. చల్లగాలి.

"బాలు! నువ్వు.. స్వప్న.. నేను.." అంటూ చిన్నగా అంటూ భుజాలు మీద వేసిన చేతుల్ని కిందికి జార్చి.. బాలు ముందువైపు ఒకచేతిని ఛాతీమీద, రెండో చేతిని పొట్టమీద చుట్టేసి, జలపాతంలా జారిపోతుంటే, ఆసరాగా దొరికిన ఏ కొమ్మనో, శిలనో పట్టుకున్నట్లుగా.. చేతులతో గట్టిగా పెనవేసింది శిరీష.

అప్పుడామె సగం స్వప్నంలో, సగం మెలకువలో ఉందేమో?

అయితే బాలులో మాత్రం ఏ ఫీలింగూ కలగలేదు. తనని చుట్టేసి, గాఢంగా హత్తు కున్న శిరీష.. ఒక స్త్రీ అనే భావన కలగ లేదు. ఆమెనెంత జాగ్రత్తగా అపార్ట్‌మెంట్ లోని ఫ్లాట్‌కి చేర్చాలా అనే ఒక్క ఆలోచనే తప్ప మరేమీ అతని మనసులో లేదు.

కాసేపటికి అపార్ట్‌మెంట్‌కి చేరుకు న్నారు. బైక్ దిగనంటూ పేచీ పెడుతున్న శిరీషని బుజ్జగించి లిఫ్ట్‌లోకి నడిపించాడు. టాప్ ఫ్లోర్‌లోకి వెళ్ళాక, ఆమె హ్యాండ్ బ్యాగ్‌లోంచి కీస్ తీసుకుని డోర్ తెరచి, ఆమెని జాగ్రత్తగా నడిపించుకుంటూ లోప లికి తీసుకెళ్ళాడు.

భుజాల మీద వాలిపోతున్న ఆమెని, సోఫాలో పడుకోబెట్టి, ఎదురుగా ఉన్న సింగిల్‌సోఫాలో కూర్చున్నాడు బాలు.

టైమ్ చూస్తే పన్నెండు దాటింది. శిరీష ఈ లోకంలో, స్పృహలో లేదు. ఇప్పుడు తనేం చేయాలి? ఇలా ఎంతసేపు ఎదురు చూడాలి? ఇలాంటి స్థితిలో వదిలేసి ఎలా వెళ్లాలి? అనేది బాలుకి అర్థంకాలేదు.

సరిగ్గా అప్పుడు స్వప్న గుర్తొచ్చింది. రేపు ఉదయం టూర్‌కి బయల్దేరుతోంది స్వప్న. బీచ్‌లో కారెక్కి వెళ్తూ, త్వరగా ఇంటికి రమ్మని చెప్పింది. కానీ తనేమో ఇలా చిక్కుకుపోయాడు. ఏం చేయాలో తెలియడంలేదు. శిరీష మేలుకునేవరకు ఎదురుచూద్దాం! అనుకుంటూ సోఫాలో కూలబడిపోయాడు.

★ ★ ★

అర్ధరాత్రి దాటింది. ఇంతవరకూ బాలు ఇంటికి రాకపోవడంతో స్వప్నకి ఆందోళనగా అనిపించింది. ఎన్నిసార్లు కాల్ చేసినా బాలు ఫోన్ నాట్ రీచ్‌బుల్ అనే వస్తోంది. ఒకవేళ వచ్చి నిద్రపోతున్నాడా? లేచి మెయిన్‌డోర్ తీస్తుండగా - ఇంకా నిద్రపట్టని రంగనాథ్ హాల్లోకి వచ్చాడు.

"ఏమ్మా! నిద్రపోలేదా? రేపు త్వరగా లేవాలి స్టేషన్‌కి వెళ్లాలి కదా!" అన్నాడు.

"అవును నాన్నా! బాలు ఇంకా రాలేదేంటా? అని చూస్తున్నాను" అంది.

"నీకు చెప్పడం మర్చిపోయాను, ఇందాక ఫోన్ చేశాడమ్మా! బీచ్ దగ్గర్లో ఏదో ఫామ్ హౌస్‌లో వాళ్ళ కొలీగ్స్ పార్టీ పెట్టుకున్నారట! బాలుని మధ్యలో ఆపి తమతో తీసుకెళ్ళారట! నీకు ఫోన్ చేస్తుంటే కాల్ కలవడం లేదని నాకు ఫోన్ చేశాడు. పార్టీ అవగానే వెంటనే వచ్చేస్తానన్నాడు" చెప్పాడు రంగనాథ్.

ఒక్కసారిగా నిరాశగా, చిరాకుగా అనిపించింది స్వప్నకి. ఛీ! ఎందుకిలా చేశాడు? బాలు మీద కోపం పెరిగిపోయింది. విసురుగా మంచం ఎక్కింది.

ఒకవేళ రేపు పొద్దుట ట్రైన్ ఎక్కేలోపల బాలుని కలవలేకపోతే? అతడ్ని చూడకపోతే? మళ్ళీ ఏ పదిరోజులకో కానీ చూడలేను. అన్నిరోజులు ఎలా? చివరిసారి ఈ కళ్లతో చూస్తే.. ఆ రూపాన్ని గుండెలో, మనసులో, ఆలోచనల్లో దాచుకుని, వీలయినప్పుడల్లా మాట్లాడుతూ- ప్రత్యక్షంగా చూస్తున్న ఫీల్ కలుగుతుంది కానీ.. ఇప్పుడు ఈ బాలు ఎప్పుడొస్తాడు? తన మనసులో సుడులు తిరిగే ఆలోచనలు గందరగోళంగా మారడాన్ని తిట్టుకుంటూ మగత నిద్రలోకి జారుకుంది స్వప్న.

అప్పుడామెకి ఏదో కల వచ్చింది. ఆ కలలో.. బాలూ, తను సముద్రపు అలల మధ్య నిలబడి ఉన్నారు. ఒక్కొక్క అల విసురుగా ఇద్దరినీ తాకి, తీరంలో పరుచుకుని, మళ్లీ వేగంగా వెనక్కి వెళ్లిపోతుంటే.. కాళ్లకింది ఇసుకని వేగంగా లాగేసుకుంటూ ఇసుకలో ఇద్దరి కాళ్లూ కూరుకుపోతూ, సముద్రంలోకి లాగేస్తున్న అలలతో తాము కూడా లోపలికి.. లోతుల్లోకి వెళ్లిపోతున్నట్లుగా.. గుండె గొంతులో ఉద్వేగంతో కొట్టుకుంటున్నట్లుగా.. ఊపిరి అందనట్లుగా..

★ ★ ★

మెలకువ వచ్చి కళ్లు తెరిచాడు బాలు.

ఒక్కక్షణం తనెక్కడుందీ అర్థంకాలేదు. సింగిల్ సోఫాలో మెత్తగా కూరుకుపోయిన తన చుట్టూ చూసుకున్నాక.. అప్పుడు అర్థమైంది.. తాను శిరీష ఫ్లాట్‌లో ఉన్నానని.

ఎదురుగా డబుల్ సోఫాలో కూర్చుని తననే చూస్తోంది శిరీష.

చప్పున లేచి నిలబడ్డాడు బాలు.

"గుడ్ మాణింగ్ బాలూ!" నవ్వుతూ చెప్పింది శిరీష.

"గుడ్ మార్నింగ్! ఎలా ఉన్నారు? " అడిగాడు.

"సారీ! మిమ్మల్ని రాత్రి బాగా ఇబ్బంది పెట్టాను. సో.. సారీ!" అంది.

"ఫర్వాలేదు. ఎంతసేపయింది లేచి? నన్ను లేపలేదేం? " అడిగాడు కంగారుగా.

"అరగంట దాటింది. మంచి నిద్రలో ఉన్నారు. లేపాలనిపించలేదు" అంది.

టైమ్ చూసుకున్నాడు. ఆరు గంటలు కావడానికి ఎంతో సమయం లేదు. అంటే.. అంటే.. తెల్లారిపోయింది. స్వప్న! స్వప్న టూర్‌కి వెళ్లేది ఈరోజే..!

"ఓకే! శిరీషగారు! వెళ్తాను" అన్నాడు.

"ఫ్రెషప్ అవండి బాలు..! కాఫీ అయినా.." అంటుండగా..

"లేదు, అర్జంట్‌గా రైల్వేస్టేషన్‌కి వెళ్లాలి" అంటూ స్వప్న నెంబర్‌కి కాల్‌చేశాడు.

కాల్ కనెక్ట్ అయి, రెండుసార్లు రింగ్ అవగానే- అటువైపు నుంచి స్వప్న కాల్ రిజెక్ట్ చేసింది. మళ్లీ వెంటనే చేశాడు. మళ్లీ అదే పరిస్థితి.

"బై శిరీషా! ఆఫీస్‌లో కలుస్తాను" అంటూ హడావుడిగా బయటికి నడిచాడు బాలు.

★ ★ ★

రైల్వేస్టేషన్‌కి చేరుకుని, తమ కంపార్ట్‌మెంట్ దగ్గరకెళ్లారు స్వప్న, రంగనాథ్.

అప్పటికే లగేజ్ అంతా లోపల పెట్టిస్తున్న స్వప్న క్లాస్‌మేట్స్- ఆమెని చూడగానే "ఇంత లేట్‌గానా వచ్చేది? - అయిదు నిమిషాలే టైం, స్టార్ట్ అవడానికి" అంటూ స్వప్న బ్యాగ్‌ని లోపల పెట్టించారు.

కాలేజ్ ప్రొఫెసర్లతో రంగనాథ్ మాట్లాడుతుంటే స్వప్న డల్‌గా ప్లాట్‌ఫామ్ మీద నిలబడిపోయింది.

అప్పుడామె ఫోన్‌కి బాలు కాల్ వచ్చింది. ఆమెలో అసహనం, ఉక్రోషం పెరిగిపోయాయి. కాల్‌ని రిజెక్ట్ చేసింది. రాత్రంతా పార్టీలో మునిగిపోయిన బాలు మీద కోపం. తను ఈ రోజు వెళ్తున్నానని తెలిసి కూడా పార్టీ అవగానే ఇంటికి రాకుండా.. ట్రైన్ బయల్దేరబోతుండగా ఇలా ఫోన్ చేస్తున్న బాలు మీద కోపం పెరిగిపోయింది.

తనంటే ఇంత నిర్లక్ష్యమా అతనికి? నేనెంత ఫీల్ అవుతున్నానో అందులో పదోవంతయినా ఫీలింగ్ లేదా అతనికి?

ఇలా ఆలోచిస్తున్న స్వప్నకి ఎందుకో ఒక్కసారిగా దిగులు కలిగింది. అంతలోనే ఉక్రోషం కూడా! ఇంతలో మళ్లీ బాలు నుంచి కాల్!

"ఏయ్! పద..! సిగ్నల్ ఇచ్చారు..!" హిమజ వచ్చి చెయ్యి పట్టుకుని లాగింది.

ప్లాట్‌ఫామ్ మీద నిలబడి ఉన్న రంగనాథ్‌కి టాటా చెప్పి ట్రైన్ ఎక్కింది స్వప్న.

కదిలిన ట్రైన్.. డోర్‌లోనే నిలబడి చూస్తుంటే, ప్లాట్‌ఫామ్ మీద జనం.. ఎవరో? ఎవరెవరో..? సెండాఫ్ ఇవ్వడానికో? మరెందుకో? వీళ్లలో.. అంతమందిలో.. తను ఎదురుచూసే వ్యక్తి మాత్రం లేడు. తనకి అతనంటే ఉన్న ఇష్టం.. అతనికి నా మీద లేదు. ఇలా అనిపిస్తుంటే ఆమె కళ్లలో సన్నటి కన్నీటితెర..!

ట్రైన్ కదిలింది. ప్లాట్‌ఫామ్ మీద చెయ్యి ఊపుతూ నాన్న, ఇంకా ఎందరో..

అప్రయత్నంగా చెయ్యి పైకెత్తి ఊపింది స్వప్న. ఆమెకి ఆ క్షణంలో ఏదో విలువైనది పోగొట్టుకుని, ఎక్కడికో దూరంగా వెళ్లిపోతున్నా అనిపించింది. అందరితో పాటు కదిలి యాంత్రికంగా లోపలికి వెళ్లి తన సీట్‌లో, కిటికీ పక్కన కూర్చుని బయటికి చూడసాగింది.

సరిగ్గా అదే సమయంలో - శిరీష అపార్ట్‌మెంట్‌లోంచి బయటపడిన బాలు- బైక్‌ని వేగంగా డ్రైవ్ చేసుకుంటూ రైల్వేస్టేషన్ వైపు వస్తున్నాడు.

ట్రైన్ బయల్దేరిన పావుగంటకి ఆ టౌన్‌లోని మరో మెయిన్ స్టేషన్‌లో ఆగింది.

రెండు నిమిషాలు ఆగిన ట్రైన్ మళ్లీ అక్కడ నుంచి కదిలింది.

చిన్నగా కదులుతున్న ట్రైన్.. యథాలాపంగా కిటికీలోంచి ప్లాట్‌ఫామ్ మీదికి

చూసింది స్వప్న.

ఎంట్రెన్స్ గేటు దగ్గర అందరినీ తప్పించుకుంటూ పరిగెత్తుకొస్తున్నాడో వ్యక్తి!

సరిగ్గా చూస్తే.. అది.. బాలు!!

జుట్టంతా చెదిరిపోయి.. ప్లాట్‌ఫామ్ మీద అన్ని కంపార్ట్‌మెంట్లు వెతుకుతూ.. కిటికీ పక్కన స్వప్నని చూడగానే.. పరిగెడుతూ దగ్గరకొచ్చాడు.

బాలుని అలా చూడగానే స్వప్న కూడా ఉద్వేగభరితమై.. చెయ్యి కిటికీలోంచి బయటికి చాచి, రమ్మన్నట్లుగా పిలిచింది.

కంపార్ట్‌మెంట్‌ని సమీపించిన బాలు అలసిపోయి, రొప్పుతూ.. స్వప్న చెయ్యి పట్టుకున్నాడు.

"స్వప్నా..! హ్యాపీ జర్నీ!" అంటూ తనతోపాటు తెచ్చిన ఫ్రూట్స్‌కవర్‌ని కిటికీలోంచి లోపలికి విసిరాడు.

"ఇప్పుడా రావడం? ఇప్పుడు గుర్తొచ్చానా? " మాటలు వెతుక్కుంది స్వప్న.

"రాత్రంతా ఏదో గందరగోళం.. తర్వాత చెప్తా! నిన్ను ఇప్పుడైనా చూస్తానో? లేదో? అనుకున్నా.." అంటూ ఆమె చెయ్యి పట్టుకుని చిన్నగా నొక్కాడు.

ట్రైన్ స్పీడ్ అందుకుంటోంది.

"ఇక పరిగెత్తకు..! ఆగిపో..! బై..!" చెప్పింది స్వప్న.

చెయ్యి వదిలి కొంతదూరం ట్రైన్ వెంట పరిగెత్తి ప్లాట్‌ఫామ్ మీద ఆగిపోయాడు.

కిటికీ చువ్వలకి తల ఆనించి, చెయ్యి అలాగే బైటికి పెట్టి, గాలిలో ఊపుతూ.. బాలునే చూస్తూ ఉండిపోయింది.. కను మరుగయ్యేంతవరకు.

అప్పటిదాకా గుండెల్లో ఉన్న దిగులు పోయిందో.. లేక మరింత పెరిగిందో తెలీ లేదు. అతను కనిపించనంత వరకు గూడుకట్టుకున్న విషాదం- అతని రాకతో, చూపుతో, స్పర్శతో అమాంతం తుడిచిపెట్టుకుపోయిందో? ఆనందం కమ్ముకుందో? కొత్తగా జీవితపు తోటలోకి ప్రవేశించిన వియోగం.. కొత్త విషాదాన్ని, దిగులునీ మొలకెత్తేలా చేసిందో..??

సీట్లో తల వెనక్కివాల్చి కళ్లుమూసుకుంది స్వప్న.

అప్పుడామె కళ్లలో ఒకే ఒక్క రూపం!! మలుపు తిరిగే జీవితపు అంచులో- కళ్లలోకి, గుండెలోకి తొంగిచూస్తూ, హృదయానికి స్పందించడాన్ని నేర్పిస్తూ, ఒకే ఒక్క వ్యక్తి.. ఆ వ్యక్తి.. బాలు! అతడిని తను ప్రేమిస్తోందని.. అర్థమైంది స్వప్నకి.

'బాలూ..! ఐ లవ్ యు..!' అనుకుంది మనసులో..




ఆ రోజు ఆఫీసులో బిజీబిజీగా గడిపేశాడు బాలు.

రోజూ ఏదో పని ఉన్నట్లు ఛాంబర్‌లోకి పిలిచే శిరీష బయటికి కూడా రాకుండా లోపలే ఉండిపోయింది.

రాత్రి జరిగిన గందరగోళానికి గిల్టీగా ఫీలవుతోందా? అని అనుమానం కలిగింది బాలుకి. ఆమెని అలా ఊరికే వదిలేసి వెళ్లడం నచ్చక- ఆఫీసు నుంచి వెళ్లేముందు నేరుగా ఛాంబర్ దగ్గరికి వెళ్లి, డోర్ నాక్ చేసి మరీ లోపల అడుగుపెట్టాడు.

ల్యాప్‌టాప్‌లో ఏకాగ్రతతో ఏదో టైప్ చేస్తున్న శిరీష తలెత్తకుండా "హాయ్ బాలు!" అంది.

ఎదురుగా చైర్‌లో కూర్చున్నాడు బాలు. అయిదు నిమిషాల పాటు తన వర్క్‌లో

## కొత్తగాలి...

**సౌందర్య ఆరాధకులు**
**పూలతోటను సందర్శిస్తున్నారు**
**గడ్డిపూలను తొక్కుకుంటూ..!**

– బొడ్డేడ బలరామస్వామి,
కశింకోట, విశాఖ జిల్లా

లీనమయి, తర్వాత అతడివైపు చూసి నవ్వింది.

"చెప్పండి బాలూ! ప్రాజెక్ట్ ఎంతవరకు వచ్చింది? " అడిగింది.

అప్పుడామెని చూస్తుంటే, రాత్రి జరిగిందంతా మర్చిపోయిందా? అనిపించింది.

"ఇంకా! ఇంటికి త్వరగా వెళ్లాల్సిన అవసరం లేదుగా? " అడిగింది.

"ప్చ..! లేదు!" అన్నాడు బాలు.

"స్వప్న ఏమంటోంది? రాత్రి ఇంటికి రాలేదని అలిగిందా? " బాలు కళ్లలోకి సూటిగా చూస్తూ అంది శిరీష.

"లేదు. తాను కాలేజ్ టూర్‌కి వెళ్లింది. అందుకే మార్నింగ్ హడావుడిగా వెళ్లిపోయాను, సెండాఫ్‌కి!" చెప్పాడు బాలు.

"టూర్ ఎన్నిరోజులు? "

"పదిరోజులు" చెప్పాడు.

"అయితే, అప్పటిదాకా బాలు ఫ్రీగా ఉంటాడన్న మాట!" అని తన జోక్‌కి తానే నవ్వింది.

దానికి ఏ సమాధానం చెప్పకుండా మౌనంగా ఉండిపోయాడు.

"ఇక బయల్దేరుదామా? " అంది లేచి నిలబడుతూ..

బాలు కూడా లేచాడు. ఇద్దరూ ఆఫీసు నుంచి బయటికి, అక్కడ్నుంచి లిఫ్ట్‌లో సెల్లార్‌లోకి వచ్చారు.

"సరే! గుడ్‌నైట్!" శిరీషతో చెప్పి బైక్ దగ్గరికి నడవబోయాడు బాలు.

"ఎక్కడికీ వెళ్లేది? " అంది శిరీష.

"నా కార్ ఫామ్‌హౌస్‌లో ఉండిపోయింది. రాత్రి తమరే కదా నన్ను అత్యంత జాగ్రత్తగా బైక్ మీద తీసుకొచ్చి- తెల్లారేవరకు కంటికి రెప్పలాగా చూసుకుంది నన్ను మర్చిపోయారా ఏంటి? " అంది.

ఆమె నవ్వుతున్న పెదవులు, కళ్లు చూస్తూ- మనసులో గిల్టీఫీలింగ్ లాంటిది ఏమీ లేదని అర్థం చేసుకున్నాడు బాలు.

"అరెరె! మర్చిపోయానండీ! సరే, పదండి..!" అంటూ బైక్ తీశాడు.

అతని భుజం మీద చెయ్యేసి వెనక కూర్చుంది శిరీష.

కాసేపట్లోనే అపార్ట్‌మెంట్ దగ్గర ఆపి, ఆమె కిందికి దిగాక "వెళ్లనా? " అడిగాడు.

తల అడ్డంగా ఊపింది. "కుదరదు! రాత్రి ఇలాగే.. ఇక్కడే.. దింపి వెళ్లారా? పైన నా ఫ్లాట్ వరకు వచ్చారు. ఈ రోజు కూడా అంతే! పదండి!" చిన్నపిల్లలా మారాం చేస్తున్నట్లుగా అంది.

'ఇదెక్కడి గొడవరా బాబు!' అనుకుంటూ, చేతులు ముందుకు చాచి "సరే..! పదండి!" అన్నాడు.

అతను అలా నిలబడేసరికి శిరీషకి నవ్వొచ్చింది.

ఇద్దరూ లిఫ్ట్‌లో ఫ్లాట్‌కి వెళ్లారు.

రాత్రిలాగా సింగిల్ సోఫాలో కూర్చుని గోడకి తగిలించిన ఫొటోలు మళ్లీ ఓసారి చూశాడు బాలు.

లోపల్నుంచి స్నాక్స్, డ్రింక్స్ తెచ్చిన శిరీష "ఏంటి బాలూ..? ఫొటోలు అంత బాగున్నాయా? " అడిగింది.

"మీది ఫొటోజెనిక్ ఫేస్! తీసింది ఎవరోగానీ.. చాలా బాగా తీశారు" అన్నాడు.

"ఏంటీ? నేను బాగోలేను అనేగా అర్థం!" చిరుకోపంతో అంది.

"అలా అనడంలేదు. మీకేమండీ? బాగుంటారు! ఫొటోలు కూడా మీలాగే..

అంటున్నాను" చెప్పాడు.

కొన్నిక్షణాల తర్వాత "ఆ ఫొటోలు తీసింది ఎవరో ఊహించగలరా? " అడిగింది శిరీష.

తల అడ్డంగా ఊపాడు బాలు.

ఏదో గుర్తు చేసుకుంటున్నట్లుగా ఊపిరి గాఢంగా పీల్చి వదిలింది.

"ఇప్పుడే వస్తాను! మీరు కాఫీ తాగుతారా? డ్రింక్స్ తాగాలని లేదు" అడిగింది.

సమాధానం కోసం చూడకుండా లోపలికెళ్లి అయిదు నిమిషాల్లో రెండు కప్పులతో బయటకొచ్చింది. ఒకటి బాలుకి ఇచ్చి సోఫాలో కూచుంది.

"ఒంటరిగా.. ఏ తోడూ లేకుండా రోజులు గడిపేయడం.. హారిబుల్‌గా ఉంటుంది కదా!" ఉపోద్ఘాతంలా అంది.

ఏమీ చెప్పకుండా తల ఊపాడు బాలు.

"నేను చిన్నప్పుడు అమ్మని ప్రేమించాను. బాల్యం పూర్తిగా సెలవు తీసుకోకముందే.. అమ్మని శాశ్వతంగా పోగొట్టుకున్నాను. పదేళ్ల వయసులో అమ్మ చనిపోవడమంటే.. ఓ అమ్మాయి జీవితంలో అతి పెద్ద విషాదం అది! ఎవరూ పూడ్చలేని లోటు అది!" చెప్పింది.

ఆ మాటలు వింటున్న బాలుకి.. ఎలా ఉంటుందో తెలీని తన తల్లి గుర్తొచ్చింది. అమ్మ ఎలా ఉంటుంది? చనిపోయిందా? లేక నన్ను వదిలేసిందా? అనే ఆలోచన మనసుని చుట్టుకుంది.

బాలు ఆలోచనల్ని చెదరగొడుతూ..

"ఒక ఆడపిల్లకి, ఆ వయసులో అమ్మ లేకపోతే ఏమవుతుందో అర్థమయింది. నాన్న, అన్న జాగ్రత్తగానే చూసుకునేవాళ్లు. అయినా.. జడలు వేయడం, తలస్నానం చేయించడం.. ఇంకా.. ఇంకా.. మీ మగాళ్లకి అర్థంకాదు బాలూ..! ఒక అమ్మాయికి ఎదురయ్యే ఇబ్బందులెన్నో! అమ్మ చనిపోయాక నేనేం చేశానో తెలుసా? పొడవాటి నా జుట్టుని.. జడలేసుకునే అవసరం లేని విధంగా.. కత్తెరతో కత్తిరించాను. అప్పుడు అమ్మ గుర్తొచ్చి ఎంత ఏడ్చానో..!" అంటూ చెప్పడం ఆపింది.

అప్పుడామె కళ్లలో నీటితెర.

"అమ్మ పోయాక.. నాన్న మళ్లీ పెళ్లిచేసుకోలేదు. పదోక్లాస్ అవగానే నేను హాస్టల్‌కి వెళ్లిపోయాను. ఎందుకో తెలుసా? అక్కడైతే నా చుట్టూ నాలాంటి అమ్మాయిలే ఉంటారనే ఆశ కొంతయితే.. నాకోసం.. తమని తాము త్యాగం చేసుకుంటూ, జీవితంలో రాజీపడి, నన్ను కంటికిరెప్పలా చూసుకునే.. నాన్ననీ, అన్ననీ.. కాస్తంత రిలీవ్ చేద్దామనే చిన్న కోరికతో కూడా.. హాస్టల్‌కి వెళ్లిపోయాను. చదువుకునే రోజుల్లో నా ఫ్రెండ్స్ రోజీ, హైనీ.. వీళ్లని బాగా ప్రేమించాను. ఎంతగా అంటే.. మా అమ్మని ప్రేమించినంతగా..! జాబ్‌లో చేరబోయేముందు నాన్న మార్నింగ్ వాక్‌కి వెళ్లి గుండెపోటుతో చనిపోవడం, నేను జాబ్‌లో చేరడం.. అన్న కెనడా వెళ్లిపోవడం- అతను అక్కడ, నేను ఇక్కడ..! ఎందుకో? ఎక్కడికీ వెళ్లాలనిపించదు! జీవితంలో నా మొదటి నేస్తం- మా అమ్మ. చిన్నవయసులోనే అమ్మని కోల్పోవడం నా మనసు మీద చాలా ప్రభావం చూపింది. అందుకే.. తర్వాత ఎవరినీ అంత దగ్గరగా తీసుకోలేకపోయాను.

కానీ, మన చేతుల్లో ఏదీ ఉండదు కదా! అనుకున్నవన్నీ ఎలా జరుగుతాయి? అలాగే అయింది.. టోనీతో పరిచయం!!" ఒక్కక్షణం ఆగింది శిరీష.

ఒక అమ్మాయి అంతరంగాన్ని ఇలా తెలుసుకోవడం బాలుకి ఇదే మొదటిసారి. అందులోనూ తన ప్రాజెక్ట్ హెడ్‌గా, ఫాస్ట్‌సిటీ కల్చర్‌కి ప్రతినిధిగా ఉండే శిరీష హృదయంలో బయటకి కనిపించని కోణాలు బహిర్గతమవుతుంటే అలాగే వింటూ కూర్చుండిపోయాడు.

"టోనీ ఎవరు? అని అడగలేదేంటి

బాలు? ” ఇందాకటి విషాదపు మూడ్ లోంచి బయటికొచ్చి అడిగింది శిరీష.

“అదీ మీరే చెప్పండి!” అన్నాడు బాలు.

ఒకసారి ఊపిరి పీల్చి వదిలింది.

“టోనీ అంటే.. ఒక అబ్బాయి! నాకన్నా నాలుగేళ్ల చిన్నకుర్రాడు” చెప్పింది.

మళ్ళీ ఏ ప్రశ్న అడగకుండా మౌనంగా ఉండిపోయాడు బాలు. ఆమె అలా అడగడం- మరో జ్ఞాపకాన్ని గుర్తుచేసుకోవడానికి చేసే ప్రయత్నంగా అర్థమైంది.

“నేను అప్పట్లో లోకల్ ట్రైన్‌లో ఆఫీసుకి వెళ్ళేదాన్ని. ఇంటి దగ్గర్లోనే స్టేషన్. నాన్న చనిపోయి, అన్న కూడా ఫారెన్ వెళ్ళిన రోజులు. హెడ్‌ఫోన్స్‌లో పాటలు వింటూ కొంతదూరం నడక, స్టేషన్, రైలు ప్రయాణం, మళ్ళీ నడక, అక్కడ నుంచి ఆఫీసు కార్.. ఇదే రొటీన్. నాకు తోడుగా నా పాటలు.. సినిమాలు.. అంతే! అప్పుడు ఒకరోజు స్టేషన్లో పరిచయమయ్యాడు టోనీ. వాడు ఇంజినీరింగ్ ఫైనల్ ఇయర్ స్టూడెంట్. వీపుకి కాలేజ్ బ్యాగ్. మెడలో కెమెరా. ఏదిపడితే అది, ఎక్కడపడితే అక్కడ ఫొటోలు తీస్తూ, హైపర్ ఏక్టివ్‌గా ఉండేవాడు.

ఒకరోజు నేను సిమెంట్ బెంచ్‌మీద కూర్చుని, ఇయర్‌ఫోన్స్ తగిలించుకుని చేతిలో మొబైల్‌తో ఏదో చూస్తుంటే.. నాకు తెలీకుండా నా ఫొటో తీశాడు. మరుసటిరోజు పలకరించి, నా హ్యాండ్‌బ్యాగ్‌లోంచి కింద పడిందంటూ ఫొటో ఇచ్చాడు. చూస్తే, ఆ ఫోటో నాదే! వాడు ముందురోజు నాకు తెలీకుండా తీసింది. నా పర్మిషన్ లేకుండా ఫొటో తీసినందుకు తిట్టాలా? లేక అంత బాగా తీసినందుకు మెచ్చుకోవాలా? అనేది కూడా అర్థంకాలేదు. అర్థమయ్యేసరికి వాడు నా ఫ్రెండ్‌గా మారిపోయాడు. నాకు మనసులో వేరే ఫీలింగ్ ఉండేది కాదు. నాకన్నా చిన్నకుర్రాడు. నాలాగే స్నేహంగా ఉండేవాడు. మనసులో ఏమీ దాచుకోకుండా మాట్లాడుకునేవాళ్ళం.. అల్లరిచేసేవాళ్ళం ట్రైన్ జర్నీలో. కంపార్ట్‌మెంట్‌లో అందరినీ ఆటపట్టించి, అల్లరి చేసేవాడు.. నవ్వించేవాడు. ఈ ఫొటోలన్నీ వాడు తీసినవే. అలాంటిది.. ఒకరోజు నన్ను ప్రేమిస్తున్నానని, పెళ్ళి చేసుకుందాం అన్నాడు.

నాకు మతిపోయింది. నాకు నీ మీద అలాంటి ఫీలింగ్ లేదురా! నీకన్నా పెద్దదాన్ని.. అని చెప్పాను. వాడిని తిట్టాలో, స్నేహాన్ని కట్ చేయాలో? అర్థంకాలేదు. ‘ఉట్టి స్నేహమేనా? నాకు ప్రేమ కూడా ఉంది. మనం పెళ్ళిచేసుకుందాం’ అన్నాడు. ఒక ఆడ, మగా, ఎలాంటి రిలేషన్‌షిప్ - అటు మానసికంగా, ఇటు శారీరకంగా లేకుండా.. ఎప్పటికీ, మంచి స్నేహితుల్లా ఉండలేరా? అని బాధవేసింది. వాడికి మాత్రం నా ఫీలింగ్స్ అర్థంకాలేదు. చాలా పొసెసివ్‌నెస్ ఉండేది వాడిలో! చివరికి నన్ను బెదిరించి, బ్లాక్‌మెయిల్ చేయాలని చూశాడు..” జ్ఞాపకాల కుదుపులో ఒక్కక్షణం ఆగింది శిరీష.

ఆ కాసేపటి మౌనం తర్వాత శిరీష చెప్పబోయే షాకింగ్ మాటలు ఏమిటా? అని అలాగే నిశ్శబ్దాన్ని పేర్చుకుంటూ నిస్తేజంగా చూడసాగాడు బాలు.

“బ్లాక్‌మెయిల్ అంటే మరేదో కాదు. వాడిని ప్రేమించకపోతే.. చచ్చిపోతానని బెదిరించాడు. నేను బాగా తిట్టి, మాట్లాడడం మానేశాను. రెండు మూడు రోజులు.. స్టేషన్‌లో దూరంగా కనిపించేవాడు. నేను ఎవరో కూడా తెలీనట్లుగా అసలు పట్టించుకోలేదు. ఒకరోజు పొద్దుటే మామూలుగా స్టేషన్‌కి చేరుకున్నాను. ఇవతలి ప్లాట్‌ఫామ్ మీద నేనుంటే - అవతల వైపున వాడు నిలబడ్డాడు. ఇంతలో ట్రైన్ వస్తుంటే.. చాలామందిలాగే, వాళ్ళతో కలిసి పట్టాలు క్రాస్ చేస్తూ.. సడన్‌గా..

ట్రైన్ కింద పడి చనిపోయాడు" ఆ దృశ్యం మళ్ళీ కళ్ళముందు ప్రత్యక్షమవడంతో చెప్పడం ఆపి, కళ్ళు మూసుకుంది శిరీష.

వింటున్న బాలు షాక్ కి గురయినట్లుగా నోరు తెరిచాడు. గుండెలో కలుక్కుమంది.

కొన్నిక్షణాల మౌనం తర్వాత మళ్ళీ పెదవులు విప్పింది శిరీష. "అందరూ ప్రమాదవశాత్తూ వాడు రైలు కింద పడ్డా డనే అనుకున్నారు. కానీ.. కానీ.. రైలు కింద పడబోయే చివరిక్షణాల్లో అంత దూరం నుంచి వాడు నన్నే కన్నార్పకుండా, గుండెని చీల్చేలాగా చూశాడు. వాడికి తెలుసు.. వాడు కావాలనే అలా రైలు కింద పడి చనిపోయాడు. అది నాకూ తెలుసు! కానీ.. కానీ.. ఎందుకలా ఆత్మ హత్య చేసుకున్నాడు? ఒక మనిషి మీద ప్రేమ కలిగితే.. ఎప్పటికీ అలాగే ప్రేమి స్తూనే ఉండొచ్చుకదా! స్నేహితులు స్నేహంగా ఉన్నట్లు, ప్రేమించిన వాళ్ళు.. అలాగే ప్రేమతో.. ఆనందంగా బతికే యొచ్చు కదా! ఆ వ్యక్తిని జీవితంలోకి తీసుకోవాలి.. సొంతం చేసుకోవాలి.. అనే పొసెసివ్‌నెస్, ఆ ఫీలింగ్ ఎందుకు కలు గుతుంది? నాకు ఏమీ అర్థం కావడం లేదు. అప్పుడూ.. ఇప్పుడు కూడా.." చెప్పడం ఆపింది శిరీష.

ఆ మాటలు బాలు గుండెలో ఏవో కొత్త తలుపులు తెరుస్తున్నట్లుగా, ఇప్పటివరకూ కలగని ఏదో భావాన్ని, ఆలోచనని కలిగి స్తున్నట్లుగా అనిపించింది.

తను స్వప్నని ఇష్టపడుతున్నాడా? ఆమె లేనిదే జీవితమే లేదని ఫీల్ అవుతు న్నాడా? స్వప్నకి కూడా నా మీద స్నేహంతో కూడిన ఇష్టమా? లేక అంత కన్నా గాఢమైన ఫీలింగ్‌తో ఉందా? బాలుకి అంతా అగమ్యగోచరంగా, అయో మయంగా అనిపించింది.

"ఏంటి బాలూ! కామ్‌గా ఉన్నావు?" అడిగింది శిరీష.

"ప్చ్! ఏంలేదు! ప్రేమ అనేది ఎప్పుడు.. ఎలా.. ఎవరి మీద.. కలుగుతుంది? ఎం దుకు కలుగుతుందని ఆలోచన" అన్నాడు.

"అవునా? మరి ఇంతవరకూ ఎవరి మీదా కలగలేదా?" కళ్ళలోకి సూటిగా చూస్తూ అడిగింది.

"కరెక్ట్‌గా చెప్పలేను. ఇప్పుడే ఏమీ అర్థం కావడం లేదు" అన్నాడు.

అతని మనసులో స్వప్న మెదిలింది.

శిరీష ఆలోచిస్తున్నట్లుగా ఉండిపో యింది.

## సెప్టెంబరు - 2015
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **పి. గీత**
   - హన్మకొండ, వరంగల్ జిల్లా
2. **మరెడ్డి ప్రభాకర్**
   - కొత్తపేట, హైదరాబాద్
3. **టి. అంజలి**
   - ఎన్.జి.ఓస్ కాలనీ, తిరుపతి
4. **చందు తులసి**
   - పి.ఎన్. కాలనీ, శ్రీకాకుళం
5. **కె. చంద్రశేఖరశర్మ**
   - కోటవీధి, నంద్యాల

## సరైన జవాబులు

| | |
|---|---|
| 1. సీతమ్మ | 6. ఇద్దరు |
| 2. గురుమూర్తి | 7. రఘువీర్ మండల్ |
| 3. సర్పాపురం | 8. కాలేసర్ |
| 4. గౌతమి | 9. పెద్దముత్యం |
| 5. చిల్లర డబ్బులు | 10. కొడవటిగంటి |

## కొత్తగాలి...

**ధరల పరుగుపందెంలో**
**ఉల్లికి దక్కింది స్వర్ణం**
**స్వర్ణానికి వచ్చింది**
**కడుపేద కాంస్యం!**

– ముడుంబ సీత,
భద్రాచలం

"ఒకటి అడుగుతాను. కరెక్ట్‌గా చెబుతారా? " అడిగాడు బాలు.

"చెప్తాను..! అడగండి!"

"మీరు ఒకరోజు లిఫ్ట్‌లో ఏదో మెసేజ్ వస్తే.. చాలా డిప్రెస్ అయి కన్నీళ్ళు తెచ్చుకున్నారు! గుర్తుందా? మీరు ఎవరినైనా ప్రేమిస్తున్నారనిపించింది అప్పుడు. నిజమేనా? " అడిగాడు.

బదులుగా నవ్వింది శిరీష.

"భలేవాళ్ళే మీరు! కళ్ళలో నీళ్ళు వస్తే, విషాదంగా ఉంటే.. అప్పుడు ఎవరినైనా ప్రేమిస్తున్నట్లేనా? ప్రేమలో అంత విషాదం, బాధ ఉంటాయనిపిస్తోందా? " అర్థం కానట్లుగా అడిగింది"

"అలా అనికాదు! ఆ రోజు ఎందుకో అనిపించింది!" చెప్పాడు బాలు.

"టోనీతో స్నేహం.. అతని మరణం కళ్ళారా చూశాక.. ఆ తర్వాత మళ్ళీ ఎవరితోనూ స్నేహమే చేయలేదు.. ఎవరినీ ప్రేమించేంతగా.. అంత అర్హులెవరూ నాకు కనిపించలేదు. ప్రేమ అనేది ఫీలింగ్‌కి సంబంధించింది కదా! అలాంటి ఫీలింగ్ ఎవరి మీదా కలగలేదు. ఇక ఆ రోజు మెసేజ్ అన్న దగ్గర్నుంచి. నువ్వు ఒంటరిగా అక్కడెందుకు- కెనడా వచ్చేయ్! అంటే - అందరూ నన్ను వదిలి, నాకు దూరంగా వెళ్తుంటే.. నేను అలా ఎందుకు రావాలి? అన్నాను. అప్పుడు అమ్మ గుర్తొచ్చి దుఃఖం.. అంతే!" చెప్పింది.

"అయామ్ సారీ!" చెప్పాడు బాలు.

"కానీ.. బాలూ! ఇందాక మీరన్నారే.. అది నిజమే! బాధలతో, విషాదంతో గుండెని నింపుకోడానికీ, కరువుతీరా కన్నీళ్ళు కార్చడానికీ వీలుకుదిరేది.. ఒక్క ప్రేమవల్లే! ఎవరినైనా గాఢంగా ప్రేమిస్తేనే అది సాధ్యపడుతుంది" చెప్పింది.

కాసేపు మౌనంగా ఉండిపోయాడు బాలు. అప్పుడతనికి రెండ్రోజుల కిందట అర్ధరాత్రి వరండాలో కూచుని ఉంటే, అంతకుముందు గొడవ పడిన స్వప్న వచ్చి తన భుజం మీద తల పెట్టుకొని వెక్కి వెక్కి ఏడవడం గుర్తొచ్చింది. అంటే, స్వప్న మనసులో నా మీద ప్రేమ ఉందా? గాఢమైన ఇష్టం, అంతకన్నా గాఢమైన ప్రేమగా మారిందా? అనిపించింది.

కానీ, ఏ విషయమూ నిర్ధారించుకోలేక పోయాడు బాలు.

"సరే! వెళ్తాను.. గుడ్‌నైట్!" చెప్పాడు.

బదులుగా నవ్వింది శిరీష.

★ ★ ★

ఇంటికి చేరుకున్న బాలుని పిలిచింది జానకమ్మ.

"బాలూ..! నీ ఫోన్ సరిగా పనిచేయడం లేదా? " అడిగింది.

"బాగానే వుందిగా బామ్మగారూ! ఏమయింది? కాల్ చేశారా? " అన్నాడు.

"నేను కాదు. సాయంత్రం స్వప్న చేసింది నాకు. చెన్నై చేరారట. నీకు ఫోన్ చేస్తే సిగ్నల్ దొరకలేదని చెప్పింది" జానకమ్మ అంది.

అప్పుడు గుర్తొచ్చింది బాలుకి.. ఈ రోజు తను స్వప్నకి కాల్ చేయలేదని. అయితే ఆమె కూడా తనకు కాల్ చేయకుండా, కేవలం గుర్తు చేయడానికి జానకమ్మతో అలా చెప్పిందని అర్థమయింది. రాత్రి భోజనం చేశాక కాసేపు అనిల్‌తో గడిపి, నిద్రొస్తోందని చెప్పి రూమ్‌లోకి

వెళ్ళి తలుపు వేసుకున్నాడు బాలు. స్వప్నకి ఫోన్ చేశాడు. చాలాసేపు రింగ్ అయింది. స్వప్న ఆన్సర్ చేయలేదు. కాసేపు ఆగి మళ్ళీ చేశాడు.. చివరి రింగ్‌లో కాల్ ఆన్సర్ చేసింది స్వప్న.

"హలో! బాలూ! ఎలా ఉన్నావ్?"

"నువ్వెలా ఉన్నావ్? టూర్ హ్యాపీగా ఉందా?" అడిగాడు.

"ఎలాగో ఉంది..! అసలు వెళ్ళకుండా ట్రైన్ దిగిపోదామనుకున్నాను, నువ్వు రాక పోయేసరికి! కానీ, నెక్ట్స్‌స్టేషన్‌లో నువ్వు వచ్చాక.. ఇప్పుడు ఓకే! ఎందుకలా చేశావ్? రాత్రంతా రూమ్‌కి రాకుండా పార్టీలో ఎందుకున్నావ్ అసలు?" అడిగింది.

"మా ఆఫీస్‌వాళ్ళు.. బాస్.." అన్నాడు.

"ఆ రోజు మనింటికి వచ్చింది.. శిరీష! తను కూడా ఉందా పార్టీలో?" గొంతులో కొద్దిగా కోపం ధ్వనించింది.

స్వప్న దగ్గర నిజాయితీగా ఉండాలనీ, ఏదీ దాచిపెట్టకుండా అన్నీ చెప్పాలని బాలుకి అనిపించింది. పార్టీ గురించీ, అక్కడ జరిగిందీ, శిరీషని ఇంటికి తీసుకెళ్ళడం, పొద్దుట లేచి స్టేషన్‌కి పరుగెత్తడంతో సహా అంతా చెప్పాడు.

అంతా విని "ఓకే! బాలూ..! నేను ఒక నిర్ణయానికొచ్చాను. చెప్పనా?" అంది.

తను నిజాయితీగా శిరీష గురించి చెప్పడం, స్వప్న తప్పుగా అర్థం చేసుకుందా? అని ఆలోచించాడు బాలు.

"చెప్పు!" అన్నాడు- ఆమె ఏం చెప్పినా వినేందుకు సిద్ధపడుతూ..

"ఈ టూర్ పది రోజులుంటుంది. నేను ఇంటికి చేరేంత వరకూ నీకు ఫోన్ చేయను. అస్సలు మాట్లాడను. నా మనసులో నీ గురించి ఈ పదిరోజులూ ఎలా ఫీల్ అవుతానో? నాలో.. మనసులో ఎలాంటి మార్పు కలుగుతుందో? చూస్తాను. నువ్వు కూడా నాకు ఫోన్ చెయ్యొద్దు! మెసేజ్ కూడా చెయ్యొద్దు. నీ రొటీన్ వర్క్‌లో నువ్వుండు! నీకు, నేను లేని లోటు, మాట్లాడకపోవడం.. నీ మనసులో ఎలాంటి ఫీలింగ్స్ కలిగిస్తుందో చూడు! అలా కాకుండా నీ ఆఫీసు, కోలీగ్స్, శిరీష, పార్టీలు, మాటలతో.. నేను లేను, కనిపించలేదు, మాట్లాడలేదు అనే వెలితి లేకుండా హ్యాపీగా ఉంటావేమో చూడు!

నేను ఈ పదిరోజులూ నా ఫ్రెండ్స్‌తో, సరదాల్లో, సందడిలో నిన్ను అసలు తల్చుకోకుండా ఉంటానా? లేక ప్రతిక్షణం తల్చుకుంటూనే ఉంటానా? చెక్ చేసుకుంటాను.

అప్పుడు.. అప్పుడు.. మనం ఒకరిని ఒకరం గాఢంగా ఇష్టపడుతున్నామా? లేక మన మధ్య ఉన్నది అందరిలాగే కేవలం స్నేహం, దగ్గరితనమా? అనేది కన్‌ఫర్మ్ చేసుకుందాం" అంది స్వప్న.

బాలుకి స్వప్న మాటలు ఆశ్చర్యాన్ని కలిగించలేదు. ఏదైనా నిర్ధారణగా తెలుసుకోవాలంటే రుజువులు తప్పవు. ఏదో ఒక పరీక్షని ఎదుర్కొంటేనేగా నిర్ధారణ జరిగేది.

తమ మధ్య, హృదయాల మధ్య, ఆలోచనల్లో ఏం జరుగుతోంది? ఇది స్నేహం మాత్రమేనా? లేక ఒకరిని ఒకరు విడిచి ఉండలేనంత ప్రేమా? లేక ఇష్టమా? అనేది తెలుసుకోవాలని బాలుకి కూడా అనిపించింది.

"ఏంటీ? మాట్లాడకుండా మౌనం దాల్చావు? అలా వద్దా?" అటువైపు నుంచి స్వప్న అడిగింది.

"నువ్వు అంటున్నది నిజమే! అలాగే చేద్దాం! ఈ పదిరోజులూ మనల్ని మనం పరీక్షించుకుందాం!" అన్నాడు బాలు.

"సరే! ఈ రోజు నుంచీ మనం ఒక్కసారి కూడా ఫోన్ చేసుకోకూడదు. ఒకవేళ వేరేవాళ్ళు ఫోన్ చేసినా అప్పుడు కూడా మాట్లాడుకోకూడదు!" అంది స్వప్న.

వాళ్ళిద్దరూ పరస్పరం విధించుకున్న నిబంధనలు సులభమైనవో? లేక నరాల్ని

## కొత్తగాలి...

**అహం**
**విషం**
**అణకువ**
**అమృతం**

- యు. చిట్టిబాబు,
న్యూపాల్వంచ, ఖమ్మం జిల్లా

తెంచి, హృదయాల్ని దుఃఖంలో ముంచేంత కఠినమైనవో? ఆ క్షణంలో వాళ్ళిద్దరికీ తెలీదు.

"ఓ..కే..! " చెప్పాడు బాలు.

"సరే..! గుడ్‌నైట్ బాలూ! జాగ్రత్త! బైక్ మీద స్పీడ్‌గా వెళ్లకు. పార్టీలంటూ లేట్‌గా రాకు! టైమ్‌కి తిను..!" అంది స్వప్న.

"నువ్వు కూడా జాగ్రత్త స్వప్నా! జర్నీ చేసేటప్పుడు.. టేక్‌కేర్!" అన్నాడు బాలు.

ఇద్దరూ కొన్ని క్షణాలు ఏమీ మాట్లాడు కోకుండా మౌనంగా ఉండిపోయారు. కొన్ని క్షణాల నిశ్శబ్దం తర్వాత..

"బాలూ!" అని స్వప్న.. "స్వప్నా!" అని బాలూ.. ఒకేసారి, ఒకరినొకరు ఆర్తిగా పిలుచుకున్నారు. అప్పుడు వాళ్ళ గొంతులో ఏదో అడ్డుపడినట్లయింది.

"గుడ్‌నైట్!" చెప్పింది స్వప్న.

కాల్ కట్ అయింది.

ప్రేమా, యుద్ధం.. రెండు మొదలుపెట్టడం కష్టం. ముగించడమూ మహాకష్టం. కాలం పెట్టే సంఘర్షణలు, పరీక్షలలో చాలా ప్రేమలు వికసించకుండానే రాలిపోతుంటాయి. నిజమైన ప్రేమ- నిండు గుండెలో పున్నమి వెన్నెలలా విరిస్తే మాత్రం.. ఎప్పటికీ, ఎన్ని ఎడబాట్లు పరీక్షలూ ఎదురయినా.. అది అలాగే నిలిచి ఉంటుంది. హృదయాలలో ఎప్పటికీ, జీవితంలో నిలిచిపోతుంది. మిగిలి ఉంటుంది.. చరిత్రలాగ.. ఎప్పటికీ!!

అక్కడ స్వప్న ఎలా ఆలోచిస్తోందో? ఇక్కడ బాలుకీ తెలీదు. ఆమె ఈ పది రోజుల్లో ఏం నిర్ణయించుకుంటుందో? అతను ఊహించలేడు. ఇక్కడ బాలు ఏం ఆలోచిస్తున్నాడో? ఏం నిర్ణయించుకుంటాడో? స్వప్న కూడా ఊహించలేదు.

★ ★ ★

కాలేజీలోని సువిశాలమైన లైబ్రరీ.

మెట్లెక్కి క్రచెస్‌తో లోపలికి ప్రవేశించాడు శ్రీకాంత్.

లైబ్రేరియన్ దగ్గరకి వెళ్లిన శ్రీకాంత్ తనతోపాటు తెచ్చిన రిఫరెన్స్ బుక్‌ని టేబుల్ మీద భద్రంగా పెట్టాడు.

అతడివైపు చూసిన లైబ్రేరియన్ "అప్పుడే రిటర్న్ చేస్తున్నావేంటి? చదివావా అసలు? " యధాలాపంగా అడిగాడు.

నవ్వి తలూపాడు శ్రీకాంత్.

"లైబ్రరీ బుక్స్ బాగా ఉపయోగించుకుంటున్నావు. త్వరగా రిటర్న్ చేసేస్తున్నావు" అంటూ ఆ బుక్‌ని తీసి పక్కన పెట్టాడు.

"కూపన్ ఇక్కడే ఉంచండి! మళ్ళీ బుక్స్ కావాలి, తీసుకొస్తాను" చెప్పి చిన్నగా క్రచెస్ సాయంతో బుక్‌షెల్ఫ్‌ల మధ్యకి వెళ్ళాడు శ్రీకాంత్, ఏవో బుక్స్ వెతుకుతున్నట్లుగా! కౌంటర్ మీద ఉన్న తను తెచ్చిన బుక్‌ని ఎవరైనా తీసుకుంటున్నారా? లేదా? అని గమనిస్తూ దూరంగా నిలబడ్డాడు. అక్క రాసిన పది ఉత్తరాల్ని ఇదే లైబ్రరీలోని రిఫరెన్స్ బుక్స్‌లో పెట్టాడు. తను తెచ్చిన బుక్స్‌ని ఎవరు తీసుకెళ్ళారు? ఉత్తరాలు అలాగే ఉన్నాయా? లేదా? అనేది తెలుసుకోవాలనిపించింది.

తను తీసుకెళ్లిన బుక్స్ ఎక్కడున్నాయా? అని వెతికాడు. మొదటి ర్యాక్‌లో రెండు బుక్స్ కనిపించాయి. వాటిని చూడగానే గుండె వేగంగా కొట్టుకోసాగింది. ఒక పుస్తకం అందుకుని, చప్పున పేజీలు తిప్పాడు. చివరిపేజీ వరకు..

ఎక్కడా ఉత్తరం కనిపించలేదు. అలానే రెండో బుక్ కూడా చూశాడు. అందులో కూడా ఉత్తరం లేదు. అంటే.. ఈ బుక్స్ తీసుకెళ్లినవాళ్ళు.. ఉత్తరాలు తీసి చదివారని అర్థమైంది.

అదే సమయానికి ముగ్గురు అమ్మాయిలు లైబ్రరీలోకి అడుగుపెట్టారు. వాళ్ళ వెనకే మరో ఇద్దరు అబ్బాయిలు కూడా!

కౌంటర్ దగ్గరికి వెళ్ళిన అమ్మాయిలు తమతోపాటు తెచ్చిన బుక్స్‌ని రిటర్న్ చేసి, కొత్తబుక్స్ కోసం షెల్ఫ్‌ల దగ్గరికి వెళ్తుండగా వాళ్లలో వెనగ్గా ఉన్న అమ్మాయి రెండడుగులు వెనక్కి వేసి, కౌంటర్ దగ్గర ఉన్న.. ఇంతకు ముందు తను తెచ్చిన రిఫరెన్స్ బుక్‌ని తీసుకోవడం దూరం నుంచి గమనించాడు శ్రీకాంత్.

బుక్ తీసుకొన్న అమ్మాయి అక్కడే నిలబడి పేజీలు తిరగేసింది. ఎవరైనా చూస్తున్నారేమో అన్నట్లుగా అటూఇటూ చూసింది. పేజీల మధ్య కనిపించిన మడతలు పెట్టిన పేపర్‌ని అరచేతుల మధ్య దాచి, బుక్‌ని తిరిగి కౌంటర్ మీద పెట్టేసింది.

ఇది గమనించిన శ్రీకాంత్‌కి గుండెలనిండా ఆనందంతో కూడిన టెన్షన్ కలిగింది.

ఆ అమ్మాయి తన చేతిలోని కాగితాన్ని హ్యాండ్‌బ్యాగ్‌లో పెట్టి, ఆ బ్యాగ్‌ని లైబ్రేరియన్ ఛైర్ పక్కనున్న అటెండర్‌కిచ్చి స్లిప్ తీసుకుంది. తరువాత ఫ్రెండ్స్ దగ్గరికి వెళ్ళిపోయింది.

తను రిఫరెన్స్ బుక్‌లో పెట్టిన అక్క ఉత్తరాన్ని, వెతికి మరీ ఆ అమ్మాయి తీసుకుందని శ్రీకాంత్‌కి అర్థమైంది. ఇప్పుడీ అమ్మాయి, ఉత్తరం కోసం బుక్‌లో వెతకడం చూస్తుంటే.. అక్క ఆశయం ఫలిస్తుందనే నమ్మకం శ్రీకాంత్‌కు కలిగింది.

ఇన్నాళ్ళుగా అక్క గుండెలో విషాదాన్ని, కళ్ళలో కన్నీళ్ళని మాత్రమే చూస్తున్నాడు. ఇప్పుడీ సంగతి చెబితే.. ఆమె ముఖంలో నవ్వునీ, ఆనందాన్ని చూడొచ్చనిపించింది.

మరో రిఫరెన్స్ బుక్ తీసుకుని శ్రీకాంత్ ఇంటికి బయలుదేరాడు.

★ ★ ★

రాత్రి ఎంతకీ నిద్ర పట్టక, ఎప్పుడో తెల్లవారుజామున మగత నిద్ర పట్టింది బాలుకి. ఎంతసేపు పడుకున్నాడో తేలీదు. ఫోన్ మోగుతుంటే నిద్రమత్తులో కళ్ళు తెరవకుండానే ఆన్ చేసి, "హలో!" అన్నాడు.

"ఎన్నిసార్లు ఫోన్ చేయాలి బాలు? నేను మీ ఇంటి బయటే ఉన్నాను" అంటూ శిరీష గొంతు వినిపించింది.

ఆమె మాటలతో నిద్రమత్తు వదిలింది బాలుకి. హడావుడిగా లేచి, బయటకొచ్చాడు. గేటు బయట శిరీష కనిపించింది.

"ఆటోలో వచ్చాను. బీచ్ దగ్గర ఫామ్‌హౌస్‌లో ఉన్న నా కారు తెచ్చుకోవాలి మనం" చెప్పింది.

అప్పటికింకా పూర్తిగా తెల్లవారలేదు. స్వప్న వాళ్ళింట్లో కూడా ఎవరూ లేచినట్లు కనిపించలేదు. శబ్దమవకుండా గేటు తీసి, బైక్‌ని కొద్దిదూరం నడిపించుకుంటూ వెళ్లి అక్కడ స్టార్ట్ చేశాడు. ఇద్దరూ బైక్ మీద ఫామ్‌హౌస్‌కి బయల్దేరారు.

ఫామ్‌హౌస్ పార్కింగ్ ప్లేస్‌లో శిరీష కారుంది. ఇద్దరూ కిందకి దిగారు. బాలు భుజం మీద చేత్తోతట్టి "కాసేపు బీచ్‌లో వాకింగ్ చేద్దాం!" అంది శిరీష.

వాతావరణం ప్రశాంతంగా ఉండడంతో బాలుకి కూడా బీచ్‌లో నడుద్దామనిపించింది. ఇద్దరూ తడి ఇసుకలో నడక మొదలుపెట్టారు.

బాలుకి, స్వప్న గుర్తొచ్చింది. రెండు రోజులక్రితం ఇదే తీరంలో స్వప్న వాళ్ళతో గడపడం.. కేరింతలు కొడుతూ అలల మధ్య ఆడుతూ.. తనని కూడా రమ్మని పిలవడం, ఒడ్డున ఉండిపోయిన తన దగ్గరికి వచ్చి, పక్కనే నడుస్తూ "నేను నీ పక్కనే ఉంటా కదా! ఏమీ కాకుండా జాగ్ర

త్తగా చూసుకుంటా కదా! అన్న స్వప్న మాటలు గుర్తొచ్చాయి బాలుకి.

జీవితాంతం స్వప్న నా పక్కనే ఉంటుందా! అనే ఆలోచన కలిగింది బాలుకి. స్వప్న ఇప్పుడేం చేస్తోందో? నన్ను తలుచుకుంటోందా? లేక మర్చిపోయి ఫ్రెండ్స్‌తో సరదాగా ఎంజాయ్ చేస్తోందా? ఒకవేళ అదే జరిగితే.. అప్పుడు ఆమె మనసులో తన మీద ప్రేమ లేదని, స్నేహంతో కూడిన ఇష్టం మాత్రమే ఉందని డిసైడ్ అవుతుంది. కానీ, నాకు మాత్రం అలా లేదు. పక్కన శిరీషతో నడుస్తున్నా.. అడుగడుగునా, ఎగిసిపడే ప్రతి అలలో, అలజడి కలిగిస్తూ స్వప్న గుర్తొస్తూనే ఉంది. అంటే.. నా మనసులో స్వప్న మీద ఉన్నది ప్రేమా? ఇలా ఆలోచిస్తున్న బాలు ముందు, రెండు చేతులు నడుం మీద పెట్టుకుని శిరీష అడ్డంగా నిలబడింది.

ఆలోచనలోంచి బయట పడిన బాలు నడక ఆపి, శిరీష ముఖంలోకి చూశాడు.

"ఏంటి ఆలోచన? నేను రెండుసార్లు అడిగాను. సమాధానం ఇవ్వలేదు. నా మాటలు వినిపించుకోలేదా? "అడిగింది శిరీష.

"సారీ..! వినలేదు. ఏమడిగారు? చెప్పండి!" అన్నాడు.

"ఏం లేదులే! ఈ మధ్య అదోలా వుంటున్నారేంటి? అని అడిగాను. ఎనీ ప్రాబ్లమ్? " అంది శిరీష.

ఆమె అలా అడగగానే బాలుకి స్వప్న గుర్తొచ్చింది.

"ఏమీలేదు!" అన్నాడు.

కానీ అప్పుడు స్వప్నకి ఫోన్ చేద్దామా? మాట్లాడదామా? అనిపించింది. ఆ క్షణంలో తామిద్దరూ పెట్టుకున్న నియమం, నిబంధన బాలుకి గుర్తురాలేదు. ఎలాగైనా ఒక్కసారి.. స్వప్నతో మాట్లాడాలని బలంగా అనిపించింది.

చప్పున సెల్‌ఫోన్ తీసి స్వప్న నెంబర్‌కి డయల్ చేశాడు. మరుక్షణంలో బీప్ బీప్ అంటూ కాల్ కట్ అయింది.

ఎందుకలా అయిందా? అని చూస్తే, ఫోన్‌లో సిగ్నల్ లేదు! ఒక్కసారిగా ఉసూరుమనిపించింది బాలుకి!

అతనెవరికో ఫోన్ చేయబోతున్నాడని, శిరీష నడకని జాగింగ్‌గా మార్చి, పరుగు అందుకుంది. ఫోన్‌చేసిన బాలు, సిగ్నల్ చూసుకుంటూ ఒక నిమిషంసేపు ఆగిపోవడంతో శిరీష ముందుకెళ్లిపోయింది.

సరిగ్గా అప్పుడు బీచ్‌లోకి ప్రవేశించిన ఏదో బైక్ బాలుని క్రాస్ చేసుకుని శిరీష వైపు దూసుకెళ్ళింది. బైక్ మీద ఇద్దరు యువకులున్నారు. బాలు ఇది గమనించేలోపల శిరీష సమీపంలోకి చేరుకున్న బైక్ మీంచి ఒకరు దిగడం, ఆమె దగ్గరకెళ్లి ఏదో అంటూ బైక్‌వైపు లాగడం రెప్పపాటులో జరిగిపోయాయి.

ఇది చూడగానే పరుగు మొదలుపెట్టిన బాలుని చూసి, వాళ్లతో పెనుగులాడుతూ అరవసాగింది శిరీష. ఒకడు ఆమెని బైక్ మీద మధ్యలో కూచోపెట్టుకోవాలని ప్రయత్నించడం, ఆమె ప్రతిఘటించడం.. అంతా గందరగోళంగా మారింది అక్కడ.

బాలు పరుగున దగ్గరకెళ్ళేసరికి శిరీష ఒకడి చేతుల్లోంచి తప్పించుకుంది.

ముందుకి దూకిన బాలు.. శిరీషని పట్టుకోవడానికి ప్రయత్నించిన కుర్రాడితో తలపడ్డాడు. ఆవేశంతో తన బలమంతా ఉపయోగించి కొట్టడం మొదలుపెట్టాడు. ఇది చూసిన బైక్‌మీద ఉన్న మరొకడు, బైక్‌ని రౌండ్‌గా తిప్పి వీళ్ళిద్దరివైపు వచ్చాడు. బాలు చేతుల్లోంచి తప్పించుకున్న కుర్రాడు ఒక్క ఉదుటున పరిగెత్తి బైక్ వెనుక సీటుమీద కూర్చోవడం, వాళ్ళిద్దరూ వేగంగా వెళ్లిపోవడం క్షణాల్లో జరిగాయి.

శిరీష షాక్‌కి గురయినట్లు అక్కడే ఇసుకలో మోకాళ్ల మీద కూలబడి పోయింది.

కనుచూపు మేర ఎవరూ లేరు. పడ

**కొత్తగాలి...**

**డాలర్ల సాగుకోసం యువత**
**విదేశాలకు వలస**
**అమ్మానాన్నల భవితకు**
**స్వదేశంలో ఉందా భరోసా?!**

– కుమారి పుల్లాభొట్ల,
రాజమండ్రి

వలు, పల్లెకారులూ లేకపోవడంతో సముద్రతీరమంతా నిర్జనంగా కనిపిస్తోంది.

మరునిమిషంలో తేరుకున్న శిరీష బాలుని చూస్తూ లేచి నిలబడింది.

"శిరీషా!" అన్నాడు కంగారు..

"వాళ్ళని గుర్తుపట్టావా బాలు? ఎప్పుడైనా చూశారా? " అని అడిగింది.

"లేదు.. చూడలేదు" అన్నాడు.

నేను చూశాను! ఎక్కడో తెలుసా? " స్థిరమైన ధ్వనితో అంది.

ఆమె వైపు ప్రశ్నార్థకంగా చూశాడతను.

"స్వప్న వాళ్ళింటికి వచ్చాను ఒక సాయంత్రం గుర్తుందా? అప్పుడు చూశాను. కాలనీలో మెయిన్‌రోడ్‌లో ఉన్న టీస్టాల్ దగ్గర కనిపించారు. వీళ్ళు.. ఇంకా మరికొందరు. మార్నింగ్ ఆటోలో వచ్చిన నేను మెయిన్ రోడ్‌లో దిగి మీ రూమ్‌కి నడుచుకుంటూ వచ్చాను. వీళ్లిద్దరూ అదే టీస్టాల్ దగ్గర ఉండి నన్ను గమనించారు. వాళ్ళు. మీ ఏరియా వాళ్ళే. మీకు తెలీదా? " అడిగింది శిరీష.

అలా అనగానే.. ఒకరోజు స్వప్నని గొడవ చేసిన సందీప్ గుర్తొచ్చాడు బాలుకి. ఆ తర్వాత తనే వరండా రూమ్‌లోకి అద్దెకు వచ్చానని వాళ్ళకి తెలిసి, కక్షతో తన కోసం వచ్చిన శిరీష మీద ఇలా ఎటాక్ చేశారా? అనిపించింది.

"సరే! మంచి మూడ్‌ని పాడు చేశారు వెధవలు! పద వెళ్లిపోదాం!" అంటూ వెనక్కి తిరిగింది శిరీష.

ఫామ్‌హౌస్‌లోని కారు తీసుకొని ఇంటికి బయల్దేరింది శిరీష. ఆమె వెనకే బైక్‌మీద ఫాలో అయ్యాడు బాలు.

కాలనీలో బస్టాప్ దగ్గర స్కూల్‌కి వెళ్తున్న అనిల్ ఎదురయ్యాడు.

"బాలు! పొద్దుటే ఎక్కడికి వెళ్ళావసలు? " అడిగాడు.

ఓ ఫ్రెండ్ వస్తే డ్రాప్ చేయడానికి వెళ్ళా!" అన్నాడు.

"సరే! స్కూల్‌కి వెళ్తున్నాలే! ఇందాక అక్క ఫోన్ చేసింది" చెప్పాడు.

అనిల్ ఆ మాట అనగానే గుండె ఒక్కసారిగా ఝల్లుమంది బాలుకి. "ఎప్పుడు? " ఆత్రుతగా అడిగాడు.

"ఇందాక.. నువ్వు లేనప్పుడు. కేరళలో ఉన్నారట. కాసేపు మాట్లాడింది. నిన్ను అడిగింది రూమ్‌లో లేడు.. లాక్ వేసుందని చెప్పాను" అన్నాడు.

అంతే! సముద్రతీరంలో స్వప్ననే తలుచుకుంటూ, ఆమెకి ఫోన్ చేయాలని ప్రయత్నించిన సమయంలో.. స్వప్న ఇంటికి ఫోన్ చేసి, తన గురించి అడిగిందనిపించింది బాలుకి.

"మళ్ళీ నైట్ ఫోన్ చేస్తానంది" అంటూ ఏదో వెతుకుతున్నట్లుగా బాలు కళ్ళలోకి చుశాడు అనిల్.

ఇక ఏమీ మాట్లాకుండా బైక్‌ని ముందుకి పోనిచ్చాడు బాలు.

అప్పుడతనిలో స్వప్న మీద దిగులు, బెంగ కలిగాయి. స్వప్న ఎలా ఉంది? ఏం చేస్తూంటుంది? ' అనుకున్నాడు.

★ ★ ★

కేరళ టూర్‌లో ఉందన్న మాటే కానీ, స్వప్న మనసు మాత్రం ఇంటి చుట్టూ, బాలు చుట్టూ ఆలోచనల దారాన్ని అల్లుకుంటోంది.

ప్రకృతి అందాల్ని తిలకిస్తూ క్లాస్‌మేట్స్

అందరూ ఆనందంగా ఎంజాయ్ చేస్తుంటే.. స్వప్న మాత్రం అందరిలో కల వలేకపోతోంది. అందరితో మొక్కుబడిగా నవ్వుతూ మాట్లాడుతోంది కానీ మాటలు, నవ్వుల మధ్య మళ్లీ ఆలోచనల దారం చుట్టుకుంటూనే ఉంది మనసుని.

మనసు పొరల్లో జ్ఞాపకాలు. జ్ఞాపకాలు, ఆలోచనలలో బాలు! బాలు! బాలు!

ఎవరి వలన నీ సుఖం, ఆనందం రెట్టింపవుతాయో, ఎవరి కోసం నీ దుఃఖం, వేదన వందరెట్లవుతుందో.. ఆ వ్యక్తి మీద నీకు ఉండేది ప్రేమ తప్ప, మరేమీ కాదు- అని ఎక్కడో చదివింది తను. ఈ కాసిన్నిరోజులకే తను ఇంత డల్‌గా, దిగులుగా మరిపోయిందంటే.. బాలు మీద తనకు ఉన్నది ప్రేమేనా? అనే ఆలోచన కలిగింది స్వప్నకి.

లోకంలో ఎంతోమంది ఉండగా.. ఎందరో పరిచయస్తులు, స్నేహితులూ ఉండగా.. వాళ్ళెవరి మీదా కలగని ఫీలింగ్.. కేవలం బాలు మీదే ఎందుకు కలుగుతోంది తనకు? అతను శిరీషతో కాస్తంత క్లోజ్‌గా ఉంటేనే భరించలేనంత కోపం, పొసెసివ్‌నెస్ తనలో ఎందుకు కలుగుతున్నాయి?.. స్వప్న ఆలోచన ఎంతకీ తెగలేదు.

అసలు.. ఈ పదిరోజుల్లో మాట్లాడుకోకుండా ఉండాలనే కండిషన్ ఎందుకు పెట్టింది తను? అనిపించింది అప్పుడు.

బాలు కూడా ఈ కండిషన్‌కి ఎలా ఒప్పుకున్నాడు? మాట్లాడకుండా ఎలా ఉండగలుగుతున్నాడు? అతను అందరితో, శిరీషతో మాట్లాడుతూ సరదగా, హ్యాపీగానే ఉన్నాడా? నన్ను మర్చిపోయాడా?

స్వప్నకి ఏడుపొచ్చింది.

హిమజ ఇది గమనించింది.

"ఏయ్! స్వప్న! ఏమయిందే? ఏడుస్తున్నావెందుకు? " అంటూ భుజం మీద చెయ్యేసింది.

తేరుకున్న స్వప్న - చెంపల నుంచి జారుతున్న కన్నీళ్ళని చేత్తో తుడుచుకుంది.

"ఏంలేదు.. ఏంలేదు! కంట్లో ఏదో నలక పడిందిలే!" చెప్పింది.

"కాదు! చెప్పు! ఇంటి మీద బెంగపడ్డావా? ఏమయింది? ఒంట్లో బాగా లేదా? " భుజాల చుట్టూ చేతులేసి అనునయంగా అడిగింది హిమజ.

"అబ్బా! ఏం లేదు అన్నా కదా! ఇదిగో చూడు! నవ్వుతున్నాను! చాలా? " అంది.

"సరే!" అంటూ పడవ పందాలు చూడసాగింది హిమజ.

ఆమె అటు తిరగగానే.. స్వప్నకి చెప్పలేనంత దిగులు, ఉక్రోషం కలిగాయి.

చప్పున ఫోన్ తీసి, బాలు నెంబర్‌కి కాల్ చేయబోయింది. కనెక్ట్ అవబోయే ముందు 'బీప్' 'బీప్' అనే శబ్దం వినిపించగానే.. గుండెలో ఏదో హోరు! ముఖంలో ఆవిర్లు చిమ్మడం తెలుస్తోంది. వెంటనే తాము విధించుకున్న కండిషన్ కళ్ళ ముందు నిలబడింది.

'వద్దు.. వద్దు..' అనుకుంటూ వెంటనే కాల్ డిస్‌కనెక్ట్ చేసింది. బాలు నెంబర్‌కి చేరబోతున్న ఫోన్‌కాల్ ఆగిపోయింది.

ఇంతలో "ఈ రోజు మన బ్రేక్‌ఫాస్ట్, లంచ్.. అన్నీ హౌస్‌బోట్‌లోనే, పదండి!" అబ్బాయిలు వచ్చి తొందరచేశారు.

మిగతా అమ్మాయిలతో పాటూ నడిచింది స్వప్న.

★ ★ ★

మధ్యాహ్నం లంచ్ టైములో పిలిచిన శిరీష భోంచేస్తుండగా చెప్పింది-

"బాలూ! ఆ రోజు ఫామ్‌హౌస్‌లో పాటలు పాడారు కదా! బ్యాండ్‌మాస్టర్ బాగా మెచ్చుకున్నాడు. తర్వాత కాల్‌చేసి, బార్-బీ-క్యూలో నెల రోజుల పాటూ రోజూ రాత్రి ఏడు నుంచి నాలుగు గంటల సేపు.. మ్యూజిక్ కన్సర్ట్‌కి ఒప్పుకున్నాడట!

అతను డీజేగా కూడా చేస్తుంటారు. మంచి సింగర్ కావాలని- ముఖ్యంగా వీకెండ్ డేస్‌లో! మిమ్మల్ని పాడతారేమో అడగమన్నాడు" అంది.

"నేనా? పబ్లిక్‌గా? ఆ రోజు మీరు బలవంతం చేశారు కాబట్టి తప్పలేదు. నావల్ల కాదు.. సారీ!" చెప్పాడు.

"మంచి రెమ్యునరేషన్, స్పెషల్ కవర్స్ ఇలా చాలా ఉంటాయి. సింగర్.. సైలెంట్‌గా ఉండకూడదు. అప్పుడప్పుడు పాటలు పాడుతుంటేనే కళని బతికించినట్లవుతుంది. ప్లీజ్..! నా కోసం ఆ రోజు ఒప్పుకున్నట్లుగా.. దీనికి కూడా.. ప్లీజ్ బాలు!" రిక్వెస్ట్ చేసింది శిరీష.

"సరే..!" చెప్పాడు.

"థాంక్యూ బాలూ! నా మాట నిలబెట్టావ్! థాంక్యూ..!" అంటూ అతని చెయ్యి పట్టుకుని ఊపేసింది.

ఆ రోజు సాయంత్రం ఇంటికి బాగా త్వరగా చేరుకున్నాడు. శిరీష చెప్పినట్లుగా బార్-బీ-క్యూలో డీజేని కలవాలని నిశ్చయించుకున్నాడు. రాత్రి లేట్‌గా పాటలు పాడి.. స్వప్న జ్ఞాపకాల నుంచి.. ఆమె టూర్ నుంచి వచ్చేలోపల కాస్త రిలీఫ్ పొందాలనేది అతని ఆలోచన.

జానకమ్మతో దేనికో గొడవపెట్టుకుని, ఆమె మాట వినకుండా ఫ్రెండ్స్‌తో గ్రౌండ్‌కి వెళ్తున్న అనిల్ ఎదురయ్యాడు. వాడి వెనకాల వరండాలోకి వచ్చిన జానకమ్మకి అప్పుడే లోపలికి వచ్చిన బాలు కనిపించాడు. దాంతో ఆమెకు ప్రాణం లేచివచ్చినట్లయింది.

"త్వరగా వచ్చావేంటి బాలూ? " అంది.

"వేరే పని ఉంది బామ్మగారు! ఒకరిని కలవడానికి వెళ్ళాలి!" చెప్పాడు.

అతనికి చెబుదామా? వద్దా? అని కొన్నిక్షణాలు ఆలోచించింది జానకమ్మ.

"బాలూ! చిన్నపని ఉంది! అనిల్‌గాడిని అడిగితే కాదని చెప్పి వెళ్ళాడు" అంది.

"చెప్పండి బామ్మగారు!" అన్నాడు.

"లోపల హాల్లో చిన్న అటకలాంటిది ఉంది బాలూ! దాని మీద చిన్న వస్తువు.. స్టాండ్‌లా ఉంటుంది. బుక్ పెట్టుకుని చదువుకుంటాం! పైకి ఎక్కి కొంచెం వెతికి పెట్టాలి" చెప్పింది.

"ఎక్కడ? చెప్పండి! తీస్తాను" అని లోపలికి ఆమె వెనకాలే నడిచాడు బాలు.

అటక ఎలా ఎక్కాలో చూపించింది. చిన్న నిచ్చెన కూడా ఇచ్చింది జానకమ్మ.

అటక మీదకి ఎక్కి జానకమ్మకి కావాల్సిన వస్తువు కోసం వెతకడం మొదలుపెట్టాడు బాలు. ఎక్కడా కనిపించలేదు.

"అక్కడ పెద్ద ట్రంక్‌పెట్టె ఉంటుంది చూడు! అందులో వుందేమో? " కింద నుంచి చెప్పింది.

పెన్‌టార్చ్‌ని నోటితో పట్టుకుని ట్రంక్‌పెట్టె ఓపెన్ చేశాడు. లోపలంతా ఏవో పాత ఫొటోలు.. ఎక్కువభాగం బ్లాక్ అండ్ వైట్‌వి ఉన్నాయి. పైన జానకమ్మ ఫొటో, రంగనాథ్ స్కూల్ ఫొటోలు, గ్రూప్ ఫొటోలు.. చాలా ఉన్నాయి.

"ఇందులో లేదు బామ్మగారు! అన్నీ ఏవో ఫొటోలు, బొమ్మలు ఉన్నాయి" చెప్పాడు.

జానకమ్మలో నిరాశ కనిపించిది.

ట్రంక్‌పెట్టె మూత వేయబోతున్న బాలుని అందులోని ఒక ఫొటో ఆకర్షించింది. దళసరి కార్డ్‌బోర్డు అట్టమీద అతికించిన ఓ అమ్మాయి ఫొటో అది. బ్లాక్ అండ్ వైట్. కోలముఖం, తీర్చిదిద్దినట్లు కనుబొమలు, నుదురు, చురుగ్గా, ఆకర్షణీయంగా కళ్ళు, చిన్నముక్కు.. ఎవరిదీ ఫొటో? - అనుకుంటూ..

"బామ్మగారూ! ఈ ఫొటోలో ఉన్నది ఎవరండీ? " కింద నిలబడి ఉన్న జానకమ్మని అడిగాడు ఫొటోని పైకెత్తి చూపిస్తూ.

"నాకు కనిపించడం లేదు బాలు! ఇటు

# పర్యావరణ విశేషాలు




నేడు రీసైక్లింగ్‌కి ఎంతో ప్రాధాన్యత ఉంది. లోహం, ప్లాస్టిక్, పేపర్ మొదలైన వాటిని చాలా దేశాలు రీసైక్లింగ్ చేస్తున్నాయి. వాటి గురించిన కొన్ని విశేషాలు..

★ ఒక టన్ను కాగితాన్ని రీసైక్లింగ్ చేస్తే (తిరిగి ఉపయోగిస్తే) 682.5 గాలన్ల చమురుని, 7 వేల గాలన్ల నీటిని ఆదా చేయొచ్చు.



★ ఏటా అమెరికాలో టాయ్‌లెట్ పేపర్ కోసం 27 వేల వృక్షాలను వినియోగిస్తున్నారు.

★ ప్రపంచంలోని 95శాతం సమాచారం కాగితాల్లోనే ఉంది. దాంట్లోని చాలా భాగం ఎవరూ చదవరు.

★ ఓ ప్లాస్టిక్ బాటిల్‌ని రీసైకిల్ చేస్తే ఆదా అయ్యే విద్యుచ్ఛక్తితో 60 వాట్ బల్బును 6 గంటలు వెలిగించొచ్చు.

★ అమెరికాలో గంటకు రెండు కోట్ల యాభై లక్షల ప్లాస్టిక్ బాటిల్స్‌ని పారేస్తున్నారు. ఒక్కోటి భూమిలో కలిసిపోవడానికి ఐదు వందల ఏళ్లు పడుతుంది.

★ వేలకొద్దీ జలచరాలు ప్లాస్టిక్‌బ్యాగులను జెల్లీఫిష్‌లనుకుని మింగి మరణిస్తున్నాయి.

★ ఏటా అమెరికన్స్ ఉపయోగించే సోడా డబ్బాలు, సీసాలను వరుసగా పేర్చితే చంద్రుడి దగ్గరకు ఇరవై సార్లు వెళ్లి వచ్చేంత దూరం వస్తాయి.

★ ఓ అల్యూమినియం డబ్బాని రీసైకిల్ చేస్తే ఆదా అయ్యే విద్యుచ్ఛక్తితో ఐపాడ్‌లో ఓ ఆల్బం మొత్తం వినొచ్చు.

★ ఓ టన్ను ప్లాస్టిక్‌ని రీసైకిల్ చేస్తే 2 వేల గాలన్ల పెట్రోల్‌ని ఆదా చేయొచ్చు.

★ 2015 నుంచి న్యూయార్క్ పౌరులు తమ పాత ఎలక్ట్రానిక్ వస్తువులను (టి.వి., కంప్యూటర్ మొదలైనవి) రీసైకిల్ చేయకపోతే 100 డాలర్ల ఫైన్ కట్టాలి.

★ ఫిన్‌లాండ్‌లో ప్రతి పది ప్లాస్టిక్ బాటిల్స్‌లో తొమ్మిది రీసైకిల్ అవుతున్నాయి. గ్లాస్ బాటిల్స్ వంద శాతం రీసైకిల్ అవుతున్నాయి.

★ అల్యూమినియంని రీసైకిల్ చేస్తే 95శాతం విద్యుచ్ఛక్తి ఆదా అవుతుంది.

★ రీసైకిల్‌కి వెళ్లిన అల్యూమినియం డబ్బా తిరిగి 60 రోజుల్లో మార్కెట్‌లోకి వస్తుంది.

---

పడేయ్! చూస్తాను!" అంది.

దాంతో చేతిలోని ఫొటోని బామ్మగారికి దగ్గరగా నేలమీద పడేలా నెమ్మదిగా విసిరాడు బాలు.

బోర్లాపడిన ఆ ఫొటోని వంగి తీసింది జానకమ్మ. ఆ ఫొటోలో ఎవరున్నారో చూడడానికి తనవైపు తిప్పగానే.. అందులో ఉన్న అమ్మాయిని చూసి, శిలా విగ్రహంలా నిలబడిపోయిందామె.

పైట చెంగుతో ఫొటో మీద దుమ్మును ప్రేమతోను, ఓదార్పుగాను తుడిచింది. అప్పుడామె కళ్ళలో తెలీని వెలుగు.. ముఖంలో ఆనందం.. బాలుకి స్పష్టంగా కనిపించాయి.

"కిందకి వచ్చేస్తాను. ఆ ఫొటో ఇవ్వండి - లోపల పెట్టేస్తా.." అని బాలు అంటుండగా, అదే సమయానికి ఆఫీసు నుంచి వచ్చిన రంగనాథ్ హాల్లో అడుగు పెట్టాడు.

కొడుకు రావడం గమనించిన జానకమ్మ, రెండు చేతులతో ఆ ఫొటో పట్టుకుని అలాగే చూస్తూండిపోయింది.

అటక మీద బాలుని, ఫొటో పట్టుకున్న జానకమ్మని చూసిన రంగనాథ్ "ఏంటమ్మా అది? ఎవరి ఫొటో?" అంటూ జానకమ్మ దగ్గరికి వెళ్ళాడు.

సడన్‌గా కొడుకు గొంతు వినగానే

ఆవిడ ఉలిక్కిపడింది. కంగారుగా "ఏంలేదు.. ఏంలేదు" అంటూ అక్కడ్నుంచి కదలబోయింది. ఇంతలో ఆ ఫొటోని రంగనాథ్ చూశాడు.

"ఏదీ..! ఇటివ్వు!" అంటూ జానకమ్మ చేతుల్లోంచి ఫొటో అందుకున్నాడు. చూడగానే, రంగనాథ్ కనుబొమలు ముడిపడ్డాయి. ఒక చేత్తో ఆ ఫొటోని పట్టుకుని.. "ఎవరు తీశారిది? ఎక్కడో అటక మీద పారేశాను. మళ్ళీ బయటికి తీశారెందుకు? అప్పుడే తగలబెడతాను అంటే.. ఒప్పుకోకుండా దాచిపెట్టావు! ఇప్పుడెందుకు తీయించావు..? " అంటూ అటకపైకి చూశాడు రంగనాథ్.

ముఖం, కళ్ళు కోపంతో ఎర్రగా మారాయి.

పైన కూర్చున్న బాలుకి కాస్త భయమేసింది. రంగనాథ్‌లో ఇంత కోపం ఎప్పుడూ చూడలేదతను.

"నేనే ఎక్కమన్నాను! అతని తప్పేం లేదులే! బుక్ పెట్టుకునే స్టాండ్ కోసం పెట్టెలో వెతుకుతుంటే ఈ ఫొటో కనిపిస్తే ఇచ్చాడు.. అంతే! నాకివ్వు ఫొటో.." అంటూ రంగనాథ్ చేతిలోంచి ఆ ఫొటోని లాక్కుంది జానకమ్మ.

బాలు ముందు తనని తాను బహిర్గతం చేసుకోవడాన్ని ఇష్టపడని రంగనాథ్, కోపాన్ని కంట్రోల్ చేసుకున్నాడు.

"మళ్ళీ ఆ ఫొటో నా కళ్ళకి కనిపిస్తే ఈసారి బూడిద చేస్తాను" చెప్పి బెడ్‌రూమ్‌లోకి వెళ్ళిపోయాడు. బాలుకి ఈ సన్నివేశం గందరగోళంగా అనిపించింది. ఇన్నిరోజులుగా చూస్తున్నాడు- ఈ కుటుంబంలో ఎవరికీ కోపతాపాలూ, ఇలా అరుపులు చూడలేదు. తను అనుకోకుండా ట్రంక్ పెట్టెలోంచి బయటికి తీసిన ఎవరో అమ్మాయి ఫొటో.. ఇంత గందరగోళానికి దారితీసిందేమిటా? అని ఆలోచించాడు. ట్రంక్ పెట్టెని మూసేసి కిందకి దిగాడు.

బాలుని వెళ్ళమన్నట్లుగా సైగ చేసింది జానకమ్మ. అప్పుడామె కళ్ళు నీళ్ళతో నిండి ఉండడం కనిపించింది.

"బాలూ..! ఈ ఫొటోని నీ రూమ్‌లో భద్రంగా ఉంచు! ఈసారి కనిపిస్తే కాల్చి బూడిద చేస్తాడంట! నాకంటూ మిగిలింది ఇదొక్కటే.." కళ్ళలో మళ్ళీ నీళ్ళు ఆమెకి.

జానకమ్మని చూస్తే బాలుకి బాధ కలిగింది. ఎప్పుడూ నవ్వుతూ, సరదాగా మాట్లాడుతుండే ఆవిడ సడన్‌గా ఇంత బేలగా మారిపోయిందేంటి? అనిపించింది. ఆమె చేతుల్లోని ఫొటో అందుకున్నాడు బాలు.

"ఎక్కడన్నా లోపల పెట్టు బాలు!" అంది జానకమ్మ.

తన టేబుల్ మీద ఉన్న పెద్ద పుస్తకంలో దాచి "బామ్మగారూ! ఈ ఫొటో ఎవరిది? అంకుల్‌కి అంత కోపం ఎందుకొచ్చింది దీన్ని చూడగానే? " అడిగాడు.

అప్పుడు జానకమ్మలో ఎప్పటి జ్ఞాపకమో? పేగుబంధమో? ఒక్కసారిగా కదిలినట్లయింది. చిన్నపాటి వెలుగు ఆమె కళ్ళలో కనిపించింది.

"తను- నీలిమ! నా కూతురు! నా రక్తం పంచుకు పుట్టిన కూతురు! రంగనాథ్‌కు స్వయానా చెల్లెలు" అంది.

బాలుకి ఈ మాటలు షాకింగ్‌గా అనిపించాయి.

"మీ కూతురా? మరి ఎప్పుడూ చెప్పలేదేం? స్వప్న, అనిల్ కూడా ఎప్పుడూ చెప్పలేదు" అన్నాడు.

"వాళ్ళకి తెలీదు! ఎప్పుడో పాతిక సంవత్సరాల ముందే.. నీలిమకీ, ఈ కుటుంబానికీ బంధం తెగిపోయింది! కాలేజీలో చదివే రోజుల్లో ఫొటో ఇది" అంది.

బాలుకి అయోమయంగా అనిపించింది.

"అసలేమయింది బామ్మా? ఆమె ఇప్పుడెక్కడున్నారు? ఎందుకు వెళ్ళిపోయారు? ఏం జరిగింది? " అడిగాడు.

"ఇప్పుడేమీ చెప్పలేను బాలు! తీరిగ్గా చెబుతాను! ఈ సంగతి స్వప్న, అనిల్ కి మాత్రం చెప్పకూడదు..!" అంది.

"చెప్పను! మీరలా డల్ గా ఉండొద్దు బామ్మా! ప్లీజ్..! " అన్నాడు.

చిన్నగా తలూపి రూమ్‌లోంచి బయట కెళ్ళిపోయింది జానకమ్మ.

రూమ్‌కి లాక్‌వేసి బయటకి వెళ్తూ నీలిమ ఫోటోని మర్చిపోయి, స్వప్నని తల్చుకోవడం మొదలుపెట్టాడు బాలు.

కానీ, ఇప్పుడెక్కడుందో తెలీని 'నీలిమ' అనే వ్యక్తివల్ల కొన్ని జీవితాలు ప్రభావితం కాబోతున్నాయని, అందులో తనది కూడా ఒకటని బాలుకి ఆ క్షణంలో తెలియదు.




**బా**ర్-బి-క్యూ సిటీలోని ఫేమస్ రెస్టారెంట్! రాత్రి పదకొండు వరకు డ్రింక్స్, ఫుడ్ సర్వ్‌చేసే బార్ కం రెస్టారెంట్ అది.

"మీరు ఆ రోజు చాలా బాగా పాడారు మిస్టర్ బాలూ! శిరీష మేడమ్ ఫ్రెండ్ అని తర్వాత తెలిసింది. ఇక్కడ మా ట్రూప్‌కి ఛాన్స్ ఇచ్చారు. మీరు కూడా మాతో కలిస్తే.. సిటీలో మన బ్యాండ్‌కి మంచి పేరు వస్తుంది" చెప్పాడు డీజె స్టీఫెన్.

నవ్వి ఊరుకున్నాడు బాలు.

"ఈ రోజు ఎలాగూ టైమ్‌కి వచ్చారు. మంచి మ్యూజిక్ ట్రాక్స్ ఉన్నాయి మన దగ్గర. జస్ట్ ఒక్క గంట మీకు తోచిన పాటలు పాడండి బాలు. మంచి ఆడియన్స్ ఉన్నారు. మంచి డ్రింకర్స్ మాత్రమే కాదు.. మంచి టేస్ట్ కూడా ఉంటుంది వీళ్ళకి.. ప్లీజ్!" అంటూ చేతికి మైక్ అందించాడు. అప్పుడతనికి స్వప్న గుర్తొచ్చింది. వెంటనే శిరీష కూడా! హృదయం ఉన్న ప్రతి ఒక్కరూ ప్రేమించక తప్పదు. గాయకుడు అన్న ప్రతి ఒక్కరూ పాడుతుండటం తప్పదు.

"ఓకే!" అన్నాడు.

కంప్యూటర్ దగ్గరున్న మ్యూజిక్ ట్రాక్ ఆపరేటర్‌తో తను పాడబోయే పాటల గురించి చెప్పి- డయాస్ మీదకి వెళ్ళి నిలబడ్డాడు బాలు.

మ్యూజిక్ మొదలయింది. హమ్ చేస్తూ మొదటి పాట అందుకున్నాడు. బీర్-బీ-క్యూలో అన్ని టేబుల్స్ నిండిపోతున్నాయి. డ్రింక్స్, తందూరీలు ఎగిరిపోతున్నాయి. ఒకపాట తర్వాత మరొక పాట.. అలా పాడుతున్నాడు బాలు.

★ ★ ★

అలా హిందీపాట పాడుతూ మధ్య గ్యాప్‌లో తల ఊపుతూ యథాలాపంగా మెయిన్ ఎంట్రెన్స్ వైపు చూసిన బాలుకి.. లోపలికి వస్తున్న రంగనాథ్ కనిపించాడు. ఆయనతో పాటు మరొక స్నేహితుడు కూడా. ఇద్దరూ ఒక కార్నర్‌లో ఉన్న టేబుల్ దగ్గరకెళ్ళి కూర్చున్నారు.

డయాస్ మీదున్న బాలుకి రంగనాథ్ క్లియర్‌గా కనిపిస్తున్నాడు. రంగనాథ్ మానసికంగా డిస్టర్బ్ అయ్యాడని అర్థమైంది. కారణం- అటక మీద నుంచి తను తీసిన ఫొటో అనుకున్నాడు. రక్తం పంచుకు పుట్టిన చెల్లెల్ని రంగనాథ్ ఎందుకు అంతగా ద్వేషిస్తున్నాడనేది బాలుకి అయోమయంగా అనిపించింది.

పాతికేళ్ళ కిందట ఈయన కుటుంబంలో ఏం జరిగింది? చెల్లెలి ఫొటోని కూడా భరించలేని స్థితికి రంగనాథ్

ఎందుకు చేరుకున్నాడు? బాలుని ప్రశ్నలు చుట్టుముట్టాయి.

గంట దాటింది. అనుకున్నదానికన్నా ఎక్కువసేపే పాడాడు బాలు.

మ్యూజిక్ సెషన్ ముగించాక డీజె స్టీఫెన్ బాలుకి అభినందనలు చెప్పి ఒక కవర్ అందించాడు. అందులో చూస్తే అయిదువందల నోట్లు!

రంగనాథ్ తన స్నేహితునితో కలిసి టేబుల్ దగ్గర్నుంచి లేచాడు. మామూలు కన్నా ఆ రోజు ఎక్కువ లిక్కర్ తీసుకున్న ఆయన రిసెప్షన్ దాటుతూ అక్కడున్న బాలుని గుర్తుపట్టి చెయ్యి ఊపి పిల్చాడు.

ఒకరకంగా ఇందుకోసమే ఎదురుచూస్తున్న బాలు, రంగనాథ్ దగ్గరకి వెళ్ళాడు.

"ఇక్కడున్నావేంటి బాలూ? నా కోసం వచ్చావా? " అడిగాడు రంగనాథ్.

"లేదండీ! ఇక్కడ పాటలు పాడమని మా ఫ్రెండ్ అడిగితే వచ్చాను. రండి! వెళ్దాం..! ఇంటికే కదా? " అన్నాడు

బాలు చెయ్యి విదిలించుకుని "పాటలు..! ఇంతసేపు పాడింది నువ్వేనా? " ఆశ్చర్యంగా అడిగాడు రంగనాథ్

ముగ్గురూ రోడ్ మీదికి వచ్చారు.

"ఎలా వచ్చారు? " అడిగిన బాలుకీ.. కారు కీస్ ఇచ్చి నవ్వాడు రంగనాథ్

దాంతో తను రంగనాథ్‌ని భద్రంగా కారులో ఇంటికి తీసుకెళ్లక తప్పదని బాలుకి అర్థమైంది. ఇద్దరూ కారెక్కి కొంత దూరం వెళ్లాక రంగనాథ్ స్నేహితుడు దిగిపోయాడు.

తర్వాత కాలనీ రోడ్డులో ముందుకు పోనిచ్చాడు బాలు.

"ఇప్పుడు చెప్పు! ఇక్కడ పాటలు పాడడం ఎందుకు? " అడిగాడు రంగనాథ్.

"ఫ్రెండ్ కోరిక కాదనలేక"

రంగనాథ్ విచిత్రంగా చూశాడు.

కాసేపు ఆగి "సారీ బాలూ! సాయంత్రం నిన్ను తిట్టాను.. కోపంగా మాట్లాడాను" అన్నాడు రంగనాథ్.

ఏమీ తెలియనట్లుగా "నన్నెప్పుడు తిట్టారసలు? " అన్నాడు బాలు.

"అదేనోయ్! అటక మీంచి ఫొటో తీశావని కోప్పడ్డా కదా!" అన్నాడు.

"అదా..! ఫర్లేదులేండి!" చెప్పాడు బాలు.

కిటికీ అద్దాల్లోంచి బయటికి చూస్తూ "బాలూ! ఇప్పుడు మనం ఎటు వెళ్తున్నాం? " రంగనాథ్ అడిగాడు.

"ఇంటికెళ్తున్నాం!" చెప్పాడు

"కారాపు! కాసేపు ఆగి వెళ్దాం బాలు! ఎక్కడన్నా విశాలంగా ఉన్నచోట ఆపు..!" చెప్పాడు రంగనాథ్.

మూసి ఉన్న ఓ షాపింగ్ మాల్ ముందున్న పార్కింగ్ స్పేస్‌లో కారు ఆపాడు బాలు. కొన్ని క్షణాలు సీట్లోనే కదలకుండా కూర్చున్నాక..

"బాలూ..! ఆ ఫొటో ఎవరిదో నీకు తెలీదు!" అన్నాడు రంగనాథ్.

బాలు ఇది ఊహించాడు. రంగనాథ్ మనసు అల్లకల్లోలంగా మారిందనీ, సాయంత్రం నుంచీ చుట్టుకున్న డిప్రెషన్‌ని తగ్గించుకోవడానికి.. గత జ్ఞాపకాల్ని కళ్ళముందు తరచి చూసుకుంటాడని, మరొకరితో పంచుకుంటాడని తెలుసు.

"ఆ ఫొటోలో ఉన్నది నీలిమ! నా చెల్లెలు. రక్తం పంచుకు పుట్టింది" మరుగున పడిపోయిన గతాన్ని, జ్ఞాపకాల్ని వెలికి తీసుకుంటూ చెప్పడం ప్రారంభించాడు రంగనాథ్.

"పాతికేళ్లు దాటింది, ఇదంతా జరిగి..! మేమిద్దరం ఎంతో ప్రేమగా ఉండేవాళ్లం! నాన్న చిన్నప్పుడే చనిపోతే, అమ్మ జాగ్రత్తగా పెంచింది మమ్మల్ని. నేను చెల్లెలి పట్ల అంతకన్నా ఎక్కువ జాగ్రత్త తీసుకునేవాడ్ని. నా దగ్గర ఏ విషయమూ దాచిపెట్టేది కాదు! అలాంటిది.. నాకు తెలీకుండా ఒకపని చేసింది. తర్వాతెప్పటికో నాకు చెప్పింది. అది ఏంటో తెలుసా? " చెప్పడం

ఆపాడు రంగనాథ్.

రంగనాథ్ ముఖం చీకట్లో సరిగా కనిపించలేదు. లేకపోతే అప్పుడతని కళ్ళలో నీటితెరని చూడగలిగేవాడు బాలు.

"నీలిమ తన క్లాస్‌మేట్‌ని ప్రేమించింది. ఎంతగా అంటే.. అతడిని తప్ప మరొకరిని పెళ్ళి చేసుకోను! అనేంతగా! అర్థమయిందా? " చెప్పాడు రంగనాథ్

ఈ మాటలు బాలు గుండె లోపల ఎక్కడో ముల్లులాగ గుచ్చుకున్నాయి. అతను షాక్ అయ్యాడు.

"తర్వాతెప్పుడో ఎవరో చెప్తే తెలిసింది. చివరికి ఒకరోజు అతడిని ఇంటికి తీసుకొచ్చి పరిచయం చేసింది. అతడ్ని ప్రేమించానని, పెళ్ళి చేసుకుంటాననీ చెప్పింది. నేను అప్పుడేం చేశానో తెలుసా? ఇద్దర్నీ చంపేస్తానన్నాను. అమ్మ అడ్డం వచ్చింది. అతను వెళ్ళిపోయాక.. నీలిమని తిట్టాను.. కొట్టాను కూడా! అయినా అతడితో తప్ప జీవితం వద్దంది. వారం, రెండు వారాలు ఎదురుచూశాను.. తన అభిప్రాయం మారుతుందని! కానీ.. ఏమీ మారలేదు. నాలో పంతం, పట్టుదల పెరిగాయి. ఒకరోజు మళ్ళీ అతడు ఇంటికొచ్చాడు. నీలిమని ప్రాణంగా చూసుకుంటాను, పెళ్ళి చేయమని ప్రాధేయపడ్డాడు. నేను ఒప్పుకోలేదు. అప్పుడు.. నీలిమ ఏం చేసిందో తెలుసా? నా మాట కాదని, నా ముందే.. నన్ను, అమ్మని వద్దనుకుని.. అతడితో కలిసి ఇంట్లోంచి వెళ్ళిపోయింది. వెళ్లేముందు చెప్పాను.. ఈ రోజు నుంచీ నీకు, నా కుటుంబానికీ ఏ సంబంధంలేదు. మళ్ళీ ఈ గడప తొక్కొద్దు! నువ్వు చనిపోయావనుకుంటా అన్నాను. అప్పుడు నాతో ఏమందో తెలుసా? ప్రేమ గురించి తెలీని, అర్థంచేసుకోని నిన్ను జన్మలో చూడను! అని నాతో తెగేసి చెప్పి వెళ్ళిపోయింది. అంతే..! ఆ రోజు నుంచే నీలిమ గురించి మర్చిపోయాం. ఇన్నేళ్ళుగా తనెక్కడుందో? ఏమైందో? పట్టించుకోలేదు. ఐ

## కొత్తగాలి...

**తడి లేని**
**వరి పైర్లు**
**తడి ఆరని**
**పల్లె కళ్లు!**

– పి. శ్రీనివాసరావు,
అలికం, శ్రీకాకుళం జిల్లా

హేట్ లవ్! 'ప్రేమ' అనే పదం అంటేనే నాకు ద్వేషం. నీలిమ అంటే అసహ్యం!" చెప్పడం ఆపాడు రంగనాథ్.

ఆయన చెబుతున్న ప్రతిమాటా బాలు గుండెని శతఘ్నుల్లా తాకాయి. కారు స్టీరింగ్‌ని చేతులు గట్టిగా పట్టుకున్నాయి.

"కని, పెంచిన పేరెంట్స్‌ని.. కేవలం ఒక అనామకుడి కోసం.. మధ్యలో వచ్చి కలిసిన ఎవడి కోసమో.. అందర్నీ గడ్డిపోచకన్నా హీనంగా వదిలి వెళ్ళడం.. నీలిమకే.. ఈ అమ్మాయిలకే ఎలా సాధ్యమవుతోంది? ఒక్కడి కోసం అందర్నీ ఎలా వదులుకుంది? " ఉద్వేగంతో గొంతు పూడుకుపోయింది రంగనాథ్‌కి.

"పాతికేళ్ళ తర్వాత కూడా.. ఈ అమ్మాయిలు, అబ్బాయిలు ఏమీ మారలేదు బాలు! పెద్దలకి ఇష్టం లేకుండా, తెలీకుండా.. ప్రేమలో పడుతూనే ఉన్నారు! పెళ్ళిళ్ళు చేసుకుంటూనే ఉన్నారు! కొన్నిసార్లు పేరెంట్స్ కూడా ఒప్పుకుంటున్నారు. దీనిని బట్టి చూస్తుంటే పాపం.. పేరెంట్స్‌లో కొద్దిగా మార్పువచ్చింది. కానీ.. వీళ్ళు మాత్రం మారలేదు. స్వార్థం, ప్రేమ.. ఛీ! ఛీ!!" అన్నాడు.

నిశ్శబ్దం పొగమంచులా పరుచుకుంది.

"ఇప్పటికీ నీలిమని ద్వేషిస్తూనే ఉన్నాను. నా పిల్లలకి అసలు నీలిమ

# కొత్తగాలి...

**చీమ**
**శ్రామిక వర్గ జీవి!**
**దోమ**
**దోపిడి వర్గ జీవి!**

*– గుడిమెట్ల గోపాలకృష్ణ,*
*అరసవల్లి*

గురించే తెలీకుండా పెంచాను. ఇన్నాళ్ళూ నేను కూడా మర్చిపోయాను. ఈ రోజు ఫొటో.. తనని గుర్తుచేసింది. ఎక్కువగా డ్రింక్ చేశాను బాలు! ఈ రోజు ఆఖరు ఇలా! మళ్ళీ తాగను! అంతేకాదు.. నీలిమ గురించే ఆలోచించను. ఈ రోజు నుంచి ఆ పేరుని కూడా మర్చిపోతాను!" చెప్పడం ఆపి- సీట్లో బాగా వెనక్కి వాలి కళ్ళు మూసుకున్నాడు రంగనాథ్.

బాలుకి తను వింటున్నది కాసేపటి వరకూ అర్థం కాలేదు. సముద్రపు అలలు ఎగిసిపడి చుట్టుముడితే.. ఎలా ఊపిరి అందదో- అనిపించింది. కెరటం తీరాన్ని తాకి, విసురుగా తిరిగి వెనక్కి వెళ్తుంటే, కాళ్ళ కింద ఇసుక కూడా నీళ్ళతో పాటూ లోపలికి వెళ్ళిపోతుంటే, కాళ్లు రెండూ ఇసుకలో కూరుకుపోయేటప్పుడు కలిగే భయం, ఆందోళన కలిగాయతనిలో.

స్వప్నా! స్వప్నా!! ఎలా.. ఇప్పుడేం చేయాలి?

ఇన్నిరోజులుగా స్వప్నతో స్నేహం, ఇష్టంగా మారి, ప్రేమగా రూపాంతరం చెంది.. ఇద్దరి హృదయాలలో ఒకేవిధమైన ఫీలింగ్‌తో స్పందించడానికి సిద్ధమవుతున్న సమయంలో.. 'ప్రేమ' అనే పదాన్నే నిరసించి, ద్వేషించి, ప్రేమించిన సొంత చెల్లెల్ని వెలివేసి, రక్తసంబంధాన్నే కాదనుకున్న వ్యక్తి.. స్వప్న తండ్రిగా జీవితం ముందు నిలబడితే..! గుండె సవ్వడుల్ని ప్రశ్నిస్తుంటే..! ఏం చేయాలిప్పుడు?

బాలుకి ఏంచేయాలో తెలీలేదు.

జీవితం హఠాత్తుగా తిరిగిన మలుపు ఇది! ఒక మలుపులో స్వప్న- జీవితాన్ని, హృదయాన్ని తాకింది. మరో మలుపు 'నీలిమ' అనే అపరిచిత స్త్రీ ప్రస్తావనతో ప్రేమని ద్వేషించే రంగనాథ్ మాటలు, అంతరంగం- అడుగు ముందుకి వేయకుండా ఆపుతున్నాయి.

మనసంతా బ్లాంక్‌గా మారిపోయిన బాలు కారు స్టార్ట్ చేశాడు.

మరికాసేపట్లో ఇంట్లో ఉన్నారు వాళ్ళు.

ఆ రాత్రి రూమ్‌లో పడుకున్న బాలుకి నిద్ర రాలేదు.

స్వప్నని తలుచుకోగానే ఆమె రూపం కళ్ళలో కనిపించడం ఎంత వాస్తవమో.. ఆమె నిజంగా ఇక్కడలేదు అనేది కూడా అంతే వాస్తవం. ఊహ ఎప్పటికీ అలాగే, ఒక కలలాగానే మిగుల్తుందా?

స్వప్న! అసలు ఆమెను ఎందుకు ఇష్టపడ్డాడు? ఇష్టం ప్రేమగా ఎప్పుడు మారింది? ఎందుకు మారింది? స్వప్నకి కూడా తనంటే ఎందుకు ఇష్టం కలిగింది? ఒకవేళ టూర్‌లో ఉన్న పది రోజులలో తన మీద ఆమెకి ప్రేమ లేదని, ఇష్టం మాత్రమే ఉందని ఆమె గుర్తిస్తే.. అప్పుడు ఇద్దరి మధ్య కేవలం స్నేహం మాత్రమే మిగుల్తుంది.

ప్రేమను ద్వేషించే రంగనాథ్‌కు పుట్టిన స్వప్నకి నా మీద ప్రేమ కలగకూడదు. ఆమె హృదయంలో ఎప్పటికీ ప్రేమ కలగకూడదు. మంచి కుటుంబంలో ఆనందంగా గడిచిపోతున్న స్వప్న జీవితం, ఎప్పటికీ అలాగే ఉండాలి.

ప్రేమని ద్వేషించే తండ్రి.. తన కూతుర్ని పోగొట్టుకోకూడదు. జనరేషన్ మారిన తర్వాత మళ్ళీ గతం పునరావృతం కాకూడదు. స్వప్న కూడా ఈ బాలు

కోసం.. బంగారం లాంటి కుటుంబాన్ని దూరం చేసుకోకూడదు.

వద్దు స్వప్నా! వద్దు! నన్ను ప్రేమించొద్దు! ప్లీజ్! భగవాన్! స్వప్నకి నా మీద ద్వేషం తప్ప 'ప్రేమ' కలగకుండా చేయి తండ్రీ! జీవితంలో ఎలాంటి ఇబ్బందీ, సమస్య రాకుండా ఆమె తన పేరెంట్స్‌తో, బంధాలు, అనుబంధాలతో జీవించాలి..!!

ఊహ తెలిసినప్పటి నుంచీ ఇంతవరకు కన్నీళ్ళు కార్చని బాలు కళ్ళు చెమర్చాయి. గుండెలో సుడులు తిరుగుతున్న విషాదం.. కళ్ళలో కన్నీటి చెలమల్ని పొంగించింది. చెంపల మీంచి ధారగా కారుతున్న కన్నీళ్ళని తుడిచే ప్రయత్నం కూడా చేయకుండా అలాగే ఉండిపోయాడు బాలు.

★ ★ ★

హౌస్ బోట్‌లోని రూమ్‌లో ఉంది స్వప్న. తనతోపాటు ఉన్న అమ్మాయిలు నిద్రలో ఉంటే- స్వప్న మాత్రం మెలకువగానే ఉంది.

ఇంకో మూడు నాలుగు రోజుల్లో ఇంటికి చేరుకుంటుంది. బాలుని త్వరగా చూడాలని బలంగా అనిపించింది. ఈ వారం రోజుల్లో.. తను విధించుకున్న నిబంధనలు.. బాలు అంటే తనకి ప్రేమ అని అర్థమయింది.

వసంతంలో చెట్లు చిగురించక తప్పదు. హృదయం ఉన్నప్పుడు ప్రేమించకుండా ఎలా ఉంటుంది? ఇలా అనిపించగానే డైరీ తీసింది స్వప్న. ఆ రోజు పేజీలో రాయడం మొదలుపెట్టింది.

"డియర్ బాలూ! ఎలా ఉన్నావు?

ఒకరి మీద ఒకరికి ప్రేమ ఎందుకు కలుగుతుంది? విడిపోతామనిపిస్తే చనిపోవాలనేంత బాధ ఎందుకు కలుగుతుంది? ఇన్నేళ్ళు జీవితం గడిచాక నువ్వెందుకు కనిపించావసలు? నువ్వంటే ఇంత ఇష్టం, ప్రేమ ఎందుకు పెరిగాయి?

పొత్తిళ్ళలో పెంచిన అమ్మనీ, గుండెల మీద ఎత్తుకున్న నాన్నని కూడా మర్చిపోయేంతగా.. నిన్ను ఎందుకు ప్రేమిస్తున్నానో నాకు తెలీడంలేదు. 'బ్లడ్ ఈజ్ థిక్కర్ దేన్ వాటర్' అంటారు.

కానీ 'లవ్ ఈజ్ థిక్కర్ దేన్ బ్లడ్' అనిపిస్తోంది? ఎలా ఉన్నావు? ఏం చేస్తున్నావు నువ్వు?

- నీ స్వప్న"

ఇది రాశాక మళ్ళీ మళ్ళీ చదువుకుంది. తామిద్దరి మధ్య ఇన్నాళ్ళుగా జరుగుతూ వచ్చిన సంఘటనలు అన్నీ కళ్ళలో కనిపించాయి. అంతా విచిత్రం అనిపించింది.

ఆ క్షణంలో నిబంధనని పక్కన పెట్టి వెంటనే బాలుకి ఫోన్ చేసి 'ప్రేమిస్తున్నా' అని చెప్పేయాలనిపించింది స్వప్నకి.

వెంటనే కాల్ చేసింది. ఎంతకీ కనెక్ట్ అవని కాల్.. 'అవుటాఫ్ కవరేజ్ ఏరియా' అని చెప్తూ ఎండ్ అయింది. సడన్‌గా డల్‌గా అనిపించింది స్వప్నకు.. వెంటనే డైరీలో..

"బాలూ! నిన్ను ప్రేమిస్తున్నాను!

ఇట్లు,

నీ స్వప్న"

అని రాసి డైరీ మూసింది.

★ ★ ★

స్వప్న విషయంలో స్పష్టత వచ్చిందనుకుంటున్న సమయానికే రంగనాథ్ చెప్పిన నీలిమ కథ.. ఆటంబాంబులాగ పేలింది బాలు ముందు.

పాతికేళ్ళ కిందట ఇదే కుటుంబంలో నీలిమ ప్రేమ ఆరని చిచ్చు రగిల్చింది. మళ్ళీ ఈ జనరేషన్‌లో అదే ఉదంతం పునరావృతమవబోతోందా? ఒకవేళ స్వప్న కూడా తననే ప్రేమిస్తే.. మళ్ళీ ఈ కుటుంబంలో కుదుపు తప్పదా? విచ్ఛిన్నమవుతుందా? అనే ఆలోచన బాలు మనసుని అల్లకల్లోలం చేసింది.

ఆఫీసులో స్థిమితంగా పనిచేసుకోలేకపో

యాడు. ఇంతలో శిరీష నుంచి పిలుపు.

ఛాంబర్‌లోకి వెళ్తే.. "బాలూ! నన్ను క్షమించానని మాటివ్వాలి" అంది శిరీష.

"మీరేం చేశారసలు? సరే! క్షమించాను! చెప్పండి!" అన్యమనస్కంగా అన్నాడు.

"ఏంలేదు! ఆ రోజు మీ రూమ్‌కి వచ్చినప్పుడు ఒక ఉత్తరం దొరికింది. మీకివ్వకుండా తెచ్చేశా!" అంటూ నాలుగు మడతలు పెట్టిన కాగితాన్ని ఇచ్చింది శిరీష.

ఉత్తరం!! దీనివల్లే స్వప్నకీ, తనకీ గొడవ జరగడం గుర్తొచ్చింది బాలుకి.

ఏమీ మాట్లాడకుండా ఆ లెటర్‌ని జేబులో పెట్టుకున్నాడు బాలు.

ఇద్దరి మధ్య కొన్ని క్షణాలపాటు బరువైన నిశ్శబ్దం పేరుకుంది.

అప్పుడన్నాడు బాలు "మిమ్మల్ని ఒకటి అడుగుతాను. క్లియర్‌గా చెబుతారా? "

అతడి మాటలకు శిరీషకి టెన్షన్‌గా అనిపించింది. గుండె వేగంగా కొట్టుకోసాగింది. ఆమె సమాధానం కోసం ఆగకుండా "ఒకరి మీద మరొకరికి ప్రేమ ఎందుకు కలుగుతుంది? " అడిగాడు బాలు.

ఈ ప్రశ్నని ఆమె ఊహించకపోవడంతో షాక్‌కి గురయింది.

"స్నేహం స్నేహంగా- ప్రేమ ప్రేమగానే ఎందుకు ఉండిపోవు? ప్రేమించిన వ్యక్తితో జీవితం లభించదని తెలిస్తే.. బతుకు మీద విరక్తి, నిరాశ ఎందుకు కలుగుతాయి? " నిర్లిప్తంగా అడిగాడు బాలు.

కొన్నిక్షణాలు నిశ్శబ్దంగా ఉండిపోయింది శిరీష. మబ్బులాంటిదేదో విడిపోతున్నట్లుగా ఆమెకి అర్థమవుతోంది. ఊహించింది ఒకటయితే.. వాస్తవం మాత్రం అందుకు భిన్నమని తెలుస్తోంది.

"పరిచయం స్నేహంగా.. అది ఇష్టంగా మారడం తెలుస్తోంది. కానీ.. కానీ.. అది ప్రేమగా ఎప్పుడు, ఎందుకు మారిందో తెలియడంలేదు. ఇంతకు ముందు మీరన్నట్లు ఎవరి జీవితంలో వాళ్ళు ఎప్పటి లాగ ప్రేమతో, ఆనందంతో.. అసలేమీ జరగనట్లు ప్రేమ నిండిన హృదయంతో ఉండగలిగేలా.. ఎందుకు రాజీపడలేం? దీనికి సరైన సమాధానం చెప్పగలరా? " ఇలా అంటున్నప్పుడు బాలు గొంతులోని విషాదం.. శిరీషని కదిలించింది.

ప్రతి ఒక్కరూ జీవితంలో ఒక్కసారైనా ప్రేమించక తప్పదు! ఆ ప్రేమ ఫలించడానికి మాత్రం యాభైశాతమే అవకాశం ఉంటుంది. అన్ని స్నేహాలూ ప్రేమలుగా మారవు. అన్నీ ప్రేమలో సక్సెస్ కావు.

అప్పుడడిగింది శిరీష "బాలూ! మీరు ప్రేమిస్తోంది.. స్వప్ననేనా? "

"అవును!" అన్నాడు బాలు.

ఒకేదారి అనుకున్నచోట రెండు దారులు ఎదురయితే? ఒకే జీవితం అనుకుని ముందుకెళ్తుంటే.. మరో జీవితం కలిస్తే..? ఈ క్షణంలో పొందిన ఆనందం మరు నిమిషంలో ఆవిరవుతోందని తెలిస్తే.. గుండె ఎంత అయోమయంలోకి నెట్టబడుతుందో అనుభవిస్తే గానీ తెలియదు. శిరీషకి లోపల దుఃఖం లావాలా పెల్లుబుకింది.

ప్రేమ.. రెండే అక్షరాల చిన్నపదం. అందరూ వెదికేది.. ఏ కొందరికో దక్కేది.. ఎందరినో దుఃఖంలో ముంచేది! తను కూడా బాలుని ఇష్టపడిందనీ, ఆ ఇష్టం ప్రేమ అనీ.. శిరీషకి తెలుసు! అలా తెలియడమే మరింత వేదన ఇప్పుడు!

★ ★ ★

రెండు రోజుల్లో స్వప్న ఇంటికి వస్తుందనగా బాలుకి హాస్టల్ నుంచి కబురొచ్చింది. ఎన్నోఏళ్ళుగా వార్డెన్‌గా అందరినీ సంరక్షించిన 'ఫాదర్' చనిపోయారనే వార్త తెలిసింది.

వెంటనే బయల్దేరి వెళ్ళిన బాలు, అంత్యక్రియలకి హాజరయ్యాడు. అసలే స్వప్న విషయంలో వేదనాభరితంగా ఉన్న హృదయం మరింత కుంగిపోయింది.

# యుద్ధాల్లో జంతువులు!

చతుర సంగతులు

యుద్ధాలలో అనాదిగా జంతువులని వాడడం తెలిసిందే. అయితే కేవలం గుర్రాలు, ఏనుగులనే కాక ఇతర జంతువులనూ యుద్ధంలో ఉపయోగించారు. ఆ విశేషాలు మీకోసం..

★ ఈజిప్షియన్స్‌కి పిల్లి పవిత్రమైన జంతువు. క్రీస్తుపూర్వం 525లో కాంబిసన్ రాజు ఈజిప్టుపై దండెత్తినపుడు తన సైన్యానికి ముందు పిల్లులను కదిపాడు. వాటికి హాని జరగకూడదని ఈజిప్షియన్ సైనికులు ఆయన



ఊహించినట్లే మిన్నకున్నారు. యుద్ధం జరగకుండానే కోట కాంబిసన్ పరమైంది.

★ తన తాత చెంఘిజ్‌ఖాన్ సాధించలేనిది, అతని మనవడు తైమూర్ సాధించాలని 1398లో ఢిల్లీ దాకా జయించుకుంటూ వచ్చాడు. లక్షమంది సైనికులు, కవచాలు ధరించిన 120 ఏనుగులలో సుల్తాన్ మొహమద్ ఖాన్ తైమూర్‌ని ఎదుర్కొన్నాడు. తైమూర్ సైనికులు ఏనుగులను చూసి భయపడితే, వాటిని బెదరకొట్టడానికి తైమూర్ ఒంటెల మీద గడ్డి మోపులను అంటించి వాటిని ఏనుగుల మీదకి ఉసిగొల్పాడు. అవి బెదిరి చెల్లాచెదురై మొహమద్ ఖాన్ సైన్యాన్నే తొక్కేయడంతో వారు పారిపోయారు. ఢిల్లీకోట తైమూర్ పరమైంది.

★ అమెరికన్‌నేవీ సీ లయన్‌ని యుద్ధంలో ఉపయోగిస్తోంది. వీటికి సముద్రంలో మందు పాతరలని కనిపెట్టే శిక్షణని ఇస్తారు.

★ హనీబాల్ చక్రవర్తి రోమన్ సామ్రాజ్యం మీద దాడి చేసినపుడు రోమ్ మిత్ర సైన్యం ఓడల మీదికి విషపూరిత పాములున్న కుండలని విసిరేశారు. పాములను చూసి సైనికులు భయంతో ఓడల మీంచి నీళ్లలోకి దూకేశారు. దాంతో హనీబాల్ గెలిచాడు.

★ పూర్వం ఆకలితో కనకనలాడే పందులను రాత్రుళ్లు శత్రుశిబిరాల మీదకి వదిలేవారు. అవి శత్రువుల మీద దాడి చేసి ఆహారం కోసం వెదికేవి. పందిని చంపడం, దాంతో పోరాడడం కష్టమైన పని.

★ రెండో ప్రపంచయుద్ధంలో చలికి ఎలక్ట్రానిక్ వార్‌హెడ్స్ గడ్డకట్టి పని చేసేవి కావు. కోళ్లని బాంబులతో పాటు ఉంచితే వాటి నుంచి వెలువడే వేడికి అవి పనిచేసేవి.

---

హాస్టల్‌లో అన్ని ఫార్మాలిటీస్ ముగియగానే రంగనాథ్ నుంచి ఫోన్ వచ్చింది బాలుకి. రేపు ఉదయాన్నే స్వప్న వచ్చేస్తోందని, రిసీవింగ్‌కి రమ్మని రంగనాథ్ చెప్పడంతో అంత దుఃఖంలోనూ ఏదో తెలీని ఆశ, ఆనందం చివురించాయి బాలుకి. రాత్రికి రాత్రి బయల్దేరాడు. స్వప్నకి తన మీద ఉన్న ఇష్టం ప్రేమగా మారకూడదు. ఒకవేళ మారినా, ప్రేమని తనే కూకటివేళ్ళతో పెళ్ళగించక తప్పదు! 'నీలిమ' వల్ల కలిగిన డిస్ట్రబెన్స్ మళ్ళీ ఆ కుటుంబంలో కలగకూడదు. ఇద్దరిలో కేవలం జ్ఞాపకాలు తప్ప ఇంకేమీ మిగలకూడదు! అని నిర్ణయించుకున్నాడు బాలు.

బాలు ఇలా నిర్ణయించుకుంటున్న సమయంలోనే, శరవేగంగా గమ్యస్థానానికి చేరుకుంటున్న ట్రైన్‌లో ఉన్న స్వప్న మాత్రం ఇందుకు భిన్నంగా ఆలోచిస్తోందని అతనికి తెలీదు.

జీవితంలో ఎన్నటికీ బాలుని విడిచి ఉండలేనని, ఎవరు కాదన్నా అతను తప్ప తనకి జీవితం లేదని.. స్వప్న దృఢంగా నిర్ణయించుకుంటోందని బాలుకి తెలీదు.

ఇటునుంచి, అటునుంచీ రెండు రైళ్ళూ ఒకే సమయానికి చేరుకున్నాయి.

ఒకదాంట్లోంచి స్వప్న, మరోదాంట్లోంచి

## కొత్తగాలి...

**ర్యాగింగ్**
**కాకూడదు రాక్షసత్వం**
**కావాలి స్నేహపూరిత**
**సుమ పరిమళం!**

– టి. హేమలత,
మచిలీపట్నం

బాలు ప్లాట్‌ఫామ్ మీదకి దిగారు.

రిసీవ్ చేసుకోడానికి వచ్చిన రంగనాథ్ వెనుక బాలుని చూసిన స్వప్నకి గుండె నిమిషానికి వెయ్యిసార్లు కొట్టుకోవడం అనుభవంలోకి వచ్చింది. అందరితోపాటూ నడుస్తూ ఏదో అంటున్న బాలుని చూసింది స్వప్న.

అప్పుడతని ముఖంలో నవ్వు. కానీ, కళ్ళలో మాత్రం ఏదో దిగులు కనిపించింది. ఎందుకు? ఏమయింది? మైడియర్!! ప్రేమంటే- సంతోషంలో కలిసి నవ్వడం.. విషాదంలో కలిసి కన్నీళ్ళు పంచుకోవడం! నేను వచ్చేశానుగా! నీ కోసమే వచ్చేశా! మైడియర్ బాలూ..!! అనుకుంటూ అడుగులు ముందుకేసింది.

కానీ.. మరి కొద్దిరోజుల్లోనే హృదయాన్ని తుపాను చుట్టుముట్టి అల్లకల్లోలం చేయబోతోందని అప్పుడామెకి తెలీదు.

★ ★ ★

కాలేజ్ మెయిన్ బిల్డింగ్‌లోని నోటీస్ బోర్డు దగ్గర చాలామంది స్టూడెంట్స్ గుంపులుగా చేరి, బోర్డులో అతికించిన ఒక ఉత్తరాన్ని ఆశ్చర్యంగా చూస్తున్నారు.

ఇది కాలేజీలో దావానలంలా వ్యాపించింది. ఎవరో అమ్మాయి, తన లవర్‌కి రాసిన ఉత్తరం నోటీస్ బోర్డులో ఉంచారని చాలామంది అక్కడికి వెళ్తున్నారు.

అప్పటికే ఇది తెలిసిన హిమజ క్లాస్‌లోకి వెళ్ళబోతున్న స్వప్నని తనతో నోటీస్ బోర్డు దగ్గరకి తీసుకెళ్ళింది.

అక్కడ డిస్‌ప్లేలో ఉన్న ఉత్తరాన్ని చూసి, చదవగానే స్వప్నకి విపరీతమైన ఆశ్చర్యం కలిగింది. లైబ్రరీ నుంచి తెచ్చిన రిఫరెన్స్ బుక్‌లో దొరికిన ఉత్తరం లాంటిదే ఇది కూడా! అదే పేపర్.. అవే అక్షరాలు.. రైటింగూ.. అవే ఫీలింగ్స్!!

అసలు ఇలా చేస్తోంది ఎవరు? అని ఆలోచిస్తూ చుట్టూ చూసింది స్వప్న.

అక్కడ అమ్మాయిలు, అబ్బాయిలు కొందరు తమ ఫోన్‌లో ఆ ఉత్తరాన్ని ఫొటోలు తీసుకుంటున్నారు. కొందరు నోట్‌బుక్‌లో రాసుకుంటున్నారు. తనలాగే మరికొందరికి లైబ్రరీ బుక్స్‌లో ఇలాంటి ఉత్తరాలే వచ్చాయని తెలుసు. అవి అందుకున్న వాళ్లంతా మౌనంగానే ఉండిపోయారు, తనలాగే! కానీ ఇప్పుడు నోటీస్ బోర్డులో పెట్టి కావాలనే పబ్లిసిటీ చేస్తున్నారు అనిపించింది స్వప్నకి.

ప్రేమ, ఇష్టం, విరహం, నవ్వులూ, కన్నీళ్లూ.. అన్నీ కలగలిపినట్టుగా.. ఒకసారి చదివాక, మళ్ళీ మళ్ళీ చదవాలనిపించేలా, ప్రేమ అంటే ఇలా ఉండాలి! ఫీలింగ్స్ అంటే ఇవీ! అనిపించేలా.. ఈ ఉత్తరాలు ఎవరు, దేనికోసం రాస్తున్నారు? వాళ్ల ఉద్దేశ్యం ఏమిటి?

స్వప్నకి అంతా అయోమయంగా అనిపించింది. నిశ్శబ్దంగా అక్కడి నుంచి క్లాస్ రూమ్ వైపు అడుగులేసింది.

సరిగ్గా అక్కడికి నాలుగడుగుల దూరంలో ఒక స్తంభానికి ఆనుకుని, చంకల కింద క్రచెస్‌తో ఉన్నాడు శ్రీకాంత్.

"ఎవరోగానీ.. అద్భుతంగా రాసిందిరా! సూపర్బ్! ప్రేమంటే.. అలా ఉండాలి! అలా చెప్పాలి! వాట్సప్‌లో పంపుతున్న ఆ లెటర్ అందరికీ షేర్ చెయ్యి!" అంటూ ఫోన్లో మాట్లాడుతూ వెళ్తున్న ఒక కుర్రాడి మాటలు శ్రీకాంత్‌కి వినిపించాయి.

ఆ మాటలు విన్నాక శ్రీకాంత్ కళ్ళలో నీటితెర. అర్ధంతరంగా చనిపోయిన శశాంక్, గుండెనిండా ప్రేమతోనే బతికి ఉన్న అక్క అనిత అతని మనసులో మెదిలారు.

'అక్కా! హేట్సాఫ్!! నీ గుండెలోని ప్రేమ నుంచి, దుఃఖం నుంచి రూపొందిన ఈ రాతలు.. ఏ దిక్కూతోచక అలమటించే కొందరు ప్రేమికులకు, తొందరపాటు నిర్ణయం తీసుకోకుండా.. ఒక మార్గం చూపిస్తే.. అంతకన్నా ఏం కావాలి?' అనుకున్నాడు శ్రీకాంత్ అప్పుడు.

★ ★ ★

అనుకోకుండా జరిగే సంఘటన- అప్పటి దాకా నడిచిన దారిని హఠాత్తుగా మలుపు తిప్పుతుంది. ఇన్నాళ్ళు జీవించినదంతా సరైంది కాదనే క్లారిటీని కలిగిస్తుంది. ఇదే రంగనాథ్‌కి జరిగింది. పాతికేళ్ళ కిందట ఎవరినో ప్రేమించిన నీలిమ క్షమించరాని నేరం చేసిందని ఇప్పటికీ ద్వేషిస్తున్న రంగనాథ్ ముందు.. ఇద్దరు వ్యక్తులు ప్రశ్నిస్తూ నిలబడ్డారు.

ఒకరోజు జనరల్ ఆస్పత్రికి వెళ్ళిన రంగనాథ్‌కి డయాలసిస్ వార్డ్‌లో కనిపించింది సరళ. తనతోపాటు పనిచేసిన రామ్మూర్తి కూతురు సరళ పదేళ్ళ కిందట, ఎవరినో ప్రేమించి, ఇంట్లోంచి వెళ్ళిపోయిన సంగతి రంగనాథ్‌కి తెలుసు.

కానీ, ఇన్నేళ్ళ తర్వాత సరళ ఇలా కనిపించడం రంగనాథ్‌కి షాకింగ్‌గా అనిపించింది. హాస్పిటల్లోని యూరాలజీ డిపార్ట్‌మెంట్ కారిడార్లో బెంచీ మీద బలహీనంగా, నీరసంగా కూర్చుని ఉంది సరళ. ఆమె పక్కనే కూర్చున్న యువకుడు ఫ్లాస్క్‌లోంచి కప్‌లోకి పాలు నింపి తన చేతుల్తో తాగించబోతూ కనిపించాడు. వాళ్ళిద్దరిలో ఒకరంటే ఒకరికి విపరీతమైన అనురాగం.

ఇంతలో ఏదో ఫోన్ రావడంతో సరళ పక్క నుంచి దూరంగా వచ్చిన ఆ యువకుడు ఫోన్ మాట్లాడాక.. అంతసేపూ వాళ్లనే చూస్తున్న రంగనాథ్ అతని దగ్గరికెళ్లి పలకరించాడు.

"ఆమె నీ భార్యేనా? సరళేనా?"

"అవునండీ..!" అనుమానంగా చెప్పిన ఆ కుర్రాడితో మాట్లాడాక, రంగనాథ్ గుండె లోపల తుప్పుపట్టి, మూసుకుపోయి ఉన్న తలుపులు తెరుచుకున్నట్లయ్యాయి.

ఒక కొడుకు పుట్టాక సరళ ఆరోగ్యం దెబ్బతిందనీ, కిడ్నీ సమస్యతో బాధపడుతున్న ఆమెకి వారం, పది రోజులకి డయాలసిస్ చేయిస్తూ, కంటికిరెప్పలా కాపాడుకుంటున్న వైనం ఆ యువకుడి మాటల్లో తెలుసుకున్నాక రంగనాథ్ మనసులో ఏదో కదిలింది. అలజడిగా అనిపించింది.

ప్రేమకి ఇంత బలముంటుందా? అందరినీ వదలి వచ్చిన సరళని.. తనని ప్రేమించిన ఆమెని.. మృత్యుముఖంలో ఉన్న భార్యని.. పసిపాపలా అక్కున చేర్చుకుని కాపాడుకుంటున్నాడు అతను..! ప్రేమిస్తే ఇలాగే ఉంటుందా? అనిపించింది రంగనాథ్‌కి.

రక్తసంబంధం కన్నా ప్రేమ గొప్పదా? పాతికేళ్ల కిందట ఎవరినో ప్రేమించి, శాశ్వతంగా దూరమైపోయిన తన చెల్లెలు నీలిమ.. ఇప్పుడు ఎలా ఉంది? నీలిమని కూడా ఆమె భర్త ఇంత ప్రేమగా చూసుకుంటున్నాడా? తను ఇప్పుడు ఎక్కడుంది? ఒక విధమైన ఆవేదన, ఆరాటం రంగనాథ్‌ని పట్టి ఊపేశాయి.

హాస్పిటల్ నుంచి బయటకొచ్చిన రంగనాథ్ గుండెను పాతికేళ్ళనాటి జ్ఞాపకాలు మేఘాల్లా ఆక్రమించుకున్నాయి.

★ ★ ★

లంచ్ అవర్ అయ్యాక స్వప్న నుంచి బాలుకి ఫోన్ వచ్చింది. వెంటనే ఫ్లై ఓవర్ దగ్గరకి రమ్మనడంతో పర్మిషన్ తీసుకుని బయల్దేరాడు బాలు. ఫ్లై ఓవర్ దగ్గర స్వప్నని బైక్ మీద ఎక్కించుకున్నాక, మరి కొద్ది నిమిషాల్లో, సముద్రతీరంలో ఉన్నారు

వాళ్ళిద్దరూ.

విశాలంగా పరుచుకున్న సముద్రతీరంలో వేడి ఇసుకలో బాలు, స్వప్న.. చెప్పుల్లేని కాళ్ళతో నడక సాగించారు.

బాలు చెయ్యి పట్టుకున్న స్వప్న ఉన్నట్టుండి "బాలూ! నా కోసం ఏమైనా చేస్తావా? " అని అడిగింది.

ఆ క్షణంలో బాలుకి.. జీవితమే ఎదురుగా నిలబడి ప్రశ్నించినట్లయింది.

ఏం చెబుతాడు తను? ప్రేమ ఎంత లోతైన సముద్రమో తెలీకుండానే దూకేశాడు. స్వప్న అడగకుండానే హృదయం ఇచ్చేశాడు. ఇంకేం మిగిలింది? స్వప్న తప్ప! ఆమెతో ప్రేమ తప్ప! అప్పుడు బాలు కళ్ళలో స్ఫటికంలా అశ్రుకణం మెరవడం గమనించింది స్వప్న.

బాలు ముఖాన్ని చేతుల మధ్య పట్టుకుని "ఏయ్! బాలూ! నువ్వు ఓ పిచ్చోడివి! నువ్వేం చేయలేవు! నేను చేస్తాను! నీ కోసం ఏమైనా చేస్తాను" అంది.

ఇంతలో ఒక అల విసురుగా వచ్చి ఇద్దరి కాళ్ళని చుట్టేసి, తీరంలో విశాలంగా పరుచుకుని, మళ్ళీ వెనక్కి వెళ్తూ, కాళ్ళ కింద ఇసుకని బలంగా లాగేస్తుంటే.. సముద్రం తమని లోపలికి లాగేసుకుంటున్నట్లుగా అనిపించి స్వప్నచెయ్యి గట్టిగా పట్టుకున్నాడు బాలు.

అప్పుడంది స్వప్న.. "బాలు! నువ్వు లేకుండా నేను బతకలేను! అలా కుదరకపోతే.. ఇక.. ఇక.. నేను బతకలేను!"

సరిగ్గా అప్పుడు మళ్ళీ మరొక అల విసురుగా వచ్చి ఇద్దర్నీ తాకింది. ఉద్వేగంతోనో, భయంతోనో.. ఇద్దరూ ఉక్కిరిబిక్కిరయ్యారు. ఒకరిని ఒకరు పట్టుకుని అలాగే ఉండిపోయారు. ఇద్దరి గుండెల్లో అపారమైన ఇష్టం.. ప్రేమ. ఇద్దరి చుట్టూ అంతులేని సముద్రం.

ప్రేమా, సముద్రమూ.. రెండూ ఒక్కలాంటివే! అనంతమైనవి! ఓ పట్టాన అంతుచిక్కనివి!




రాత్రి రెస్టారెంట్‌లో పాటలు త్వరగా ముగించి బయటపడ్డాడు బాలు.

సాయంత్రం స్వప్నతో బీచ్‌లో ఉండగా వచ్చిన శిరీష మిస్‌డ్‌కాల్స్ చూసి, తీరిక దొరికాక ఆ సమయంలో ఆమెకి తిరిగి ఫోన్ చేశాడు. ఎన్నిసార్లు కాల్‌చేసినా శిరీష ఆన్సర్ చేయలేదు. సాయంత్రం స్వప్నతో సముద్రతీరంలో గడపడం, అప్పుడు ఆమె చెప్పిన మాటలు.. అన్నీ జీవితం ముందు భవిష్యత్తుని ప్రశ్నిస్తుంటే.. శిరీషకి అదంతా చెప్పి అభిప్రాయం తెలుసుకోవాలని అనిపించింది బాలుకి.

ఇంకేమీ ఆలోచించకుండా అంత రాత్రప్పుడు నేరుగా శిరీష అపార్ట్‌మెంట్‌కి వెళ్ళి కాలింగ్ బెల్ నొక్కాడు బాలు.

డోర్ మిర్రర్‌లోంచి చూసిన శిరీష తలుపు తెరిచింది "బాలు! ఈ టైమ్‌లో? రండి!" పిలిచింది.

మౌనంగా లోపలికి వచ్చాడు బాలు.

అతడిని చూస్తుంటే మానసికంగా ఒత్తిడిలో ఉన్నాడనిపించింది ఆమెకు.

ఏమీ అడగకుండానే చెప్పడం మొదలుపెట్టాడు బాలు. రంగనాథ్ చెల్లెలు గురించి, ఇప్పటి స్వప్న మానసికస్థితి, ప్రేమ, చెల్లెల్ని ద్వేషించే రంగనాథ్ మాటలు అన్నీ చెప్పేశాడు.

ప్రేమని ద్వేషించే తండ్రి ఒప్పుకోకపో

యినా, స్వప్న మాత్రం బాలు లేకుండా జీవించలేదని శిరీషకి అర్థమయింది. హృదయంతో గాఢంగా ప్రేమిస్తే ఇంతే నేమో! అనిపించింది. ఒక్కక్షణం ఆలో చించి "నీలిమ గురించి అంతా స్వప్నకి చెప్పేయండి బాలు! ఆమెకి అన్నీ తెలి యాలి. ప్రేమ గురించి తెలుసుకుంది. పర్యవసానాలు కూడా తెలియాలి. అప్ప టికీ ఆమె నిర్ణయంలో ఎంలాటి మార్పు లేకపోతే.. అప్పుడు మీ చేతుల్లో కూడా ఏమీ ఉండదు" అంది శిరీష.

ఒక స్పష్టత వచ్చినట్లుగా అనిపించిన బాలు ఇంకేమీ అడక్కుండా అక్కడ నుంచి వెళ్లిపోయాడు.

మెయిన్‌డోర్ వరకూ వచ్చిన శిరీష "మరో విషయం చెప్పాలి! ఆ రోజు బీచ్‌లో నన్ను ఎటాక్ చేసింది ఎవరోకాదు, నేను ఏర్పాటు చేసుకున్న కిరాయి మను షులు.." అంది.

అయోమయంగా చూశాడు బాలు.

"అలా ఎందుకు చేశానంటే.. మిమ్మల్ని నా వైపు తిప్పుకుందామనే పిచ్చి ఆలోచ నతో చేశాను. ఎందుకంటే.. లైఫ్‌లో ఎవ ర్నైనా ప్రేమించానా? అంటే.. అది మిమ్మల్నే! అందుకు..!!" ఒక విధమైన కంపనతో మాటలు ఆపింది శిరీష.

బాలు అలాగే నిలబడిపోయాడు.

"అదంతా ఆ క్షణంలో.. నా ఫీలింగ్స్‌కి తగినట్లుగా చేశాను. కానీ ఇప్పుడలా కాదు. నేను నా ప్రేమలోంచి స్వార్థాన్ని తొలగించుకున్నాను. మీ ప్రేమ లేకపోయి నా నాకు బాధ లేదు. ఎందుకంటే.. నా హృదయం మీద నేనంతగా ఆధారపడి లేను. ఒకరోజు అన్నాను గుర్తుందా బాలూ? స్నేహం- స్నేహంగా, స్నేహితు లుగానే ఉండిపోవడం సాధ్యమయిన ప్పుడు, ప్రేమించిన వ్యక్తిని ఎప్పటికీ అలాగే ప్రేమిస్తూ ఎందుకు ఉండిపోకూ డదు? మనసులోని ప్రేమతోపాటే- ఎవరి జీవితంలో వాళ్లు ఎందుకు గడిపేయకూ డదు? ఇలా అన్నాను. నాకు కూడా ఇప్పుడు అలాగే ఉంది. నా జీవితంలో మీరు భాగం కాకపోయినా.. నా ప్రేమ మాత్రం అలాగే ఉంది.. ఉంటుంది. నాకు ఎలాంటి బాధ లేదు. కానీ.. స్వప్న అలా కాదు. తనకి బాలు కావాలి. లేకపోతే ఆమెకి వేరే జీవితం లేదు. స్వప్న హృదయం బాలుతో అంతగా మమేకం అయింది. స్వప్నని మాత్రం వదులుకో వద్దు బాలు! ఎప్పటికీ.. ఎలాగైనా సరే.. వదులుకోవద్దు! విష్ యు ఆల్ ద బెస్ట్!" అని చెప్పి, చిన్నగా నవ్వి, ఫ్లాట్‌లోకి వెళ్లి డోర్ వేసేసుకుంది శిరీష.

కారిడార్‌లో చీకట్లో ఒక్కడూ అచేత నంగా నిలబడిపోయాడు బాలు.

★ ★ ★

పాతికేళ్ల క్రితం దూరమైన మనిషిని ఎలా వెతకాలి? ఇదీ రంగనాథ్ ముందున్న ప్రశ్న. ఈ ప్రశ్న వెనకే కాలం తోపాటు, గత జీవితపు జ్ఞాపకాల పొర ల్లోకి వెళ్తూ, ముందుకి అడుగులేశాడు.

తన చెల్లెలు నీలిమ ఆచూకీ కోసం వెతు కుతూ అలా.. అలా.. ఎక్కడో మురికివా డల్లో మిషన్ కుట్టుకుంటూ బతుకుతున్న క్లాస్‌మేట్ రజియా ఇచ్చిన సమాచారంతో అక్కడికి చాలాదూరంలో ఉన్న చిన్నటౌ న్‌లో అడుగుపెట్టాడు రంగనాథ్.

దిగువ మధ్యతరగతి ప్రజలు నివసించే కాలనీలో అంగన్‌వాడీ ఆయా లక్ష్మి దగ్గర కెళ్లి అడిగితే.. "ఆంటీ లేదుగా!" అంటూ రంగనాథ్‌ని అనుమానంగా చూసిందామె.

"అంటే..? " దిగజారుతున్న ఆశని కూడ గట్టుకుంటూ అడిగాడు.

"నీలిమా ఆంటీ చనిపోయింది! చాలా కాలమయింది!" చెప్పింది లక్ష్మి.

రంగనాథ్ గుండె ఒక్కసారిగా ఆగినట్ల యింది. పాతికేళ్ల కిందట చివరిసారిగా, జీవితం నుంచి వెలివేయబడిన నీలిమ..

ఎక్కడో అందరిలాగే క్షేమంగా తన బతుకు తాను బతుకుతూంటుందనే ఆశ.. ఒక్కసారిగా కుప్పకూలింది.

"నీలిమ భర్త? కొడుకు?" మాటలు వెతుక్కున్నాడు రంగనాథ్.

"అంకుల్‌కి ఆరోగ్యం పాడయితే తన కిడ్నీ ఇచ్చింది. అయినా లాభం లేకపోయింది.. చనిపోయాడు. తర్వాత కొడుకుని హాస్టల్లో చేర్పించి, వెంటనే మంచం పట్టింది. మళ్లీ హాస్టల్ ముఖం చూడలేదు. ఓరోజు మా ఇంట్లోనే ప్రాణం పోయింది. కొడుకు ఎవరో హాస్టల్లో కూడా సరిగ్గా చెప్పలేదు" అంది లక్ష్మి.

కాళ్లకింద నేల కుంగిపోతున్నట్లే అనిపించింది రంగనాథ్‌కి.

"ఇంతకీ ఆంటీ ఏమవుతుంది మీకు?"

"తను.. నీలిమ.. నా చెల్లెలు" అంటూ మాటలు రానట్లుగా అక్కడే నేలమీద కూలబడిపోయాడు రంగనాథ్.

చెట్టంత మనిషి దుఃఖంతో కదిలిపోయి కుప్పకూలడంతో లక్ష్మి కళ్లు చెమర్చాయి. ఎవరినో ప్రేమించిందని ఇంట్లోంచే వెళ్లగొట్టాడు తను. భర్తను కోల్పోయి, కొడుకుని హాస్టల్లో చేర్చి, అనారోగ్యంతో అనాథలాగా కన్నుమూసింది.. నీలిమ!! అంత కష్టంలోనూ పుట్టింటివైపు చూడకుండా, జీవితంతో యుద్ధం చేస్తూ.. అలిసి చనిపోయిన నీలిమని.. తనెందుకు దూరం చేసుకున్నాడు? ఇన్నాళ్ళూ ద్వేషించాడు. ఎలా మర్చిపోయాడసలు? తను మనిషేనా?

రంగనాథ్‌కి దుఃఖం ఆగలేదు.

★ ★ ★

ఎగ్జిబిషన్‌కి వెళ్దామని గొడవ చేస్తుంటే స్వప్నతో కలిసి వచ్చాడు బాలు.

జెయింట్‌వీల్ తిరుగుతూంటే బాగా పైకి వెళ్లిన బాక్స్, మళ్లీ ఒక్కసారిగా కిందకి దిగుతూ థ్రిల్లింగ్‌గా అనిపించింది ఇద్దరికీ.

సరిగ్గా అప్పుడు ఆమెకు నీలిమ గురించి చెప్పేయాలనిపించింది బాలుకి.

కిందకి దిగిన జెయింట్‌వీల్ బాక్స్ తిరిగి పైకి వెళ్తుండగా నీలిమ గురించి, రంగనాథ్ ఫీలింగ్స్ గురించి చెప్పేశాడు బాలు.

అతను చెప్పడం పూర్తికాగానే, అప్పుడే పైకి చేరుకున్న జెయింట్‌వీల్ బాక్స్ ఒక్కసారిగా కిందకి దిగసాగింది. స్వప్నకి తను కూడా ఆకాశం నుంచి అమాంతం కిందకి పడిపోతున్నట్లుగా అనిపించింది. భయాందోళనలు కలిగాయి. బాలు చేతిని ఇంతకుముందుకన్నా గట్టిగా పట్టుకుంది. మాటలు రాని మూగదిలా మారిపోయింది.

జెయింట్‌వీల్ తిరగడం ఆగింది. కొన్ని క్షణాల్లో కిందకి చేరుకున్న బాక్స్‌లోంచి దిగుతుండగా, "బాలూ! నిన్ను వదులుకోలేను! నువ్వు లేకుండా బతకలేను! నీ కోసం ఏమైనా చేస్తాను! నువ్వు లేకపోతే చచ్చిపోతాను!" అంది స్వప్న.

అలా అంటున్నప్పుడు ఆమె కళ్ళలోంచి నీళ్లు-చెంపల మీంచి జారిపోతున్నాయి.

★ ★ ★

నీలిమని వెతుక్కుంటూ వెళ్లిన రంగనాథ్ సర్వస్వం కోల్పోయినట్లుగా ఇంటికి చేరాడు. తలుపు తీసిన జానకమ్మ, కొడుకుని చూడగానే ఆశ్చర్యపడింది.

"ఏంట్రా రంగా? అలా ఉన్నావేంటి? క్యాంప్‌కి వెళ్తున్నానని చెప్పావ్! ఏమయింది?" ఆదుర్దాగా అడిగింది కొడుకుని.

తల్లి అలా అడగ్గానే.. రంగనాథ్‌కి గుండెలోంచి దుఃఖం పెల్లుబుకింది. నీలిమ చనిపోయిందని చెప్పేయాలనిపించింది. కంట్రోలు చేసుకుని బదులివ్వకుండా లోపలికెళ్లిపోయాడు. తర్వాత అందరూ వెళ్లిపోయాకెప్పుడో నిద్రలేచి, వరండాలోకొచ్చాడు రంగనాథ్.

పిల్లలు స్కూల్, కాలేజీలకీ, బాలు ఆఫీస్‌కి వెళ్లడంతో అంతా నిశ్శబ్దంగా ఉంది. వరండాలో బాలూ రూమ్ ముందు నిలబడ్డాడు. హాస్టల్‌కి వెళ్లి నీలిమ కొడుకు

గురించి వాకబు చేయడం గుర్తొచ్చింది. అక్కడ.. తమ ఇంటి వరండాలో ఉండే బాలు కూడా ఇదే హాస్టల్‌లో పెరగడం, ఒకవేళ నీలిమ కొడుకు.. బతికే ఉంటే.. ఒకవేళ బాలు అయితే? ఈ ఆలోచనకే రంగనాథ్ మనసంతా అదోలా మారింది.

హాస్టల్‌లో అప్పటిదాకా పనిచేసిన ఫాదర్ చనిపోవడంతో, నీలిమ కొడుకు ఎవరనేది రికార్డుల్లో వెతుకుతుంటే.. ఒకే రోజు హాస్టల్‌లో చేరిన ఇద్దరు అనాథ పిల్లల్లో ఒకడు 'బాలు' అని తెలిసి.. తను షాక్‌కి గురవడం రంగనాథ్‌కి గుర్తొచ్చింది. ఆ ఇద్దరు పిల్లల్లో ఒకరు నీలిమ కొడుకు అనేది నిర్వివాదాంశం. కానీ - ఒక పిల్లాడు నాలుగేళ్ళకే చనిపోతే, మిగిలింది బాలు మాత్రమే అనే నిజం తెలియడంతో రంగనాథ్ మనసు అంతా గందరగోళంగా మారింది. ఇంకేం చేయగలిగేదీ లేక ఇంటికి తిరిగి వచ్చాడు.

వరండా గదిలో అద్దెకు ఉంటూ, తన కుటుంబంలో ఒకడిగా కలిసిపోయిన ఒక వేళ నీలిమ కొడుకే అయితే? అప్పుడేం చేయాలి? అలా అని.. నీలిమ కొడుకు కాకపోతే..?

తల విదిలించాడు రంగనాథ్. అప్రయత్నంగా బాలు రూమ్ తలుపులు తెరిచి లోపలికి అడుగుపెట్టాడు.

టేబుల్ మీదున్న పుస్తకాలు తీసి చూస్తుంటే లోపల పేజీల్లోంచి నీలిమ ఫొటో.. పాతికేళ్లనాటిది.. కిందపడింది.

రంగనాథ్ గుండె ఝల్లుమంది. చప్పున తీసి చేత్తో పట్టుకున్నాడు. ఆ రోజు అటక మీంచి బాలు దిగినప్పుడు తను అతడ్ని తిట్టింది ఈ ఫొటో చూసినప్పుడే! చెల్లెలి ఫొటోని కన్నార్పకుండా చూశాడు. ఫొటోలోని నీలిమ గతమంతా గుర్తుచేసి దుఃఖం పొంగేలా చేసింది. వెక్కివెక్కి ఏడవడం మొదలుపెట్టాడు రంగనాథ్.

సరిగ్గా అప్పుడే వరండాలోకొచ్చిన జానకమ్మ, వరండాగది తలుపులు తీసి ఉండడం, లోపల నుంచి ఎవరో వెక్కిళ్లు పెట్టడం.. గమనించి రెండడుగులు ముందుకేసింది. అక్కడ లోపల నీలిమ ఫొటోని పట్టుకుని ఏడుస్తున్న రంగనాథ్ కనిపించాడామెకు.

కంగారుగా లోపలికెళ్లింది. భుజం మీద చెయ్యేసి "రంగా..! ఏమయిందిరా నీకు? ఎందుకలా ఏడుస్తున్నావు? " అంది.

తల్లిని చూడగానే ఏడుపు దిగమింగుకున్న రంగనాథ్ ఏమీ మాట్లాడకుండా నీలిమ ఫొటోని ఆమె చేతికిచ్చాడు.

"అమ్మా! నీలిమ లేదమ్మా! తనని వెతుక్కుంటూ వెళ్లాను. నేను వెళ్లేలోపలే.. ఎప్పుడో ఈ లోకం విడిచి వెళ్లిపోయిందమ్మా..!" పూడుకుపోతున్న గొంతుతో చెప్పాడు రంగనాథ్.

అయితే ఏదో ఒకరోజు ఇలా వినక తప్పదని మానసికంగా సిద్ధపడి ఉన్న జానకమ్మ కుంగిపోలేదు. కూతురి ఫొటోని నిర్లిప్తంగా చూస్తూ ఉండిపోయింది.

తను వెళ్లడం, నీలిమ జీవితం, ముగిసిపోవడం, కొడుకు కోసం హాస్టల్‌కి వెళ్లడం.. అన్నీ తల్లితో చెప్పడం మొదలుపెట్టాడు రంగనాథ్.

★ ★ ★

కాలేజీలో ఎలాగడుపుతోందో? క్లాసులు ఎలా వింటోందో? స్వప్నకి ఏమీ తెలియడం లేదు. దేనిమీదా ఆసక్తి కలగడం లేదు. ఇంతకు ముందు బాలుని తలుచుకోగానే ఆనందంతో పొంగే హృదయం - ఇప్పుడు దుఃఖంతో కదిలిపోతోంది. బాలు లేని జీవితం గుర్తొస్తేనే ఇక బతకడం అనవసరం అనిపిస్తోంది. ప్రేమిస్తే ఇంత వేదన, దుఃఖం ఎందుకు కలుగుతాయని ఆలోచించింది. తన మనసులోని సంఘర్షణకి పరిష్కారం ఏమిటి? అది ఎలా తీరుతుంది? అనే ఆలోచన కలిగింది.

అప్పుడామెకి లైబ్రరీలోంచి తెచ్చిన



బుక్‌లో దొరికిన ఉత్తరం గుర్తొచ్చింది. అజ్ఞాత వ్యక్తి ఎవరో రాసిన ఆ ఉత్తరం చదివాకే తన లోపల ఫీలింగ్స్‌కీ, అయోమయానికీ అర్థం తెలుసుకోగలిగింది. తనలో కూడా ప్రేమ ఉందనీ, ప్రేమించగలదనీ తెలుసుకుంది. మళ్లీ అలాంటి ఉత్తరం దొరికితే? తన జీవితం ముందున్న విషమ ప్రశ్నకి సరైన సమాధానం దొరికితే? అనిపించింది.

లైబ్రరీ వైపు నడిచింది. ఎప్పటిలాగే రిఫరెన్స్ బుక్ చూస్తూ, పేజీలు తిప్పుతుండగా.. ఒక పేజీలో మడతలు పెట్టిన గులాబీరంగు కాగితం స్వప్నకి కనిపించింది. ఒక్కసారిగా ఆమెకు ఊపిరి అందినట్లనిపించింది.

అదే! ఆ ఉత్తరం లాంటిదే! మళ్లీ ఈ బుక్‌లో కూడా!

ఆ బుక్‌ని అలాగే తీసుకెళ్లి రిజిష్టర్‌లో రాయించి, కారిడార్‌లోకెళ్లి మడతలు పెట్టిన గులాబీ రంగు కాగితాన్ని విప్పబోతూ ఒక్క క్షణం ఆగింది స్వప్న. అప్పుడామెకి బాలు గుర్తొచ్చాడు. ఇంతవరకు చూడని 'నీలిమ' గుర్తొచ్చింది. మనసంతా దిగులుగా మారింది.

ఉత్తరాన్ని మడతలు విప్పకుండా అలాగే తన హ్యాండ్‌బ్యాగ్‌లో పెట్టేసింది. బయటికి నడవబోతుండగా మనసులో ఏదో ఆలోచన కలిగింది.

తిరిగి కౌంటర్‌లోని లైబ్రరీ అసిస్టెంట్ దగ్గరకెళ్లి తన చేతిలోని రిఫరెన్స్ బుక్‌ని చూపిస్తూ "ఇది ఇంతకుముందు ఎవరు తెచ్చిచ్చారు? " అని అడిగింది స్వప్న.

"శ్రీకాంత్ ఫస్టియర్!" క్యాజువల్‌గా బదులిచ్చాడు లైబ్రరీ అసిస్టెంట్.

"అతను ఉన్నాడా ఇక్కడ? " అడిగింది.

ఆమెవైపు అదోలాగ చూసి దూరంగా టేబుల్ ముందు కూర్చుని ఏదో చదువుకుంటున్న శ్రీకాంత్‌ని చూపించాడాయన.



ఇంకేమీ మాట్లాడకుండా అటువైపు నడిచింది స్వప్న.

తను రిఫరెన్స్ బుక్‌లో పెట్టిన అక్క రాసిన ఉత్తరం ఎవరికి అందిందో అని మౌనంగా గమనిస్తున్న శ్రీకాంత్‌కి, స్వప్న తన దగ్గరకి రావడంతో విషయం అర్థమయింది. స్వప్నవైపు చూసి నవ్వాడు. క్రచెస్‌తో లేచి నిలబడ్డాడు. జరగబోయేది అర్థమయిపోయింది. ఇద్దరూ బయటికి వెళ్లాక, చెట్టునీడలో ఆగింది స్వప్న.

"చూడు శ్రీకాంత్! అసలు విషయం




అడుగుతున్నాను. ఈ ఉత్తరాలు ఎవరు రాస్తున్నారు? ఎందుకిలా లైబ్రరీ బుక్స్‌లో ఉంచుతున్నారు? " అడిగింది స్వప్న.

తను, అక్క ఎంత త్వరగా జరగాలని కోరుకున్నారో.. సరిగ్గా అదే జరిగిందనిపించింది శ్రీకాంత్‌కి! ఒకవిధమైన ఆనందం, ఉద్వేగం కలిగాయి.

"చదివారా? ఏమనిపించింది? చెప్పండి! తర్వాత నేను చెప్తాను!" అన్నాడు.

"నా మనసుని ఉత్తరంలో తెలుసుకున్నాను. అందుకే అడుగుతున్నాను. ఎవరు రాస్తున్నారు? ప్లీజ్ చెప్పు! ఇప్పుడు నా జీవితమంతా గందరగోళంగా మారింది. ఉత్తరాలు రాస్తున్న వ్యక్తిని కలిస్తే తప్ప సొల్యూషన్ దొరకదు" అంది స్వప్న.

అప్పుడామెలో ఒకనాటి అనిత పోలికలు కనిపించాయి శ్రీకాంత్‌కి. "ఆ ఉత్తరాలు రాసింది.. అనిత! నాకు అక్క"

"ఆమెని ఒకసారి కలవాలి..!" అంటూ తన జీవితం ముందున్న విషమ సమస్యని

నాలుగే మాటల్లో చెప్పేసింది స్వప్న.

శ్రీకాంత్‌లో ఒక విధమైన ఫీలింగ్ కలి గింది. ఏదైతే మళ్ళీమళ్ళీ మరొకరికి జరగ కూడదనుకుంటామో సరిగ్గా అలాంటిదే కళ్ళముందు కనిపిస్తుంటే.. ఏం చేయాలో అర్థంకాని స్థితి కలుగుతుంది. చరిత్ర పున రావృతమవుతూనే ఉంటుంది.

"సరే! ముందు అక్కరాసిన ఉత్తరం చదవండి! తర్వాత ఆమె మిమ్మల్ని కలు స్తుంది" చెప్పాడు శ్రీకాంత్.

తలూపి అక్కడ్నుంచి కదిలింది స్వప్న.

★ ★ ★

ఇంటికి చేరుకున్న తమ్ముడ్ని చూసిన అనిత, టేబుల్ మీదున్న నాలుగు మడ తలు పెట్టిన గులాబీ రంగు కాగితాన్ని చూపించింది.

అది తీసుకుని చూసిన శ్రీకాంత్‌కి అక్క రాసిన ఉత్తరంగా అర్థమయింది. ఈ ఉత్త రానికి బదులుగా ఏదో మరో కాగితాన్ని బుక్‌లో పెడితే, దానినే స్వప్న తీసుకెళ్ళిం దని అర్థమయింది. అతనిలో భయం, కంగారు కలిగాయి. వెంటనే అనితకి స్వప్న గురించి చెప్పడం మొదలుపెట్టాడు.

అంతా విన్నాక పలక మీద ఇలా రాసింది అనిత, "స్వప్నని వెంటనే కల వాలి. చాలా అర్జెంట్" అని.

ఇలా రాశాక ఆమె ముఖంలో కనిపిం చిన ఆందోళన శ్రీకాంత్‌లో భయాన్ని రెట్టింపు చేసింది.

★ ★ ★

ఇంటికెళ్ళాక, హ్యాండ్‌బ్యాగ్‌లోని ఉత్త రాన్ని మడతలు విప్పింది స్వప్న. ఆశ్చ ర్యంగా అందులో ఏమిలేదు. అక్షరం కూడా లేని ఖాళీ కాగితం అది. తన జీవితం ముందున్న సమస్యకి ఉత్తరంలో సమాధానం వస్తుందని ఆశపడింది. కానీ ఇలా జరగడంతో స్వప్నలో ఒక రకమైన డిప్రెషన్ కలిగింది.

బాలు, స్వప్న రోజూ కలుస్తూనే ఉన్నారు. ఇద్దరిలో దిగులు, నైరాశ్యం, గూడుకట్టుకుంటున్నాయి.

"స్వప్నా! మనం ఏం చేద్దాం? ఇలా నా వల్ల కావడం లేదు..!" అన్నాడు బాలు.

బాలు మాటలు స్వప్నలో దిగులు మరింత పెంచాయి.

"పోనీ.. ఓ పని చేస్తే! నాన్నతో మన సంగతి చెప్పేస్తే? " అంది స్వప్న.

భయపడ్డాడు బాలు. "వద్దు.. వద్దు.. మన ప్రేమ గురించి తెలిస్తే.. అంతా గందరగోళం. నువ్వు తట్టుకోలేవు" అయోమయంగా అన్నాడు.

"మరి..మరి ఏంచేద్దాం బాలు? " అతని చెయ్యి గట్టిగా పట్టుకుంది. అప్పుడామెకి అనితని కలవాలని బలంగా అనిపించింది.

★ ★ ★

జానకమ్మతో అంతా చెప్పాక రంగనాథ్ కూడా మూడీగా మారిపోయాడు. అశాం తితో, ఆరాటంతో స్థిమితం కోల్పోయాడు.

ఒకరోజు జానకమ్మతో "అమ్మా! బాలు నీలిమ కొడుకు అయితే? ? " అన్నాడు.

అప్పుడు జానకమ్మ భావరహితంగా ఉండిపోయింది. కొన్నిక్షణాలు ఆగి, "నీలి మ.. అందరూ ఉన్నా అనాథగానే చనిపో యింది. ఒకవేళ.. బాలు నీలిమ కొడుకే అయితే.. అతని తల్లిని తీసుకురాగలవా ఇప్పుడు? " అని మాత్రం అడిగింది.

సమాధానం ఆ కొడుకు దగ్గర లేదు. తను పాతికేళ్ళ కిందటే సమాధానం చెప్పే అర్హత పోగొట్టుకున్నాడని అతనికర్థమైంది.

★ ★ ★

క్లాస్ అయ్యాక క్యాంటీన్ వైపు వెళ్తుంటే ఎవరో పిలిస్తే తిరిగి చూసింది స్వప్న.

క్రచెస్‌తో శ్రీకాంత్ కనిపించాడు.

"అక్కకు మీ గురించి చెప్పాను. నిన్న లెటర్‌కి బదులు బ్లాంక్ పేపర్ పెట్టాను పొరపాటున, సారీ!" దిగులుగా చూస్తూ అన్నాడు శ్రీకాంత్.

ఏమీ మాట్లాడకుండా మూడీగా నిలబడి

పోయింది స్వప్న. అప్పుడామెను చూస్తుంటే కొంతకాలం కిందట అక్కని చూసినట్లే అనిపించింది శ్రీకాంత్‌కి.

ఇంతలో స్వప్న ఫోన్‌కి బాలు నుంచి కాల్ వచ్చింది. కాల్ ఆన్సర్ చేసిన స్వప్న వణుకుతున్న గొంతుతో "హలో.. బాలు.." అంది.

"స్వప్నా! ఎక్కడున్నావ్?"

"కాలేజ్‌లో.. చెప్పు బాలు!" భారంగా అంది స్వప్న.

"నీ గొంతు ఒకసారి వినాలనిపించింది. అందుకే కాల్ చేశాను" అన్నాడు బాలు.

అప్పుడు బాలు గొంతులోని నైరాశ్యం స్వప్న గుండెని పిండేసినట్లయింది. "ఎక్కడున్నావు?" అంది.

అటునుంచి నిశ్శబ్దం. "బాలూ..! బాలూ..! ఎక్కడున్నావు" అంది.

"ఆఫీస్ బయట. మనం కలవలేం. నేను.. నేను.. దూరంగా ఎటన్నా వెళ్ళిపోతే.. నన్ను మర్చిపోతావా?" అంటున్నాడు బాలు.

"బాలూ..! ప్లీజ్! అలా అనకు! నువ్వు లేకుండా నేను ఉండలేను. నేను చచ్చిపోతాను. నువ్వు లేకపోతే బతకలేను" అంటూ ఏడుపు మొదలుపెట్టింది స్వప్న.

ఇదంతా చూస్తున్న శ్రీకాంత్‌లో కంగారు మొదలయింది.

"నువ్వు ఫ్లై ఓవర్ దగ్గరకి రా! మనిద్దరం బీచ్‌కి వెళ్దాం! ఇలా నా వల్ల కావడం లేదు" అంటూ కాల్ కట్ చేసింది స్వప్న.

ఈ లోపల తన మొబైల్ నుంచి అనితకి మెసేజ్ పంపిన శ్రీకాంత్, అక్క రాసిన చివరి ఉత్తరం తెచ్చాను, ఇదిగోండి! తప్పకుండా చదవండి! ప్లీజ్!" అన్నాడు.

అతని చేతిలోని లెటర్‌ని అందుకుని నీళ్ళు నిండిన కళ్ళతో, కాలేజ్ మెయిన్ గేటు వైపు వేగంగా అడుగులేసింది స్వప్న. ఆమెను చూస్తున్న శ్రీకాంత్.. తను కూడా కాలేజ్ గేటు వైపు క్రచెస్‌తో వేగంగా ముందుకి సాగాడు.

## కొత్తగాలి...

**శుభాశుభాలకు**
**గుత్తాధిపత్యం**
**తీసుకుందేమో!**
**అగరుబత్తి!**

– వి.యం. కృష్ణ,
ఇ.సి.ఐ.ఎల్., హైదరాబాద్

★ ★ ★

'హాయ్ డియర్! ఎలా ఉన్నావ్? నువ్వు ఉన్నప్పటి కన్నా, ఇప్పుడే నీ జ్ఞాపకాలు ప్రతిక్షణమూ నాతో ఉంటున్నాయి. నువ్వు ఈ లోకంలో లేవంటే, నమ్మశక్యం కాకుండా ఉంది నాకు.

క్షణికావేశంలో తీసుకున్న నిర్ణయం, ఒకే ఒక్కక్షణం ఆలస్యమవకుడదా? అని ఎన్ని లక్షలసార్లు అనుకున్నాను!! ఇద్దరమూ ఒకే జీవితంలో ఉండడం అసాధ్యమనే నిరాశతో, మన జీవితాన్ని అంతం చేసుకోవాలనుకున్నాం. కానీ, విధి ఈ విషయంలో కూడా మనవి విడదీస్తుందనుకోలేదు. నువ్వు ఈ లోకం నుంచి శాశ్వతంగా వెళ్ళిపోతే, నేను మాత్రం - జీవచ్ఛవంలా మిగిలాను. నువ్వులేని జీవితంలో.. నీ జ్ఞాపకాలతో, వేదనని నిశ్శబ్దంగా అనుభవిస్తూ బతకాలని నాకు రాసిపెట్టి ఉందేమో?

తీరని కోరికలతో చనిపోయినవాళ్ళు ఆకాశంలో నక్షత్రాల్లా వెలుగుతుంటారని అంటారు. ఏ నక్షత్రంలో నువ్వు ఉన్నావో అని.. నక్షత్రాన్నించి నక్షత్రానికి ఎంతగా వెతుకుతానో? నీ అంత గాఢంగా నేను ప్రేమించలేదని, ప్రేమ పేరుతో నిన్ను బలి తీసుకున్నానని నిందించారు. న్యాయస్థానంలో నిలబెట్టారు. చట్టం విధించిన శిక్ష.. నిన్ను నా జీవితంలోకి తిరిగి తీసు

కురాగలిగిందా? నిన్ను మర్చిపోనీకుండా చేయగలిగిందా?

కేవలం నిన్ను ప్రేమించాను కాబట్టే.. బతికి ఉన్నాను. నా ఊపిరిగా, నా గుండె చేసే చప్పుడుగా ప్రాణం ఉన్నంతవరకూ, నిన్ను ప్రాణంలా ప్రేమిస్తుంటాననీ, నీ జ్ఞాపకాల్తో జీవిస్తుంటాననీ, ఈలోకానికి ఏంతెలుసు? మనం ఆత్మహత్యకి పాల్పడకుండా ఉంటే? ? నువ్వు నాతోనే ఉండి ఉంటే? ? కాలాన్ని వెనక్కి మడవగలిగితే? ?

- ప్రేమతో
నీ నేను'

స్వప్న, బాలు చదివారు ఈ ఉత్తరం.

అనిత అనే అమ్మాయి రాసిన ఉత్తరం చదివాక ఇద్దరి కళ్ళు చెమర్చాయి. ఒకరి చేతులు ఒకరు పట్టుకుని నిశ్శబ్దంగా ఉండిపోయారు. ప్రేమకులిద్దరూ ఆత్మహత్యకి పాల్పడి అబ్బాయి చనిపోతే! అమ్మాయి మాత్రం బతికితే? ఆ అమ్మాయే.. అనిత! అని అర్థమయింది స్వప్నకి.

"బాలూ! నన్ను వదిలి ఎక్కడికెళ్దామనుకున్నావు? నేను లేకుండా ఉండగలవా అసలు? నన్ను వదిలి నేను లేకుండా ఎక్కడికెళ్తావు? " అంటూ ఏడుపొచ్చి, బాలు భుజం మీది తల ఆనించింది స్వప్న.

ఇద్దరిలో ఒకరిని ఒకరు విడిచి ఉండలేనంత ఇష్టం, ప్రేమ. పరిస్థితులూ, మనుషులూ ఇద్దరినీ విడదీయాలంటే ఎలా సాధ్యపడుతుంది? స్వప్నని అలాగే ఏడవనిచ్చాడు బాలు.

కాసేపటికి తేరుకుంది స్వప్న. "బాలూ!" అని పిలిచింది.

ఏంటన్నట్లుగా చూశాడు బాలు.

అంతసేపూ కూచున్న పడవ మీద నుంచి దిగి, చెయ్యి అందించింది. అప్పుడామె భుజానికి బ్యాగ్ వేలాడుతోంది. "పద! వెళ్ళిపోదాం! చివరిసారి అలా కలసి నడుద్దాం బాలూ!" అంటూ అతడి చెయ్యి అందుకుని, తడి ఇసుకలో ముందుకి నడిచింది స్వప్న.

బాలూ కూడా అడుగులేశాడు. ఇసుకలో వాళ్ళ పాదాల ముద్రలు కనిపిస్తూ అరక్షణంలో మాయమవుతున్నాయి.

సరిగ్గా ఇదే సమయంలో బీచ్ దగ్గరకు ఆటో వచ్చి ఆగింది. అందులోంచి అనిత, వెనకాలే క్రచెస్ సరిచేసుకుంటూ శ్రీకాంత్ దిగారు. వీళ్లకి దూరంగా తీరంలో నడుస్తూ వెళ్తున్న స్వప్న, బాలూ కనిపించారు. అనిత వడివడిగా అడుగులేస్తూ వాళ్ళ వైపు సాగిపోయింది.

బాలూ, స్వప్న కొంత దూరం నడిచి గట్టిగా ఉన్న తడి ఇసుకలో ఆగారు. బాలూ భుజం మీద తలవాల్చింది స్వప్న. ఎదురుగా సముద్రం అలలు ఆగకుండా మనసులోని ఆలోచనల్లాగా! స్వప్నకి ఇన్నాళ్ల జీవితం అంతా కళ్ళ ముందు కనిపించింది. ప్రేమిస్తే పర్యవసానం ఏంటి? పరిస్థితులకి తలవంచి వేర్వేరు జీవితాల్లోకి అడుగులేయడమేనా? కాదు.. కాదు! ప్రేమిస్తే.. ఆ ప్రేమ కోసం ఏమైనా చేయాలి. అవసరమైతే మరణించాలి అంతే!

ఇలా అనుకుంటూ "బాలూ! ఐ లవ్ యూ!" మళ్ళీ చెప్పింది.

స్వప్న కళ్ళలో కనిపిస్తున్న నిరాశనీ, దిగులునీ, తెగింపునీ బాలు గుర్తించాడు. ఆమె చేతిని గట్టిగా పట్టుకున్నాడు.

అప్పుడు హ్యాండ్ బ్యాగ్ ని ఓపెన్ చేసింది స్వప్న. అందులోని కూల్ డ్రింక్ బాటిల్, మరో చిన్నబాటిల్ బయటికితీసింది. అప్పుడామె చేతులు వణికాయి.

సరిగ్గా అప్పుడు స్వప్న భుజం తట్టి.. "స్వప్నా!" అని పిలిచారెవరో!

ఉలిక్కిపడిన స్వప్న, బాలు వెనక్కి తిరిగి చూశారు. అక్కడ శ్రీకాంత్, మరొక అమ్మాయి కనిపించారు స్వప్నకి. ఆమె అనితగా అర్థమయింది.

"స్వప్నా! ఏం చేయబోతున్నారు? " కంగారుగా అడిగాడు శ్రీకాంత్.

## అక్కడ సెలవులు గడపడం అమెరికన్స్ కల!

చతుర సమగతులు

హవాయ్ రాష్ట్రంలో సెలవులు గడపడం అమెరికన్స్ కల. అది అమెరికాలోని ఓ రాష్ట్రమే అయినా దూరంగా ఉన్న ద్వీపం. హవాయ్ గురించిన కొన్ని విశేషాలు..

★ ఏటా హవాయ్‌కి అరవై లక్షల మంది పర్యాటకులు వచ్చి నూటపది కోట్ల డాలర్లని ఖర్చు చేస్తుంటారు. ఇక్కడ సెలవులు గడపడం అమెరికన్స్ కల.



★ అత్యధిక కాలం జీవించే అమెరికన్ పౌరుల నివాసం హవాయ్!

★ అత్యధిక వర్షపాతం గల ప్రదేశం మౌంట్ వైయిల్వైయవే. ఇది హవాయ్‌లోని కవాయ్ అనే ప్రాంతంలో ఉంది.

★ ప్రపంచంలో హవాయ్ ద్వీపం భౌగోళికంగా చాలా ఏకాంత ద్వీపం.

★ హవాయ్‌లోని మౌనాకీ శిఖరం ఖగోళ శాస్త్ర పరిశోధనకి అత్యంత అనుకూలమైంది. నాసా, ఇతర దేశాల టెలిస్కోప్స్ ఇక్కడ పనిచేస్తున్నాయి.

★ మరో హవాయియన్ ద్వీపం లోయిహీ ప్రస్తుతం ఏర్పడుతోంది. రెండు లక్షల యాభై వేల ఏళ్ల తర్వాత అది సముద్రమట్టానికి చేరుకుంటుంది అని అంచనా.

★ అమీలియా ఇయర్‌హార్ట్ 1935లో హవాయ్ నుంచి కేలిఫోర్నియాకి విమానంలో ఒంటరిగా ప్రయాణించి పద్దెనిమిది గంటల్లో చేరుకుంది.

★ ఓ చక్రవర్తిని గౌరవించే ఏకైక రాష్ట్రం హవాయ్. కింగ్ కమేహోకమేహో డేని ప్రతీ జూన్ 11న ఇక్కడ జరుపుకుంటారు.

★ అమెరికాలోని ఏకైక కోట లోలానీ ప్యాలస్ ఇక్కడే ఉంది.

★ ఇక్కడి కిలాయుయా ప్రపంచంలోని అధిక చురుకైన అగ్నిపర్వతం. 1983 నుంచి ఇది పేలుతోంది.

★ ఇక్కడి లైకికీ బీచ్ 1920ల దాకా చిత్తడి నేల. కేలిఫోర్నియా నుంచి ఇసుకని తెచ్చి నింపి బీచ్‌ని తయారు చేశారు.

★ అమెరికాలో అంతరించిపోతున్న జంతు జాతులు మూడోవంతు హవాయ్‌లోనే ఉన్నాయి.

సమాధానం చెప్పకుండా శిలలాగా నిలబడిపోయింది స్వప్న.

స్వప్న చేతిలోని రెండు బాటిల్స్‌నీ గబుక్కున లాగేసుకుంది అనిత.

"మీలాగే.. సంవత్సరం కిందట.. ఇదే చోట.. అనిత, శశాంక్ ఇలాగే పురుగుమందు తాగి చనిపోవాలనుకున్నారు. శశాంక్ చనిపోయాడు. అనిత మాత్రం.. ఇలా మిగిలింది" అక్క వైపు చూపిస్తూ అన్నాడు శ్రీకాంత్.

అప్పుడు స్వప్నకి ఆపుకోలేనంత దుఃఖం ముంచుకొచ్చింది. బాలు చెయ్యి పట్టుకుని, భుజం మీద తలపెట్టుకుని ఏడవసాగింది.

★ ★ ★

అప్పటికే చాలాసార్లు స్వప్నకి ఫోన్ చేశాడు రంగనాథ్. లైన్ కలవలేదు. స్వప్న, బాలు బీచ్ వైపు వెళ్తున్నారని ఎవరో చెప్పారు. బాలుకి కూడా చేస్తే, ఆ ఫోన్ కూడా నాట్ రీచ్‌బుల్! ఏంచేయాలో తోచలేదు రంగనాథ్‌కి.

★ ★ ★

"..ప్రేమకోసం, ఫలింప చేయడం కోసం జీవించాలి. విఫలమైందని ప్రాణాలు తీసుకోకూడదు. ఎంతకాలమైనా ఓపికగా చూడాలి. అప్పుడే గెలిచినట్టు..!" మాటలు రాని అనిత చెప్పాలనుకున్నది పాఠంలా

## కొత్తగాలి...

**దురద**
**జాడ్యం!**
**నోటి దురద**
**మహా జాడ్యం!!**

– జి. శైలూషి,
హైదరాబాద్

చెప్పాడు శ్రీకాంత్.

సరిగ్గా అప్పుడు స్వప్న ఫోన్ రింగయింది. చూస్తే.. రంగనాథ్! స్వప్న చేతులు వణికాయి. ఆన్సర్ చేస్తూ "హలో! నాన్నా..!" అంది. గొంతు కంపిస్తుండగా.

"ఎక్కడున్నారమ్మా? ఇద్దరూ బీచ్ వైపు వెళ్ళారని చెప్పారు. ఎన్నిసార్లు కాల్ చేశానో! త్వరగా రండి!" రంగనాథ్ అన్నాడు.

"ఈ రోజు స్పెషల్ డే! త్వరగా రండి!" అన్నాడు. కాల్ కట్ అయింది.

చంద్రుని గురుత్వాకర్షణ శక్తికి లోబడి అలలు ఉప్పొంగుతాయి. అయినా సముద్రాన్ని వదిలి పెట్టవు. తీరాన్ని దాటవ్.

ప్రేమ కూడా అంతకన్నా శక్తిమంతమైన ఫీలింగ్! హృదయంలో కలిగే ఈ ఫిలింగ్, జీవితాన్ని దాటి వెళ్ళకూడదు! ఒకవేళ దాటితే.. ఇక జీవితాలే మిగలవు! అందుకే ప్రేమ - గుండె లోపలి ప్రాణశక్తిలాగా, జీవితాన్ని నిలిపే ఊపిరిగా.. ఎప్పటికీ ఉండాల్సిందే! ప్రేమ జీవితాన్ని చిగురింపచేయాలి! కానీ తుంచేయకూడదు! అదీ అసలైన ప్రేమంటే!!

ఎదురుగా మౌనంగా నిలబడిన అనితని ఆర్తిగా చూసింది స్వప్న. ఆమె చెయ్యి అందుకుని చిన్నగా నొక్కింది. వెళ్తున్నామన్నట్లుగా తలూపింది.

అప్పుడు నవ్వింది అనిత. ఆమె పెదవుల చివర నిశ్శబ్ద దరహాసం.

అంతే! బాలు చెయ్యి పట్టుకుని బైక్ వైపు అడుగులేసింది స్వప్న.

★ ★ ★

బాలు, స్వప్న ఇంటికి చేరుకునేసరికి హాల్లో వాతావరణం వింతగా ఉంది. హాల్లో కొత్త ఫొటో తగిలించి ఉంది.

"స్వప్నా! ఫొటోకి దండవేసి, కుంకుమ బొట్టు పెట్టమ్మా!" అన్నాడు రంగనాథ్.

తండ్రి చెప్పినట్లుగా దండ వేస్తుంటే.. ఆ ఫొటోలోని అమ్మాయి నవ్వుతూ తనవైపే చూస్తున్నట్లు అనిపించింది స్వప్నకి. "ఈ ఫొటో ఎవరిది నాన్నా? " అడిగింది.

"ఆమె నీలిమ! నా చెల్లెలు! ఇప్పుడు లేదమ్మా!" చెప్పాడు రంగనాథ్.

దూరంగా నిలబడిన జానకమ్మ నిర్లిప్తంగా చూస్తోంది.

నీలిమ!! ఆ పేరు వినగానే స్వప్నలో షాక్ తగిలినట్లయింది. కళ్ళెత్తి బాలువైపు చూసింది. బాలూ కూడా షాక్‌కి గురయినట్లుగా చూస్తున్నాడు.

అప్పుడు ఎందుకనో స్వప్న కళ్ళలోంచి కన్నీళ్లు! ఇది గమనించిన జానకమ్మ స్వప్న భుజం మీద చేతులేసి దగ్గరకు తీసుకుంది. వెంటనే తేరుకుంది స్వప్న.

"ఇంతవరకూ చెప్పలేదేంటి నాన్నా? "

"ఒక్కోసారి పరిస్థితులు అలా వస్తుంటాయి స్వప్నా! కొన్ని మనమే చేసుకుంటాం! కొన్ని మనకి సంబంధం లేకుండా జరుగుతుంటాయి! అన్నిటినీ తీసుకుంటూ ముందుకి సాగడమే జీవితమంటే! పదండి మేడ మీదకి! నాకు బాగా ఆకలేస్తోంది" అన్నాడు రంగనాథ్.

అందరితోపాటు బయటికి అడుగులేస్తూ నీలిమ ఫొటోని చూసింది స్వప్న.

నీలిమ నవ్వుతున్నట్లుగా ఉంది. కళ్ళలోకి కళ్ళు కలిపి, గుండె లోతుల్లో తడుముతున్నట్లే ఉంది.

చివరగా జానకమ్మ, రంగనాథ్ వరండాలోకి వచ్చారు. మొయిన్ డోర్ వేస్తున్న

కొడుకుతో, "రంగా! ఒకటి అడుగుతాను! నిజం చెబుతావా?" అడిగింది జానకమ్మ.

"అడుగమ్మా!" అన్నాడు.

"నీ చెల్లెలిలాగా, నీ కూతురు కూడా ఎవ ర్నైనా ప్రేమిస్తే? అప్పుడు నువ్వేం చేస్తా వురా? చెప్పు!" అడిగింది జాకనమ్మ.

ఒక్కక్షణం పాటు మౌనంగా ఉండిపో యాడు రంగనాథ్.

"తను ఇష్టపడినవాడు.. ప్రేమగా చూసుకుంటూ.. ప్రేమతోనే బతికేవాడైతే.. నీ ఇష్టం అంటాను" చెప్పాడు.

అప్పుడతనికి ఏ లోకంలోనో ఉన్న నీలిమ గుర్తొచ్చింది.

విశాల విశ్వం.. గ్రహాలు, నక్షత్రాలు.. ఒకదానితో ఒకటి ఢీకొట్టుకోకుండా, వినాశం కాకుండా కాపాడేది, కంటికి కని పించని సౌర గురుత్వాకర్షణ శక్తి. కుటుం బాలు, బంధాలు, అనుబంధాలు విచ్ఛిన్నం కాకుండా పట్టి వుంచే శక్తే ప్రేమంటే!! రూపం లేని, ఆది, అంతం లేని.. సరిహ ద్దులూ, పరిమితులూ లేని.. ఒకే ఒక్క ఫీలింగ్. అదే.. ప్రేమంటే!!

అందరూ ప్రేమిస్తారు. కొందరు వ్యక్తప రిస్తే, కొందరు తమలోనే దాచుకుంటారు. అక్కడే సమాధి చేసుకుంటారు. కొందరు ప్రేమ కోసం జీవితాల్ని బలి చేసుకుంటే.. కొందరు ప్రేమ కోసమే జీవితాన్ని నడిపిం చుకుంటారు. ప్రేమ.. ఒక శక్తి.. ఒక ఊపిరి.. ఒక ఫీలింగ్..!

★ ★ ★

నిర్మానుష్యంగా.. సముద్రతీరం!

అలలు తాకని పొడి ఇసుకలో కూర్చుని ఉంది అనిత.

అప్పుడామె చేతిలో శశాంక్ ఫొటో! తన కళ్ళలోకి చూస్తున్నట్లుగా ఉన్న శశాంక్‌నే తదేకంగా చూసింది అనిత.

సరిగ్గా ఏడాది క్రితం. ఇదే రోజు.. తను, శశాంక్ తమ జీవితాలకి ఫుల్‌స్టాప్ పెట్టాలనుకున్నారు. ఇక్కడే చివరిసారి అడుగులో అడుగు వేసుకుంటూ నడి చారు. ఆనాటి గుర్తులు ఇప్పుడు లేవు. అ దే సముద్రం. అవే అలలు. కానీ శశాంక్ మాత్రం లేడు. కేవలం తనొక్కతే!!

"నన్ను వదిలి నువ్వెళిపోయావు.

నేను నీ కోసం దుఃఖిస్తూ, నిన్నే నా హృదయంలో ఆలోచనలలో ప్రతిష్ఠించుకు న్నాను. అలాగే జీవిస్తున్నాను.

కాలం పరిగెడుతోంది. అన్నిటినీ మాయం చేస్తోంది.

నేను మాత్రం - ఎంత త్వరగా నిన్ను చేరాలా? అని, క్షణాలు, నిమిషాలు, గంట లు లెక్కపెడుతూ వస్తూనే ఉంటాను.

నిన్ను ప్రాణంలా ప్రేమించే నన్ను.. ఇంత త్వరగా ఎందుకు వదిలిపెట్టి వెళ్ళావు? తుపాన్ రేపే నీ గుర్తులు నా జీవితానికి వదిలి!!"

అలల్ని కళ్ళార్పకుండా చూస్తున్న అనిత భుజం మీద చెయ్యేసి "అక్కా..!" అన్నాడు శ్రీకాంత్.

తల తిప్పి చూసింది అనిత.

"బాగా చీకటి పడుతోంది! పద వెళ్దాం!" అన్నాడు శ్రీకాంత్.

మౌనంతో ఘనీభవించిన విగ్రహంలాగ, నిర్లిప్తంగా లేచి నిలబడి, శ్రీకాంత్‌తో పాటు ముందుకి నడిచింది అనిత.

అన్ని ప్రేమ కథలు చరిత్ర సృష్టించవు.

కొన్ని కాలగర్భంలో కలిసిపోతాయి.

కొన్ని చరిత్రపుటల్లో మిగిలిపోతాయి.

కానీ, యుగాలు మారినా ప్రేమ మాత్రం నిలిచే ఉంటుంది.

ప్రతిక్షణం ఏదో హృదయంలో పురుడు పోసుకుంటూనే ఉంటుంది.

ఎన్నో జీవితాల్ని పరిమళింపజేస్తూనే ఉంటుంది.

దుఃఖంలో ముంచి తేలుస్తూనే ఉంటుంది.

సృష్టి ఉన్నత కాలం.. ప్రేమ.. అజరా మరం!! ©

# పార్టీ

- శేషచంద్ర



పది వేలు ఖర్చు పెట్టాలంటే మనసొప్పలేదు పిసినారి రామమౌళికి. మొదటి నెల జీతం రాగానే దాంతో తన ఊర్లోనున్న అమ్మ, నాన్న లకు, తమ్ముడు, చెల్లెలికు బట్టలు కొనాలని చెప్పి సెంటిమెంట్ మీద దెబ్బకొట్టి పార్టీ ఇవ్వకుండా ఎస్కేప్ అయ్యాడు.

రెండో నెలకూడా ఎదురు చూసిన మిత్రులకు ఆశా భంగం అయ్యింది. జీతం తీసుకునే రోజు అందరికీ ఓకే చెప్పి ఆరు గంటలకు బార్ దగ్గరకు రమ్మని, ఆరున్నరకు ముఖం దిగా

సాయంత్రం ఐదు గంటలనుండి మొబైల్ మోగుతూనే ఉంది మౌళిది. ఆ కాల్స్ అన్నీ ఫ్రెండ్స్ దగ్గరనుంచే. అందుకే రామమౌళి మొబైల్ లిఫ్ట్ చేయడం లేదు. కట్ చేయడం లేదు. రామమౌళి కొత్తగా ఉద్యోగంలో చేరి మూడు నెలలవుతుంది. ఉద్యోగం వచ్చిన మొదటి నెలలోనే పార్టీకి డిమాండ్ చేశారు నలుగురు మిత్రులు. జీతం రాగానే పార్టీకి ఓకే అనేశాడు. కానీ ఫ్రెండ్స్ పార్టీకి చూస్తూ చూస్తూ లేసుకొని వచ్చి తన పర్సు ఎవరో కొట్టేశారని అబద్ధపు మాటలు చెప్పి తప్పించుకున్నాడు. ఆరోజు ఫ్రెండ్స్ అతన్ని మనసులోనే తిట్టుకుంటూ తమ జేబులోని డబ్బులతోనే రామమౌళికి మందు పోయించారు.

ఇక ఇది మూడో నెల.

తప్పించుకొనేందుకు మార్గం లేదు. ఉదయమే తిట్టిమరీ విషయం గుర్తు చేశారు. ఇక ఈ రోజు సింపుల్‌గానైనా పార్టీ ఇవ్వాలనుకున్నాడు మౌళి. కానీ లంచ్ అవర్‌లో భోజనానికి బయటికి వెళ్లి వస్తుంటే నిజంగానే ఎవరో పర్సు కొట్టేశారు.

రామమౌళికి పర్సు పోయిందన్న బాధతో పాటు డబ్బులేందే ఫ్రెండ్స్‌కు పార్టీ ఎలా ఇవ్వాలా అన్న ఆలోచన పట్టుకొంది. తను పర్సు పోయిందని నిజం చెప్పినా నమ్మే స్థితిలో లేరు మిత్రులు. అందుకే సాయంత్రం ఐదు గంటలనుండి మొబైల్ మోగుతుంటే సమాధానం ఏం చెప్పాలో దిక్కుతోచక మౌనంగా ఉండిపోయాడు. వాళ్లు మాత్రం పట్టు వదలని విక్రమార్కుల్లా ఫోన్ చేస్తూనే ఉన్నారు. ఇక కాసేపైతే ఆఫీసు దగ్గరికే వచ్చేటట్లుంది వాళ్ల వాలకం.

ఎవరినైనా అప్పు అడిగేందుకు ఆఫీసుకు తను కొత్తగా చేరాడు. అప్పుడే ఎవరిని అప్పు అడగాలి అని ధర్మ సంకటంలో పడిపోయి చివరికి ఏమైతే అది అయ్యిందని మొబైల్ లిఫ్ట్ చేశాడు. మొబైల్ లిఫ్ట్ చేయగానే బండ బూతులు తిట్టడం మొదలుపెట్టాడు అవతల వైపునుంచి శ్యామ్ కృష్ణ. తిట్లన్నీ మౌనంగా భరిస్తున్న రామమౌళి మీద జాలేసి "ఏమైందిరా నీకు, ఉలకవు పల కవు?" అన్నాడు చివరగా.

"నువ్వెందుకు తిడుతున్నావో నాకేం అర్థం

# చతుర కత

కాలేదు మావా!" అన్నాడు అమాయకంగా మౌళి.

"ఎందుకు తిడ్తున్నానో, నీ మొబైల్ చూడరా అర్థమౌతుంది"

"అవునురా మావా! ఏమైందిరా.. ఇన్ని మిస్డ్ కాల్స్? సారీరా మొబైల్ మ్యూట్‌లో ఉండిపో యింది" అని అమాయకంగా అంటున్న రామ మౌళితో "నీ వెధవ డ్రామాలాపి సాయంత్రం గోకుల్ బార్‌కొచ్చేయ్" అన్నాడు విసుగ్గా శ్యామ్‌కృష్ణ.

ఆ మాట అనగానే "రేయ్ మావా అది.. అది" అంటూ నసిగాడు రామమౌళి.

"నీ సణుగుడు ఆపి చెప్పిన టైంకు వచ్చేయ్, గోవిందలాల్ పార్టీ ఇస్తానన్నాడు మిస్ అయితే నీ ఖర్మ!" అన్నాడు శ్యామ్‌కృష్ణ.

కొండంత భారం తలమీదనుంచి దించి నట్లై, "ఎందుకు మావా, వాడు పార్టీ ఇచ్చేది?" అన్నాడు సంతోషంగా.

గోవిందలాల్ జల్సా మనిషి ఏదో ఒకటి చెప్పి పార్టీలు ఇస్తుంటాడు. పార్టీకి కారణం ముందుగా చెప్పే అలవాటు లేదతనికి.

"అదేమో తెలియదురా, నువ్వు వచ్చేయ్"

విషయం తెలిసిన తరువాత తనకు వచ్చిన మిస్డ్ కాల్స్‌కు ఫోన్ చేసి సంజాయిషీ చెప్పుకోసా గాడు, పార్టీలో బండ బూతులుతిడ్తారని.

రెండు రౌండ్లు పూర్తి అయిపోయాయి. కేరిం తల మధ్య పార్టీ రంజుగా సాగుతోంది.

"థ్యాంక్స్‌రా, గోవిందు మావా! ఉద్యోగం సద్యోగం లేకపోయినా నెలకు రెండు మూడు పార్టీలిస్తుంటావ్. కాని ఈ రామమౌళిగాడు న్నాడు చూడు వెధవ! మూడునెలలనుంచి తప్పిం చుకు తిరుగుతున్నాడు" రామమౌళి వంక చూస్తూ అన్నాడొకడు.

దానికి రామమౌళి "అరే మావా! ఈ నెలలో నిజంగా ఏమైందంటే..." అని చెప్పబోతుంటే,

"ఆ ఏమైందిరా! మళ్లీ పర్సు పోయిందా లేక దోపిడీ దొంగలొచ్చి, కత్తి చూపించి, నీ అమూల్య జీతసంపదంతా దోచుకుపోయారా? అరే నీ అయ్యా! ఇంత పిసినారి నాకొడుకువి మాకు ఫ్రెండ్ ఎలా అయ్యావురా?" ఇంకొకడు వెక్కిరింతగా,

"అరె వాడి వెధవ సొద ఎప్పుడుండేదే కానీ అరే మావా ఇంతకు పార్టీ ఎందుకిస్తున్నావో చెప్పనేలేదు" అన్నాడు శ్యామ్‌కృష్ణ గోవింద్ లాల్‌ను చూస్తూ..

"ఓ అజ్ఞాత వ్యక్తి ఇచ్చిన డబ్బుతో మీకు పార్టీ ఇస్తున్నా. మన పార్టీకి విరాళమిచ్చిన ఆ అజ్ఞాత దాతకు మనం జై కొట్టాలి మావా, అంతేకాదు పరాయి సొమ్ము మనకెందుకని అతని పేరున ఓ వికలాంగుల ఆశ్రమానికి ఓ పదివేలు విరాళం కూడా ఇచ్చా" అన్నాడు మత్తుగా గోవింద్‌లాల్

"ఎవరు మావా! ఆ అజ్ఞాత దాత, మన పార్టీ క్కూడా విరాళమిచ్చిన దాత?"

"ఎవరో నాకు తెలిస్తే మనకు ఈ పార్టీ ఎక్క డుంటుంది? అజ్ఞాత దాత అని ఎందుకంటాను మావా? కాని ఒక్కటి మాత్రం నిజం అతనే దీనికి ఓనర్.

పాపం అతన్ని గుర్తించి ఇచ్చేందుకు అందులో అతని వివరాలేం లేవు" అంటూ ప్యాంటు జేబు లోంచి తీసి ఓ పర్సు చూపించాడు. నాలుగోరౌం డువరకు నిలకడగా నిలబడే రామమౌళి దాన్ని చూసి మూడోరౌండ్ కొట్టక ముందే మైకం వచ్చి పడిపోయాడు!

పాపం ఆ పర్సు అతనిదే! ©




## వల్లంపాటి వెంకట సుబ్బయ్య

# ఇంద్రధనుస్సు

నిర్వహణ : **వి. రాజారామమోహనరావు**

**మార్క్సిస్ట్ విమర్శకుడిగా ప్రాచుర్యం పొందిన వల్లంపాటి వెంకట సుబ్బయ్య.. కథలు, నవలలూ రాశారన్న విషయం కొద్దిమందికే తెలుసు. 'ఇంద్రధనుస్సు - దూరతీరాలు- మమతలు మంచుతెరలు' అనే మూడు నవలలు, దాదాపు డెబ్బై కథలూ రాశారు. ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక తొలిసారి నిర్వహించిన నవలల పోటీలో 'ఇంద్రధనుస్సు'కు రెండో బహుమతి వచ్చింది. ఈ నవలను 1962లో ఆంధ్రప్రభ వారపత్రికలో ధారావాహికంగా ప్రచురించారు.**

**వ**ల్లంపాటి రాసిన నవలలకు గ్రామీణ జీవితమే నేపథ్యం. 'మన సభ్యతకి పురిటిగడ్డ గ్రామీణ జీవితం' అంటారు వెంకట సుబ్బయ్య 'దూరతీరాలు' నవల ముందుమాటలో. అందుకే విలువల సంఘర్షణని చిత్రించే ప్రయత్నంగా రాసిన నవలలకి గ్రామీణ జనజీవనం నేపథ్యం అయింది. వల్లంపాటి 1960-1975 మధ్య కాలంలో ఈ నవలలు రాశారు. ఆ కాలానికి ఓ ప్రత్యేకత ఉంది. గ్రామాలకి.. పరిసర పట్టణాలకి, పట్టణాలకి.. అవి ఆధారపడే నగరాలకి మధ్య సంబంధాలు మరింతగా పెరిగిన కాలం అది. దీన్ని ఓ అవ్యవస్థ అన్నారు వెంకటసుబ్బయ్య.

'మన సభ్యత ప్రాతిపదికగా ఏర్పడిన చాలా విలువలు నేడు చాలా త్వరితంగా మారిపోతున్నాయి. తనలోని సంఘర్షణను జయించలేని వ్యక్తి తిరుగుబాటుదారుడుగా, అవినీతి పరుడుగా, మిథ్యావాదిగా మారి సంఘంలో ఘర్షణ పడుతున్నాడు' ఇవీ వెంకటసుబ్బయ్యగారి మాటలే. ఈ వాతావరణంలోని పాత్రల మనసు లోతుల్లోని భావాలను ఆవిష్కరించే ప్రయత్నమే తన నవలారచన అన్నారు.

నవలల్లోని కథకన్నా, వాటి సహజత్వం కన్నా వెంకట సుబ్బయ్యగారికి తను చెప్పదలచుకున్న పైవిషయమే ప్రధానం. ఆ రకంగానే ప్రణాళికా, సూత్రీకరణా సాగాయి. 'ఇంద్రధనుస్సు' నవల కూడా ఆ రకంగానే రూపొందింది.

ఏడు రంగుల కలయిక ఇంద్రధనుస్సు. అలాగే ఏడురకాల భిన్నపాత్రల కథే 'ఇంద్రధనుస్సు' నవల. ప్రకాశం, సారథి, భానుమూర్తి, ఉమాపతి, విమల, శారద, ఇందిర ఈ నవలలో ముఖ్యపాత్రలు.

ఆ గ్రామం మొత్తంలో విశ్వనాథయ్యగారికి మంచి మనిషి అని పేరు. అన్నమాటకి, ఆదర్శానికి కట్టుబడే వ్యక్తిత్వం ఆయనది. సభ్యత, సంప్రదాయాలంటే ఆయనకి ప్రాణం. ఆయనకి పూర్తిగా వ్యతిరేకం, ఆయన ఒక్కగానొక్క కొడుకు ఉమాపతి.

ఉమాపతివన్నీ వక్రబుద్ధులు. వ్యసనపరుడు. మదరాసులో చదువు. ఇంటికి వచ్చినప్పుడల్లా అతని దృష్టి శారదమీదే. శారద విశ్వనాథయ్యగారికి మేనకోడలు. విధవరాలైన చెల్లెలు రత్నమ్మ కూతురు. ఉమాపతికి వరస.

శారదకి ఏమీ పాలుపోని పరిస్థితి. ఉమాపతి అంటే ప్రేమా లేదు.. ద్వేషమూ లేదు. అస్తమానం చొరవతో అతను చేసే పనులంటే భయం. అతని స్పర్శ, కౌగిలింతలు, ముద్దులు ఆ పసి మనసుని ఎక్కువ కంగారుకే గురిచేసేవి. శారద అమాయకత్వం, అశక్తత, ఉమాపతికి ఉపయోగపడ్డాయి. ఓసారి పొలం దగ్గర అవకాశం చూసుకుని శారదని అనుభవించాడు. ఆడది దొరికితే అనుభవించటమే మగవాడి పని అని ఉమాపతి అభిప్రాయం. తన దారిన తను తిరిగి మదరాసు వెళ్లిపోయాడు. అక్కడ విమల అనే స్త్రీతో కలసి ఉంటున్నాడు అతను.

ఉమాపతి శారదని చేసుకుంటే ఆ ఇంట్లో తన పెత్తనం సాగుతుందని శారద తల్లి రత్నమ్మ

ఆశ. విశ్వనాథయ్యగారికి మాత్రం శారదని ఉమాపతికి చెయ్యటం ఇష్టం లేదు. యోగ్యుడు, మంచివాడు అయిన తన శిష్యుడు ప్రకాశానికి ఇచ్చి చేస్తే బావుంటుందని ఆయన ఆశ. ప్రకాశంతో మాట్లాడితే అతను ఒప్పుకున్నాడు. అతని తల్లీ సమ్మతించింది. పెళ్లికి ముహూర్తం పెట్టిద్దామనుకుంటున్న సమయంలో శారద గర్భవతి అన్న వార్త తెలిసింది. నెత్తిన పిడుగు పడినట్టయింది. ఈ వార్త తెలిశాక కూడా ప్రకాశం పెద్ద మనసుతో శారదని పెళ్లి చేసుకుంటానని తిరిగి తన స్థిర నిర్ణయం చెప్పాడు. ఈ పెళ్లి రత్నమ్మకి ఇష్టం లేదు. మొదటి నుంచీ పెళ్లి చెడగొట్టాలని, ఎలాగైనా ఉమాపతికే శారదని కట్టబెట్టాలని ఆవిడ తాపత్రయం. అందుకే ఏ తల్లీ చెయ్యని పని చేసింది. శారద గర్భవతి అని ఆవిడే ప్రచారం చేసింది. నిజానికి శారద గర్భవతి కాదు. నెలసరి కొద్దిరోజులు ఆలస్యమైంది అంతే! ఇంతటి ఆటంకం తర్వాత కూడా ఆ పెళ్లి చెడిపోనందుకు విశ్వనాథయ్యగారు, శారద ఎంతగానో సంతోషించారు.

విమల, ఉమాపతి కలిసి ఉంటున్నారు. ఇద్దరివీ భిన్నధ్రువాలే! మదరాసులో ఉమాపతి ఏ పరిస్థితిలో ఉన్నాడో తెలియక విశ్వనాథయ్యగారు ఆందోళనతో ప్రకాశాన్ని ఓసారి వెళ్లిచూసిరమ్మన్నారు. అలా వచ్చిన ప్రకాశానికి ముందు విమల కనిపించింది. విమల భావాలు, ఉమాపతి ఉద్దేశాలు అర్థమయ్యాయి. వాళ్ళ పరిస్థితికి చెయ్యగలిగిందేం లేదని అర్థమై ఎంతగానో నిరాశకి గురయ్యాడు.

'మేమిద్దరం వివాహం చేసుకోం! అంతేకాదు, మేం ఇద్దరం కూడా మరెవర్నీ జన్మలో వివాహం చేసుకోకూడదని ప్రమాణం చేసుకున్నాం. మా ఇద్దరికీ వివాహం అంటే గిట్టదు! కోరికల్ని చంపుకుని, పీనుగులుగా బతికే బతుక్కు మేమిద్దరం వ్యతిరేకులం!' అని విమల కుండ బద్దలుకొట్టినట్టు చెప్పింది.

'ఇష్టం ఉన్నన్ని రోజులు కలిసి కోరికలు తీర్చుకుంటాం! కష్టమైతే విడిపోతాం!' అని ఉమాపతి అన్నాడు.

వారిది 'స్వేచ్ఛా ప్రణయం' అని ప్రకాశానికి అర్థమైంది. ఊరికి తిరిగి వెళ్ళి విశ్వనాథయ్యగారికి అంతా వివరించాడు ప్రకాశం. ఉమాపతిని మద్రాసు నుంచి వెనక్కి పిలిపించగలిగితే నయం అని కూడా చెప్పాడు.

వీళ్ళేకాదు, ఈ నవలలో మిగిలిన పాత్రలూ విచిత్రమైనవే! సారథి- ప్రకాశం మిత్రుడు.




రచయిత, అభ్యుదయవాదినన్న విశ్వాసం వున్నవాడు. సమాజంలో అన్ని సమస్యలకీ ఆర్థిక కారణాలే పునాది అన్న నమ్మకం అతనికి! భానుమూర్తి మరో మిత్రుడు. మంచి ఉపాధ్యాయుడు. ప్రకాశం వాళ్ళ ఊళ్ళోనే ఉద్యోగం. అతనికి, ఇందిరకి పరస్పర అనురాగం. తండ్రి జగన్నాథం ఇష్టపడడని తెలిసీ ఇందిర భానుమూర్తిని ఎంచుకుంది. వీళ్ల విరుద్ధభావాలు.. సంఘర్షణలు.. విచిత్ర పరిస్థితులకి తోడు గ్రామంలో ఎన్నికలు! జగన్నాథంగారికి పోటీగా విశ్వనాథయ్యగారు నిలబడి గెలిచారు. ఉమాపతి ఇల్లొదిలి వెళ్ళిపోయాక ఎంతో దిగులుగా వున్న ఆయనకి దక్కిన విజయం అది!

ఉమాపతి, విమల విడిపోయారు. ఇద్దరూ రకరకాలుగా పలు కష్టాలు పడ్డారు. చాలాకాలానికి తిరిగి కలుసుకున్నాక పరస్పరం ఒకరి చేరువ మరొకరికి ఎంత అవసరమో ఇద్దరికీ తెలిసివచ్చింది.

తన అభ్యుదయ భావనలు సరైనవే అని తెలిసినా జీవితంలో స్థిరపడటానికి ఉపయోగంగా లేవని సారథికి అర్థమైంది. అందుకే అందవికారి అయినా, బాగా డబ్బున్న సౌదామినిని పెళ్ళిచేసుకున్నాడు. భానుమూర్తి, ఇందిర- ప్రకాశం, శారద కూడా పెళ్ళికి సిద్ధమయ్యారు.

ఈ నవలని సారథి ఉత్తరంతో ముగించారు వల్లంపాటి. ఆ ఉత్తరం ప్రకాశానికి రాశాడు సారథి.

'ఒకరకంగా చూస్తే నువ్వూ, నేనూ, భాను

# నవజీవన శిల్పి వల్లంపాటి



వల్లంపాటి వెంకటసుబ్బయ్య విమర్శకుడిగానే సాహిత్యలోకంలో మంచి గుర్తింపు పొందారు. 'కథాశిల్పం,' 'నవలాశిల్పం,' విమర్శాశిల్పం'.. ఈ మూడు పుస్తకాలూ తెలుగు విమర్శనా సాహిత్యంలో ప్రామాణిక రచనలుగా చెబుతారు. విమర్శనా రంగంలోకి అడుగుపెట్టక ముందు ఆయన కథలు, నవలలూ రాశారు. రాస్తూనే విస్తృతంగా చదువుకున్నారు. ఒకవైపు మదనపల్లి కాలేజీలో పాఠాలు చెబుతూనే మరోవైపు తెలుగు రచయితలకూ విమర్శనా పాఠాలు చెప్పారు. ఇక ఇక్కడి నుంచీ ఆయన కథలు రాయడం తగ్గిపోయింది. మూడు నవలలతోనే ముగించేశారు. వల్లంపాటి వెంకటసుబ్బయ్య కథారచయితగా మొదలై నవలాకారుడిగా మారి, విమర్శకుడిగా తెలుగు సాహిత్యంలో స్థిరపడిన పరిణామక్రమానికి ఆయన కథలూ, నవలలూ అద్దంపడతాయి. సంప్రదాయం నుంచి మార్క్సిస్టు ఆలోచనా ధోరణికి ఆయన మరలిన వైనాన్ని ఇవి వెల్లడిస్తాయి.

మూర్తీ, ఉమాపతీ నలుగురూ జీవిత చతుర్భుజంలో నాలుగు కోణాలు! ఒక్కొక్కరి జీవిత దృక్పథం ఒక్కొక్కరకమైంది. ఉమాపతి జీవితంలో పోరాడి ఓడిపోయాడు. నేను ఆదర్శాలని, ఉత్తమ అభిరుచుల్ని వదిలి జీవితంతో రాజీపడ్డాను. భానుమూర్తి ఒకరకంగా జీవితం మీద విజయం సాధించాడనే చెప్పవచ్చు. కానీ జీవితాన్ని పూర్తిగా జయించినవాడివి నువ్వు..!' ఇదీ ఆ ఉత్తరంలో ముఖ్యమైన విషయం. వీళ్ళతో పాటు సాగిన శారద, ఇందిర, విమల, సౌదామినుల జీవితం ఈ నవల.

కాలాన్నిబట్టి మారుతున్న మనస్తత్వాలే నవల ప్రధాన విషయం అయినా, అంతరంగ మథనమే ప్రధానదృష్టి అయినా, సాంఘిక జీవనం, బలహీనపడుతున్న సభ్యత.. సంస్కారాలూ, వీగిపోతున్న ఆదర్శాలూ నేపథ్యంగా తొంగిచూస్తాయి 'ఇంద్రధనుస్సు' నవలలో! ఈ నవల రాసేనాటికి వల్లంపాటి గుర్తింపు ఉన్న మార్క్సిస్ట్ కాదు. మార్క్సిస్ట్ విమర్శకుడూ కాదు. పరిణామదశలో వున్న సాహిత్యకారుడు. ఆయన మౌలిక ఆలోచనలు.. మానవతా విలువల పట్ల ఆయనకున్న అమితమైన ప్రేమను తెలిపే రచన ఇది. నవలలో ఎవరికీ అన్యాయం జరగనివ్వలేదు. ఆయనలోని అప్పటి ప్రధాన తత్వాన్ని తెలిపే ముఖ్యమైన అంశం అది.

ఈ నవలలోనే ఒకచోట.. 'రాబోతున్న కాలాన్ని దర్శించగలిగినవాడే అభ్యుదయవాది' అని వల్లంపాటి ఒక పాత్రతో అనిపించారు. ఈ నవల రాసేనాటికే అంటే 1962లోనే- ఇంకా తరువాత ఎప్పుడో యాభైఏళ్ళనాటికికాని ప్రాచుర్యంలోకి రాని సహజీవనాన్ని దర్శించగలిగాడు ఈ రచయిత. విమల, ఉమాపతితో సహజీవనం చేయించాడు. అంతేకాక ఆ సహజీవన పరిణామాన్ని కూడా చూపించారు. సాంఘికంగా వున్న పలు సంఘర్షణలని, మనస్తత్వ విశ్లేషణగా చూపించిన విభిన్నమైన నవల 'ఇంద్ర ధనుస్సు'

'ప్రతి ఆడదానికీ ఏక్షణంలోనైనా సరే ఇద్దరు మగాళ్ళ మీద మనసుంటుంది' లాంటి విమర్శనాత్మక వ్యాఖ్యల్ని ధైర్యంగా చేయించారు వల్లంపాటి. 'స్త్రీపురుషుల మధ్య ప్రేమలేదు! ఉన్నదల్లా పరస్పర ఆకర్షణ, వాంఛ మాత్రమే' ఇదీ ఈ నవలలోని వ్యాఖ్యయే!

'ఎక్కువగా జీవితాన్ని గూర్చి ఆలోచించేవాడు సుఖపడలేడేమో!'- ఇది ఉమాపతి మాటే అయినా, ఎప్పుడో ఒకప్పుడు చాలామందికి కలిగే భావనే. దీనికి కారణం సాంఘిక వాతావరణం.

సంఘం సరిగ్గా ఉండాలి అన్న సూత్రం ప్రకారం కొన్ని రచనలుంటే- వ్యక్తులు సరిగ్గా ఉండాలన్న సూత్రం మీద కొన్ని రచనలుంటాయి. ఈ రెండు విధానాల కలగలుపు 'ఇంద్ర ధనుస్సు'

వ్యక్తుల పరమైన కథలాగే నడుస్తూ, స్వాతంత్ర్యపోరాటం, కాంగ్రెసు ఉద్యమం, స్వాతంత్ర్యానంతరం కాంగ్రెసులో మార్పులు, పాత విలువలకే కట్టుబడిన విశ్వనాథయ్యగారిలాంటి వారి మనోవేదన.. ఇలా ఎన్నో విషయాల్ని తనలో కలుపుకున్న నవల ఇది. వల్లంపాటి వెంకటసుబ్బయ్యగారి రచనావ్యాసంగం ప్రారంభం తీరుతెన్నుల్ని తెలిపే చక్కటి నవల 'ఇంద్రధనుస్సు'.



# చతుర ప్ర.జ.

పాఠకుల ప్రశ్నలకు ప్రవచన వాచస్పతి, అభినవ వ్యాస టి.కె.వి. రాఘవన్ సమాధానాలు

**ప్ర. సామూహికంగా భగవన్నామ స్మరణ చేస్తూ, అలౌకికానందం పొందుతూ, భక్తులు తరించే మార్గం భజన. కానీ నేడు ఈ పదాన్ని కొందరు వ్యంగ్యంగా, ఎత్తిపొడుస్తూ వాడడం ఎంతవరకు సబబు?**

– యు. చిట్టిబాబు,
న్యూ పాల్వంచ, ఖమ్మం జిల్లా

జ. 'భజ పూజాయాం' అని ధాతువు. గౌరవ నీయులైన వారిని ఆదరించుట 'భజన'. వ్యాకరణ సూత్రాల ప్రకారం 'భజ' శబ్దము నుంచి 'భజన' ఏర్పడింది. పురందరదాసు వంటి పెద్దల కాలం నుంచి భజన సంప్రదాయానికి పునాది ఏర్పడింది. ఈ పదాన్ని వ్యంగ్యార్థంలో ఉపయోగించడానికి కారణం - భజన (సంగీత) కార్యక్రమంలో పాల్గొనే వారు అందరూ సంగీతం తెలిసిన వారు ఉండరు. వాద్యాలు, తాళాలు మొదలైనవి వదిలితే, మిగిలినవారందరు గొంతు కలపడమే చేయడం కద్దు. అంటే భగవంతుని నామం తెలిసినా, తెలియకున్నా అనుగ్రహిస్తారు ఆ నామం పలికితే చాలు అని ఉంది గదా! - ఇలాగే కొందరని ఏదో ప్రయోజనం ఆశించి, విషయం తెలియకుండా, పదిమందినీ అనుసరిస్తూండడం 'భజన'గా ఏర్పడింది. ఇలాంటి పదాలే 'కుంభకోణం' 'హారతి కర్పూరం' 'కైంకర్యం' - ఇలా మంచి పదాలని, సార్థక పదాలని, భావాలు (ఏ) మార్చి ప్రయోగించడం అన్ని భాషలలోనూ ఉంది! ఏం చేయగలం!

**ప్ర. మనుషుల ప్రవర్తన, నీతి, న్యాయం, ధర్మం- వీటికి ఆయా యుగాలకు సంబంధం ఉంటుందా?**

– డా. సి. జనార్ధన సింగ్,
నల్లకుంట, హైదరాబాద్

జ. సుమారు ఏభై సంవత్సరాల క్రిందటి చిల్లు కానీలు, అర్ధణా, అణా, అయిదు పైసలు, బేడ.. ఇవి ఈరోజుల్లో చెల్లవు. అలాగని ఆ రోజులలో ఎవరూ డబ్బు గురించి తెలియని అనాగరికులు అనలేం. మన కరెన్సీ అమెరికాలో చెల్లదు. అంటే రూపాయికి విలువ లేదు అందామా! అర్థం అది కాదు. కాలం, దేశం, పరిధి, ఆచార వ్యవహారాలను బట్టి కొన్ని పద్ధతులు మారుతుంటాయి. 'న్యాయాలు' వ్యవస్థకి సంబంధించిన సిద్ధాంతాలు. 'నీతి' ఆయా సిద్ధాంతాల సందేశం. 'ప్రవర్తన' సందేశాల ద్వారా ఏర్పడిన ఆచార వ్యవహారాలు. 'ధర్మం' వ్యక్తిని వ్యక్తిగా రూపొందించే నియమావళి. ఇవి యుగాలను బట్టి మారుతాయి అన్నా, ఆయా మార్పులని బట్టి యుగాలను విభాగించగలం అన్నా - ఒకదానికొకటి పూరకాలు. కానీ ఒకటి నిజం. మన నాణెములకి ఒక ప్రక్క ఉండే నాలుగు సింహాల బొమ్మ 'సత్యము'. రెండవ ప్రక్క ఉండే విలువ- 'ధర్మము'. సత్యము ఎపుడూ ఒక్కటే. అది నీతి, నియమాలు, న్యాయాలు. ధర్మం మాత్రం ఆయా దేశ కాలములను బట్టి మారుతుంది. ఇదే యుగాలు భ్రమణం చెందుతాయి అనడంతో అంతరార్థం!

**ప్ర. హిందువులకు మాత్రమే అంతమంది దేవుళ్లు ఎందుకు ఉన్నారు? దేహమే దేవాలయమైనపుడు మనమూ దేవుళ్లమేనా?**

– కరణం శివానందరావు, కర్నూలు

జ. మనకీ ఒక్కడే దేవుడున్నాడు. ఆ తత్త్వాన్ని 'బ్రహ్మ' (నాలుగు ముఖాల ప్రజాపతి కాదు) లేదా 'నారాయణుడు' అన్నారు. పెరిగేది, విస్తరించేది, అన్నింటికన్నా పెద్దది అని మొదటి పదానికి అర్థం. సకల జీవరాశుల పుట్టుకకి, ఉనికికి, చేరికకి కారణమైనది అని రెండవ పదానికి

# చతుర ప్ర.జ. 9

ఉత్తమ ప్రశ్నకు రూ.116/-

జిజ్ఞాసువులైన పాఠకుల ఆదరాభిమానాలు అత్యంతంగా చూరగొన్న 'చతుర ప్ర. జ' శీర్షికను నిర్వహించడానికి ప్రవచన వాచస్పతి, అభినవ వ్యాస **టి.కె.వి. రాఘవన్** అంగీకరించారు. ఆచార వ్యవహారాలు.. సంస్కృతీ సంప్రదాయాలు.. పురాణాలు, ఇతిహాసాలు.. శ్రుతులు.. స్మృతుల పరంగా కలిగే మీ సందేహాలను క్లుప్తంగా రాసి మాకు పంపండి. మీ పేరు, చిరునామా, ఫోన్ నంబరు కూడా ప్రశ్నతో రాసి పంపండి. ప్రతి ప్రశ్నకు ఈ కూపన్ తప్పనిసరిగా జతపరచాలి. కూపన్ జతపరచని ప్రశ్నలు పరిగణనలోకి తీసుకోబోమని గ్రహించ మనవి.

చిరునామా : **చతుర ప్ర.జ.**

చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 082

అర్థం. శంకరులవారు కూడా తమ బ్రహ్మసూత్ర భాష్యంలో ఈ రెండు పదాలే ప్రయోగించారు. మరి ఇతర దేవతలు ఎవరు? ప్రధానదైవమే- సృష్టికర్త చతుర్ముఖ బ్రహ్మగా, స్థితికారకుడు శ్రీవిష్ణువుగా, లయకారుడు శివునిగా, పంచభూతాలకి అధిపతులు మరొక అయిదుగురు, శరీరంగా ఎనిమిది ధాతువులు, ప్రకృతి మండలంలో ఇరవై ద్రవ్యాలు- వీటికి దేవతా రూపాలు ఇలా 33 (కోట్ల-RANKED) దేవతలుగా రూపుదిద్దారు. 'ఏకం సత్.. విప్రాః బహుధా వదంతి' అన్న మాటకి ఇది కూడా ఒక వివరణ.

నిజంగా మన దేహం దేవాలయమే! కానీ శరీరంలో కొన్ని ద్రవ్యాలు తయారవుతాయి. మరి వాటిని మనం అనాదరిస్తామేమిటి? 'దేహము' అంటే మార్పు చెందునది. 'దేవ' అంటే ఆటలాడుట, మదము నిండుట, మోహము పెరుగుట, ప్రకాశించుట, జయము సాధించుట.. ఇన్ని అర్థాలున్నాయి. ఇతర మతాల ప్రకారం మానవులు పాపులు. మన మతం ప్రకారం దేవుళ్లు.

ప్ర. పుణ్యక్షేత్రాల సందర్శనలో కొంతమంది భక్తులు ప్రమాదాలకు గుర్రై, ప్రాణాలు కోల్పోతున్నారు. దీన్ని ఎలా అన్వయించాలి?

**– తాజీ ప్రసాద్,** చెన్నై

జ. ఎవరు, ఎంతకాలం, ఎపుడు, ఎక్కడ, ఎలా ఉంటారు? వెళ్తారు? ఇవన్నీ మానవ మేధస్సుకు అందే విషయాలు కాదు. దైవదర్శనానికి వెళ్తూ మరణం అంటున్నారు - చంద్రహాసుడిని చంపడానికి పంపాడు మంత్రి. కానీ అతడు చావలేదు. మానవచర్య కారణం. ప్రహ్లాదుని చంపడానికి ప్రయత్నించారు. కానీ దైవసంకల్పం వేరుగా ఉంది. చావు తప్పించుకోవాలనుకున్నాడు సైంధవుడు. కృష్ణుని చమత్కారం తెలిసిందే! ఇవన్నీ ఒకనాటివి. కాశీలోనే మరణించాలని సంవత్సరాలు గడిపి తిరిగి తన ఊరికి వచ్చాక యాదృచ్ఛికంగా మృత్యువాత పడినవారి సంగతులున్నాయి. మృత్యువుతో ఒకరిద్దరి సంవాదాలు, బ్రహ్మ సంభాషణ లాంటివి పురాణాల్లో ఉన్నాయి. 'నీ మేనల్లుడ్ని నువ్వు బతికించుకోలేవా?' అంటూ అర్జునుడు కృష్ణుడి మీద ధ్వజమెత్తాడు. పుణ్యక్షేత్రాలు, తీర్థాలలో అకాల మృత్యువుకు మానవ తప్పిదాలు సాకులు మాత్రమే! 'వేదశాస్త్రము ఎరిగినవారే తెలియరు దీని విలాసం - అల్పబుద్ధితో సృష్టికర్తనే సలుపకు పరిహాసం' అంటారు సీనియర్ సముద్రాల. జననమరణ రహస్యాలు వింగడించిన కఠోపనిషత్తు చదివితే మరిన్ని వివరాలు దొరుకుతాయి.

ప్ర. త్రేతాయుగంలో సూర్యవంశరాజులకు వసిష్ఠులు కులగురువు. ఆయన చిరంజీవియా? లేక ఇంద్రపదవిలా అది ఒక పదవియా? అయితే 'శక్తి' ఏ వశిష్ఠుని కుమారుడు?

**– వి.వి. సత్యనారాయణ శెట్టి,** తిరుపతి

జ. భగవంతుడు, దిక్పాలకులు, దేవతలు, నారదాది రుషులు వీరంతా చిరంజీవులే! ఇక వసిష్ఠుని వంటివారూ చిరంజీవులే! మరి వసిష్ఠుని చిరంజీవులలో ఎందుకు చేర్చలేదు? అంటే ఏదైనా సందర్భంలో ఒకరిని 'ఉత్తమ నటుడు'గా గుర్తిస్తే తక్కిన దిగ్గంతులందరూ ఉత్తమ నటులు కారని చెప్పలేం కదా! బలి, అశ్వత్థామ మొదలైనవారు కొన్ని ఘనకార్యాలు సాధించి చిరంజీవులుగా వరాలు పొందారు. వసిష్ఠుడు బ్రహ్మ మానసపుత్రుడు. ఆయన వల్లనే త్రేతా ద్వాపర యుగాల వరుస మారిందని అధ్యాత్మ రామాయణాదులు చెబుతున్నాయి. త్రేతాయుగంలో శ్రీమహావిష్ణువు శ్రీరాముడుగా అవతరి

## రూ.116/- బహుమతి పొందిన ఉత్తమ ప్రశ్న

ప్ర. భక్తులు రెండు బృందాలుగా ఏర్పడి విష్ణుసహస్రనామ పారాయణం చేస్తున్నారు. ఒక బృందం శ్లోకంలో ఒక పాదం, మరో బృందం రెండో పాదం చెబుతున్నారు. ఇలా అయితే ఒక్కొక్కరూ ఐదు వందల నామాలే పారాయణం చేసినట్లవుతోంది. అందరూ వెయ్యి నామాలు పారాయణం చేయాలి కదా! మరి ఇలా ఎందుకు చేస్తున్నారు?

– జి. రాజేంద్ర,
కామారెడ్డి, నిజామాబాద్ జిల్లా

జ. ఈ ప్రక్రియ శాస్త్ర సమ్మతమే! వెనకటి రోజులలో మహారాజులు, రుషులు, పెద్దలు యజ్ఞం చేసేవారు. యజమాని ఒక్కడే యజ్ఞంలో అన్ని కార్యక్రమాలు నిర్వహించలేడు కదా! వేదాలు పారాయణ చేస్తూ, హవిస్సులు ఇవ్వాలి. ఉపకరణాలు సమకూర్చాలి. మంత్రపఠనం ఒకరు, అనుబంధంగా ఉండే పూజలు కొందరు, ప్రబంధాలు, వేదాంగాలు, పురాణాలు పారాయణం కొందరు.. ఇలా! చేసేవారు. దీని వలన యజమానితో పాటు, అందరికీ ఆయా ఫలాలు లభించేవి. 'కర్తా, కారయితా, ప్రేరకః అనుమోదకః' అంటూ నలుగురికి ఫలస్వామ్యం చెప్పారు. తరువాతి కాలాల్లో 'సగము సమిధలు - సగము సావిత్రి' అంటూ ఛలోక్తి కూడా పుట్టింది. నామపారాయణకు ఈ ప్రక్రియలో దోషం లేదు. ఫలితం అందరిదీ!

తమిళనాట ఆళ్వారుల పాశురాలు (తెలుగులో పద్యాలు అనొచ్చు) పూర్తిగా పాఠం చెప్పే విధానమూ ఉంది. రెండవ పద్ధతిలో మొదటి సగం ఒకరు (బృందం) రెండవ సగం ఒకరు (బృందం) చదువుతారు. దీన్ని 'మున్నడి-పిన్నడి' అని అంటారు. ఎక్కువ మందికి పూజలో, పారాయణలో భాగస్వామ్యం, తద్వారా ఫలస్వామ్యం కలిగించే విధానం ఇది. ఆధునిక యుగంలో సమయమూ కలిసివస్తుందని సంబరపడవచ్చును.

---

స్తాడు. ఆ వంశానికి పురోహితునిగా ఉండాలని వసిష్ఠుని బ్రహ్మ అనుశాసించారు. ఇది కృత యుగం నాటి మాట! పౌరోహిత్యం, అందునా రెండుయుగాల పర్యంతం మానవలోకంలో ఉండటానికి అంగీకరించని వసిష్ఠుని కోసం యుగముల వరుస మార్చి చిరంజీవిత్వం ప్రసాదించారు, ఆయన ప్రాభవాన్ని గుర్తించిన బ్రహ్మ. ఇదంతా గాసట బీసటగా ఉన్న గాథ! వసిష్ఠుని వంశమే వ్యాస, శుకుల వరకు సాగింది. వసిష్ఠుడు కృతయుగం నుంచీ ఉన్న మహర్షి. ఆయన కుమారుడే 'శక్తి'. వసిష్ఠ, వ్యాస, ఇంద్ర మొదలైనవి పదవుల వంటివే! తరువాతి కల్పాలలో ఫలానావాడు ఇంద్రుడు అని చెప్పటం పురాణాలలో ఉంది.

ప్ర. స్త్రీలు ఆషాఢ మాసంలో గోరింటాకు పెట్టుకోవడంలో ఆంతర్యమేమిటి?

– ఎస్. విజయలక్ష్మి, ఒంగోలు

జ. ఆషాఢం పురుషోత్తమ మాసంగా ప్రసిద్ధి. శ్రీమన్నారాయణుడు ఈ నామంతో సంచరిస్తాడని ప్రతీతి. పూజలు, హోమములు, యాగములు వీటన్నింటితో కాలం గడపాలి అని విధి. ఈ సందర్భంలో బాలికలు, యువతులు, వివాహితులైన స్త్రీలు మొదలు వయసుదాటిన స్త్రీలందరకు గోరింటాకుతో అలంకరించుకొనడం ఆచారంగా విధించారు.

పెండ్లి అయిన స్త్రీలు భర్తచేసే పూజాపునస్కారాలలో సహకరిస్తూ తమను తాము సంస్కరించుకునే ప్రక్రియ ఇది. రెండవది అరచేయి, ముంజేయి, పాదము, అరికాలు శరీరమంతటికి వ్యాపించిన నాడీ మండలానికి ప్రతీకలు, వాహికలు. వర్షాకాల అనంతరం సంక్రమించే రుగ్మతులు ఆపడానికి, నాడులను ఉత్తేజ పరచడానికి గోరింటాకు లేపనం దోహదపడుతుంది. గోరింట పండే రీతిని బట్టి వారి వారి మానసిక, శారీరక స్థితులని ఆనాటి ఆయుర్వేద వైద్యులు తెలుసుకొనేవారు. జోతిష్యులు మంచి చెడులు చెప్పేవారు. అంతరార్థం ఎరగక దీనిని కేవలం అలంకారంగా భావిస్తున్నారు.

తరువాతి రోజులలో ఇతర దేశా లకీ ప్రాకింది. మనకి ఉత్తరభారతం ద్వారా మొ గలాయిల కాలంలో దిగుమతి అయింది. ఈనాడు లాంఛనంగా, అలంకారంలో ఒక భాగంగా ఆచరిస్తున్నాం. గోరింట స్థానంలో రసాయనాలూ చొరబడ్డాయి. గోరింటాకులో వాడే పసుపు, కాచు, ఆవునెయ్యి వంటి దినుసులు ఔషధ గుణాలు కలవని ఆయుర్వేద గ్రంథాలు చెబుతున్నాయి. ©

# భామనే.. సత్యభామనే..!

20

పదహారేళ్లకే మార్కెటింగ్ ఎగ్జిక్యూటివ్‌గా కెరీర్‌ను ప్రారంభించింది. ఇమామి, లిప్టన్ వంటి టీవీ ప్రకటనల్లో మెరిసింది. ఫెమినా మిస్ ఇండియా 2000లో రన్నరప్‌గా నిలిచింది. మిస్ ఏసియా పసిఫిక్ టైటిల్‌ను గెలుచుకున్న భారతీయ మొదటి మహిళగానూ పేరు పొందింది. 'రెహనా హై తేరా దిల్ మే' సినిమాతో బాలీవుడ్‌లో తెరంగేట్రం చేసి తనకంటూ ఓ పదిలమైన స్థానాన్ని ఏర్పరచుకున్న ఆ ముద్దుగుమ్మ.. మరెవరో కాదు.. దియా మీర్జా! ఆమె సౌందర్య రహస్యాలేంటో చూద్దాం..

## సొగసు చూడతరమా...



సినిమా పాత్రలను ఎంచుకోవడంలో ఎంత జాగ్రత్తగా ఉంటానో ఆరోగ్యం విషయంలోనూ అంతే జాగ్రత్తగా ఉంటాను. వ్యాయామానికి ఎక్కువ ప్రాధాన్యమిస్తాను. ఏరోజూ వ్యాయామం చేసేందుకు బద్ధకించను. ఇతర ప్రదేశాల్లో షూటింగ్ జరిగే సమయాల్లో వ్యాయామం చేసే వీలుండదు. అందుకే షూటింగ్ లేని సమయాల్లో వీలైనపుడల్లా ఈత కొడతాను. లేదా వర్కవుట్స్ చేస్తాను. ఇక ప్రతి రోజూ నడక, 45 నిమిషాల పాటు ట్రెడ్‌మిల్ మీద పరుగు చేస్తుంటాను.

త్వరగా బరువు పెరిగే శరీర తత్వం నాది. అందుకనుగుణంగా ఒక్కోరోజు ఒక్కో అవయవాన్ని దృష్టిలో పెట్టుకుని వ్యాయామం చేస్తుంటాను. ఒకేరకమైన వ్యాయామం చేయడం వల్ల బోర్ కొడుతుంది. అందుకే రకరకాల వ్యాయామాలను ఎంచుకుంటా. యోగా, ధ్యానం వంటివి చేస్తుంటాను. జిమ్‌కు వెళ్లడం ఇష్టం లేనపుడు డాన్స్ లేదా ఈతను ఎంచుకుంటా. ఈత కొట్టడం ద్వారా శరీర బరువు నియంత్రణలో ఉంటుంది. ఏ వ్యాయామం చేసినా ఓ గంట తప్పనిసరి. ఇవి చక్కని శరీరాకృతిని కలిగించడంలో

తోడ్పడతాయి.

రోజూ ఆరు నుండి ఏడు సార్లు తక్కువ మొత్తంలో ఆహారం తీసుకుంటాను. అయితే కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, చక్కెర పదార్థాలు తక్కువగా ఉండే విధంగా జాగ్రత్తపడతా. నా ఆహారంలో వండిన పదార్థాల కంటే పచ్చికూరగాయలే ఎక్కువగా ఉంటాయి! మాంసాహారం చాలా తక్కువ.

బరువు తగ్గేందుకు ఉపవాసాలు మార్గం కానే కాదు. అవి ఆరోగ్యానికి చాలా హానికరం. సరైన సమయానికి సరైన ఆహారం తప్పకుండా తీసుకోవాలి. అపుడే అందం ఆరోగ్యం!

టమాటా లేదా క్యారెట్ జూస్.. లేదంటే నిమ్మరసంతో నా దినచర్య ప్రారంభమవుతుంది. రోజులో వీలైనన్నిసార్లు నిమ్మరసం తాగుతాను. దీనివల్ల రోగనిరోధక వ్యవస్థ మెరుగుపడుతుంది. శరీరం నిర్జలీకరణం చెందకుండా ఉంటుంది. ఉదయం అల్పాహారం తప్పనిసరి. అల్పాహారంలో కోడిగుడ్డులో తెల్లనిభాగం, పళ్లరసం, గింజ ధాన్యాలు లేదా గోధుమలతో చేసిన బ్రెడ్, ఓ పండు ఉంటాయి. మధ్యాహ్న భోజనంలో పప్పు, కూరగాయలు, చపాతీ, చికెన్, పండ్లముక్కలు.. సాయంత్రం ఓ గ్లాసు తాజా పండ్ల రసం లేదా కప్పు గ్రీన్ టీ.. రాత్రి భోజనంలో సలాడ్, సూప్ ఉంటాయి.

ఎక్కువ రసాయనాలుండే కాస్మటిక్స్‌ను దూరం పెడతా. నెలకోసారి జుట్టుకు మసాజ్ చేయించుకుంటా. షాంపూ చేసుకున్న తర్వాత కండిషనర్ తప్పకుండా పెట్టుకుంటా. పూర్తిగా మేకప్ తీసిన తరువాతే నిద్రకుపక్రమిస్తా. బయటికి వెళ్లేముందు తప్పనిసరిగా సన్ బ్లాక్ క్రీమ్ రాసుకుంటాను.



ఒత్తిడిగా అనిపించినపుడు కూరగాయలు కోయడం, వంట చేయడం చేస్తుంటాను. ఇంకా పెయింటింగ్, చదవడం, రాయడం వంటివి చేస్తాను. అవి నాకు పునరుత్సాహం కలిగిస్తాయి!

సేకరణ : **సంధ్యారాణి**

## కొవ్వు కరిగే తేలికైన మార్గం..!

తేనె, అల్లం.. ఈ రెంటి మిశ్రమం బరువు తగ్గించడంలో బాగా ఉపకరిస్తుంది. మూడు చెంచాల తేనెలో రెండు చెంచాల అల్లం రసం కలిపి రోజుకు రెండుసార్లు సేవిస్తే, ఒక నెలలోనే బరువులో చాలా మార్పు కనిపిస్తుంది. గ్లూకోజు ఉత్పత్తిలో కాలేయానికి ఇంధనంలా పనిచేస్తుంది తేనె. అనవసరమైన కొవ్వు పదార్థాలను కరిగించే హార్మోన్ల విడుదలకు గ్లూకోజ్ ఉపకరిస్తుంది. అల్లం శరీర ఉష్ణోగ్రతను పెంచి కొవ్వును త్వరగా కరిగిస్తుంది.



## మహిళా శక్తి



**ఇంటిని నడిపించడంలో ఎదురయ్యే సమస్యలను అర్థం చేసుకున్న ప్రతి మహిళ దేశాన్ని పాలించడంలో ఎదురయ్యే సమస్యలను త్వరగా అర్థం చేసుకుంటుంది**

– మార్గరెట్ థాచర్



**నీకు అపారమైన తెలివితేటలుండొచ్చు, మంచి సంబంధాలుండొచ్చు, చక్కని అవకాశాలుండొచ్చు కానీ శ్రమ లేనిది విజయం సాధించలేవు**

– మార్థ ఇవాన్స్

# సౌయగం



చుండ్రు నివారణ

★ మెంతులు, వేపాకు చుండ్రు సమస్యకు చక్కని మార్గం. రెండు చెంచాల మెంతులు రాత్రంతా నానబెట్టాలి. వాటికి ఆరు వేపాకులు, అర కప్పు పెరుగు, సగం నిమ్మచక్క రసం చేర్చి మిక్సీ పట్టాలి. ఈ మిశ్రమాన్ని మాడుకు పట్టించి అరగంట తర్వాత షాంపూతో తల స్నానం చేయాలి. అయితే ఈ మిశ్రమాన్ని తలకు పట్టించే ముందు కొబ్బరినూనె రాసుకోవడం మరిచిపోవద్దు.

★ కొద్దిగా మిరియాలు కలిపి కొబ్బరినూనెను వేడి చేయాలి. తర్వాత దాన్ని వడపోసి జుట్టుకు, మాడుకు పట్టించి మసాజ్ చేయాలి. తర్వాత కొద్దిగా నిమ్మరసం లేదా యూకలిప్టస్ నూనె జుట్టుకు రాయాలి. అలా గంట లేదా రెండు గంటలు ఉంచి తలస్నానం చేయాలి.

★ క్రమం తప్పకుండా అలోవీరా గుజ్జును జుట్టుకు రాసుకుని ఓ పది నిమిషాల తర్వాత తలస్నానం చేస్తే చుండ్రు సమస్య పోతుంది.

# టెక్ గురూ!

## మై డాక్టర్ యాప్

వాతావరణంలో మార్పులు, ఆహారంలో మార్పులు, పనివత్తిడి.. మొదలైనవాటివల్ల తరచూ అనారోగ్యం పాలవుతుంటాం. కానీ సమయాభావం వల్ల వైద్యులను సంప్రదించడాన్ని ఎప్పటికపుడు వాయిదా వేస్తుంటాం. ఇంట్లోనే మనకు తెలిసిన చిట్కాలను పాటిస్తుంటాం. వ్యాధి ముదిరాక గానీ డాక్టర్ దగ్గరకు పరిగెత్తం. అలాకాకుండా ఉన్నచోట నుంచే క్షణాల్లో వైద్యుని సంప్రదించే చక్కని అవకాశం వచ్చింది మైడాక్టర్ యాప్ ద్వారా! మన ఆరోగ్యంలో ఏమాత్రం తేడా వచ్చినా వెంటనే వైద్యునికి తెలియజేసి చికిత్స పొందొచ్చు.




## స్మార్ట్ వాయిస్ లాక్ స్క్రీన్

ఇప్పటివరకూ ఫోన్ లాక్ చేయాలన్నా, లాక్ తీయాలన్నా కీప్యాడ్ ద్వారానే చేయాల్సి వచ్చేది. కానీ ఇపుడు చేతులతో పనిలేకుండా వాయిస్‌తోనే ఫోన్ లాక్, అన్‌లాక్ అయ్యేట్టుగా కొత్త యాప్‌ను రూపొందించారు. ఇతరుల ఫోనుల్లో కలిసిపోయినపుడు ఈ యాప్ ద్వారా మన ఫోన్‌ను తేలికగా గుర్తించవచ్చు. అంతేకాదు, ఇతరులకు మీ వాయిస్ పాస్‌వర్డ్ తెలియకూడదని అనుకున్నపుడు, వాయిస్ కమాండ్స్‌తో ఫోన్ అన్‌లాక్ చెయ్యలేని పరిస్థితుల్లోనూ అది శాశ్వతంగా లాక్ అయిపోతుంది. తర్వాత ప్రత్యామ్నాయ కీప్యాడ్ లాక్ స్క్రీన్ ఆప్షన్‌తో అన్‌లాక్ చేయొచ్చు.

## ఐపి టూల్స్

కంప్యూటర్ నెట్‌వర్క్స్‌లో ఎక్కడ సమస్య ఉందో ఐపి టూల్స్ యాప్ ద్వారా తేలికగా తెలుసుకోవచ్చు. సమస్య ఎక్కడనేది సరిగ్గా తెలిస్తే పరిష్కారమూ తెలిసిపోతుంది. ఈ యాప్ ఐటి ప్రొఫెషనల్స్‌కి బాగా ఉపయోగపడుతుంది.

ఈ యాప్స్‌ను గూగుల్ ప్లే నుంచి ఉచితంగా డౌన్‌లోడ్ చేసుకోవచ్చు.

# పురాణ విజ్ఞానం

పురాణాల్లో తారసపడే వీరి తండ్రి ఎవరో కనుక్కోగలరేమో చూడండి..

| | | |
|---|---|---|
| 1. | సతీదేవి తండ్రి? | జ. |
| 2. | ధ్రువుడి తండ్రి? | జ. |
| 3. | ప్రహ్లాదుని తండ్రి? | జ. |
| 4. | కర్ణుడి తండ్రి? | జ. |
| 5. | దేవయాని తండ్రి? | జ. |
| 6. | పద్మావతి తండ్రి? | జ. |
| 7. | అంగదుడి తండ్రి? | జ. |
| 8. | దమయంతి తండ్రి? | జ. |
| 9. | పరీక్షిత్తు తండ్రి? | జ. |
| 10. | ప్రద్యుమ్నుడి తండి? | జ. |

జవాబులు ఈ సంచికలోనే..




**నిజమే!**



భర్త: నేను పెద్ద ఫూల్‌ని, నిన్నెలా పెళ్లి చేసుకున్నానో నాకు అర్థం కావట్లేదు..

భార్య: నిజమే.. అపుడు ప్రేమలో పడి నేనూ ఆ విషయం తెలుసుకోలేకపోయాను.

**మీరు దిగరా?**

ప్రొఫెసర్లందరూ విమానమెక్కాక దీన్ని మీ విద్యార్థులే తయారు చేశారని చెప్పడంతో వాళ్లంతా పరుపరుగున దిగుతున్నారు. ఒక ప్రొఫెసర్ మాత్రం విమానం దిగకుండా అలాగే కూర్చున్నాడు.

పైలట్: అదేంటి సార్! విమానం పైకి ఎగిరాక ఎక్కడ కూలిపోతుందోనని భయపడి అందరూ దిగిపోతుంటే మీరు మాత్రం చలనం లేకుండా కూర్చున్నారేంటి?



ప్రొఫెసర్: ఇది మా విద్యార్థులే తయారుచేశారు కాబట్టి కచ్చితంగా పైకెగరదు!

**ఏం మర్చిపోయావు?**

ఎగ్జామినర్ : ఎందుకంత టెన్షన్‌గా ఉన్నావు? హాల్‌టికెట్ గానీ, కాలిక్యులేటర్ గానీ మర్చిపోయావా?



విద్యార్థి : లేదు సర్.. హడావుడిలో ఈరోజువి కాక రేపటి పరీక్షకు సంబంధించిన కాగితాలు తెచ్చాను!

# మైసూర్‌పాక్



*తయారుచేసే పద్ధతి*

వెడల్పాటి గిన్నెలో శనగపిండిని తీసుకుని సన్నని మంట మీద బంగారు వర్ణం వచ్చేవరకు వేయించుకోవాలి. దాన్ని మరో గిన్నెలోకి తీసుకుని చల్లారనివ్వాలి. తర్వాత ఒక పాన్‌లో పంచదార నీరు కలిపి వేడిచేయాలి. పంచదార కరిగేవరకూ గరిటెతో తిప్పాలి. పంచదార పూర్తిగా కరిగాక మంట తగ్గించి పాకం వచ్చేవరకు ఉంచాలి. పాకం కొద్దిగా నీళ్లలో వేసి గడ్డ కడుతుందో లేదో చూడాలి. గడ్డ కట్టినట్లయితే పాకం వచ్చినట్లే. ఇపుడు వేయించిన శనగపిండిని పాకంలో వేసి బాగా కలుపుతూ ఉండాలి. రెండు నిమిషాల తర్వాత నెయ్యి కూడా



అందులో వేసి కలపాలి. నెయ్యి పూర్తిగా పిండిలో కలిసిన తరువాత మంట తీసేయాలి. ఒక ట్రేకు నెయ్యి రాసి అందులో ఈ మిశ్రమాన్ని పోసి అంతా సమానంగా ఉండేట్లు ట్రేను అటూఇటూ కదిలించాలి. దానిపై కొద్దిగా పంచదార చిలకరించాలి. అది పూర్తిగా చల్లారిన తరువాత ఇష్టమైన ఆకారంలో మైసూర్‌పాక్‌ను కట్ చేసుకుని ఆరగించేయడమే!

## కావలసిన పదార్థాలు

- శనగపిండి - 1 కప్పు
- నెయ్యి - 1 కప్పు
- పంచదార - 1 కప్పు
- నీరు - 1 కప్పు

## నిద్ర రావడంలేదా?



వేళకు సరైన నిద్ర లేకపోతే అనేక ఆరోగ్య సమస్యలు ఎదురవుతాయి. కానీ కొందరికి పడుకోగానే నిద్ర పట్టదు. దీనికి చక్కని చిట్కా ఒకటుంది. నెమ్మదిగా గాలి పీల్చి వదలాలి. అలా ఓ ఐదారు సార్లు చేసేసరికి మీకు తెలియకుండానే నిద్రలోకి జారుకుంటారు.

## పురాణవిజ్ఞానం జవాబులు :

1. దక్షుడు, 2. ఉత్థానపాదుడు, 3. హిరణ్యకశిపుడు, 4. సూర్యుడు, 5. శుక్రాచార్యుడు, 6. ఆకాశరాజు, 7. వాలి, 8. భీమమహరాజు, 9. అభిమన్యుడు, 10. కృష్ణుడు

## చిట్కాలక్ష్మి



- ★ వెనీలా ఎస్సెన్స్‌లో దూదిని తడిపి ఫ్రిజ్‌లో ఓ మూల ఉంచినట్లేయితే లోపల ఎటువంటి వాసనా రాదు.
- ★ గట్టిపడిన గమ్‌లో కొన్ని చుక్కలు వెనిగర్ వేస్తే అది తిరిగి ఎప్పటిలా జిగురుగా మారి ఉపయోగించేందుకు వీలుగా ఉంటుంది.
- ★ పెసరపిండిలో నిమ్మరసం కలిపి తోమితే వెండి సామాన్లు తళతళలాడతాయి.

అన్నీ సరైన సమాధానాలు రాసిన
వారిలో డ్రా ద్వారా ఎంపికైన
ఈ విజేతకు రూ.150/-
త్వరలోనే అందుతాయి.

**ఎం. అరుణ రేఖ**

ఇంటి. నెం. 3-9-303,
చింతల్‌కుంట, సరస్వతీనగర్,
ఎల్. బి. నగర్, హైదరాబాద్
పిన్ : 500074

## చతురంగం - 54 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 టం | 2 క | సా | 3 ల | | 4 గ | 5 రి | 6 మ | నా | 7 భి |
| 8 గు | త్రి | | 9 క్ష | మ | | 10 వా | ది | | క్షు |
| టూ | | 11 బా | ణం | | 12 పుం | జు | | 13 గో | వు |
| 14 రి | 15 బూ | స | | 16 తా | డు | | 17 వా | లు | |
| | 18 జు | లు | 19 ము | | | 20 ఆ | యు | వు | 21 లు |
| 22 చే | లు | | 23 దు | 24 కా | ణం | | లీ | | బ్ధు |
| మ | | 25 ప | రు | వు | | 26 అ | నం | 27 గు | డు |
| 28 కూ | 29 జా | లు | | 30 కా | 31 మా | క్షి | | హు | |
| 32 ర | మా | | 33 అ | వు | ను | | 34 వే | డు | 35 క |
| | 36 త | మ | న్నా | | 37 కో | డ | లు | | పి |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. ఎస్.టి.పి. కృష్ణమాచార్యులు, నాగోలు, 2. సి.జి. శంకరరావు, ఎ.ఎస్. రావు నగర్, 3. వాన పల్లి వెంకటసత్యగంగరాజు, విశాఖపట్నం, 4. ఎం. పల్లవి, బోరబండ, 5. అడపా సత్యనారాయణ బాబ్జీ, కూకట్‌పల్లి, 6. వి.వి. సత్యనారాయణ శెట్టి, తిరుపతి, 7. ఎస్.వి. క్రిష్ణ, టోలిచౌకి, 8. కరణం శివానందరావు, కర్నూలు, 9. ధరణి పద్మాసన, నల్లకుంట, 10. చిల్లర సీతారామారావు, వనస్థలిపురం, 11. జి. జయచంద్రగుప్త, కర్నూలు, 12. మహమ్మద్ ఖాసిం, కల్లూరుగూడెం, ఖమ్మం జిల్లా, 13. జి. శిరీష, తిరుపతి, 14. డా. ధరణి పార్థసారథి, నల్లకుంట, 15. డా. శివభూషణం, కర్నూలు, 16. పప్పు శ్రీదేవి, అమలాపురం, 17. పి.వి. రమణారావు, విశాఖపట్నం,18. చందు తులసి, శ్రీకాకుళం, 19. గోగాడ ఝాన్సీ, మహారాష్ట్ర, 20. పసుమర్తి జయశ్రీ, మౌలాలి, 21. కన్నేపల్లి నారాయణమూర్తి, జీడిమెట్ల, 22. బచ్చు సత్యనారాయణ, కొత్త గూడెం, 23. యు.యు.యు. ఎమ్మిగనూరు, 24. దేవరాజు వెంకట నరసింహారావు, చైతన్యపురి, 25. పి. దేవసేనమ్మ, హైదరాబాద్, 26. యు. చిట్టిబాబు, న్యూ పాల్వంచ, 27. వి. దేవేంద్ర, నల్లకుంట, 28. సిహెచ్. శివశంకరశాస్త్రి, లింగంపల్లి, 29. ఎల్. రేణుక, చందుపట్ల, నల్గొండ జిల్లా, 30. పి.వి.ఎల్.ఎన్. సూర్యసంతోషి, కొత్తపేట, 31. యు. విజయశేఖరరెడ్డి, కూకట్‌పల్లి, 32. పొన్నపల్లి వెంకటప్పయ్య, సరూర్‌నగర్, 33. డా. జనార్ధనసింగ్, నల్లకుంట, 34. జి. ముత్తు మారన్, చర్లపల్లి, 35. ఆమంచర్ల సరస్వతి, హైదరాబాద్, 36. గౌరిపెద్ది రాజ్యలక్ష్మి, సోమాజిగూడ, 37. కె.వి. దుర్గామోహన్‌రావు, వనస్థలిపురం, 38. తిప్పావఝల తులశమ్మ, ఈస్ట్ ఆనంద్‌బాగ్, 39. కె.వి. రమణ, ఆసిఫ్‌నగర్, 40. ఎ. రంగనాథం, బెంగళూరు, 41. కె. ప్రభావతీదేవి, నెల్లూరు, 42. పాలకుర్తి సుధీర్‌కుమార్, మాదాపూర్, 43. ఉపద్రష్ట నరసింహమూర్తి, లాలాపేట, 44. పి.ఆర్. నాయుడు, తిరుపతి, 45. అత్తిలి కస్తూరిభాయి, తిరుపతి, 46. కె. నాగభూషణం, మౌలాలి, 47. విన్నకోట పద్మావతి, సఫిల్‌గూడ, 48. మద్దూరి లక్ష్మి రాజ్యం, ఎర్రగడ్డ, 49. టి. ఉషశ్రీ, దగదర్తి, నెల్లూరు జిల్లా, 50. గండ్లూరి బలరామశాస్త్రి, మల్లాపూర్, రంగారెడ్డి జిల్లా, 51. పేర్వేల రాంబాబు, మణికొండ, హైదరాబాద్, 52. ఇవటూరి శారదాదేవి, మినిమించిపాడు, ప.గో. జిల్లా, 53. జె. స్వర్ణగౌరి, కర్నూలు, 54. యమ్. అలమేలు, మల్కాజిగిరి, 55. ఎన్. ప్రేమలత, హైదరాబాద్,56. పి.వి. సుబ్బలక్ష్మి, విశాఖపట్నం, 57. ఎస్.వి.వి.ఎస్. పద్మావతి, కాకినాడ, 58. గరికిపాటి శ్రీచైతన్యకృష్ణ, కాకినాడ, 59. మండవ రవికుమార్, కొత్తగూడెం, 60. నల్లు సునీత, హనుమకొండ, 61. పి. వంశీ కిశోర్, భూపాలపల్లి, వరంగల్ జిల్లా, 62. మహావాది అశోక్‌కుమార్, హైదరాబాద్, 63. కనకల అప్పారావు, విజయవాడ, 64. టి.ఎల్.ఆర్. ప్రసాదరావు, మచిలీపట్నం, 65. కణుగుల గ్రీష్మ, శ్రీకాకుళం, 66. వక్కలంక విజయలక్ష్మి, సికింద్రాబాద్, 67. సిహెచ్.వి.ఎల్. పద్మావతి, విజయనగరం, 68. ఓలేటి కస్తూరి, పార్వతీపురం, 69. చింతపల్లి నాగేశ్వరరావు, విజయవాడ, 70. జె. జయశ్రీ, ట్రూప్‌బజార్, 71. కె. సుబ్రమణ్యం, అనంతపురం, 72. ఎస్. కల్పన, సీతాఫల్‌మండి, 73. నియాజ్ అలి, హైదరాబాద్, 74. కోలా సత్యనారాయణ, విశాఖ, 75. రామకూరు లక్ష్మి, శ్రీకాకుళం, 76. ఆర్.వి.సిహెచ్. నాగేశ్వరరావు, శ్రీకాకుళం, 77. పెనుమచ్చ నాగేశ్వరి, తుని, తూ.గో. జిల్లా, 78. కొత్తపల్లి సుధాదేవి, చీరాల, 79. వి.వి.వి. సత్యనారాయణ, ఎస్.ఆర్. నగర్, 80. జి. కుసుమకుమారిదేవి, పెడన, కృష్ణా జిల్లా, 81. మండ సూర్యకుమారి, అరసవల్లి, 82. పువ్వాడ కమలారజని, గుంటూరు, 83. బోడపాటి కృష్ణవేణి, చెన్నై, 84. మల్లవరపు శ్రీనివాసరావు, నెల్లూరు, 85. పెద్దిరాజు గాయత్రిదేవి, రాజమండ్రి, 86. పి. సుజాతశాస్త్రి, గుంటూరు, 87. వి. రవీందర్, వరంగల్, 88. జి. రమాకాంత్, చిత్తూరు, 89. ఆండ్ర అచ్యుతరామయ్య, తణుకు, 90. తోటపల్లి శశికళ, గుంతకల్లు, 91. టి. సత్యనారాయణమూర్తి, ఖమ్మం, 92. పంతం తమ్మయ్యదొర, గెద్దనాపల్లి, తూ.గో. జిల్లా, 93. బొడ్డేటి తులసీరామ్, విశాఖ, 94. పి.వి. రమణారావు, మల్కాజిగిరి, 95. ఎస్. లక్ష్మిదేవమ్మ, కడప, 96. ఎ.వి. రామకృష్ణ, కాట్రేనికోన, 97. ఎ. రామకృష్ణ, జీడిమెట్ల, 98. కె. వెంకుబాబు, గుంటూరు, 99. వేదుల నరసింహమూర్తి, గుడిమల్కాపూర్, 100. సముద్రాల సంతోష్‌కుమార్, కొడిమ్యాల, కరీంనగర్ జిల్లా, 101. తటవర్తి రామకృష్ణ, హైదరాబాద్, 102. కె. చంద్రశేఖర శర్మ, నంద్యాల, 103. శైలజాజానకి, మంగళగిరి, 104. నున్న లక్ష్మివెంకటసత్యనారాయణ మూర్తి, యర్రవరం, తూ.గో. జిల్లా, 105. ఎస్.ఆర్.కె. మూర్తి, విజయవాడ, 106. పరుచూరి భవానీదేవి, గుంటూరు, 107. సిహెచ్.వి.ఎస్.ఎల్. రాజేశ్వరి, కాకినాడ, 108. సిహెచ్. కోటయ్యశాస్త్రి, కాకినాడ, 109. దండు రామరాజు, మెరకముడిదాం, విజయనగరం జిల్లా, 110. గరికిపాటి కృష్ణమూర్తి, కడప, 111. గుర్రాల పద్మావతి, విశాఖ, 112. ఎ.వి. శివారెడ్డి, యర్రగుంట్ల, కడప జిల్లా, 113. పి.బి. సీతాదేవి, నరసాపురం, ప.గో. జిల్లా, 114. పెద్ది దత్తాత్రేయ, రేచిని, ఆదిలాబాద్ జిల్లా, 115. పక్కి శ్రీదేవి, మెట్టపల్లి, విజయనగరం జిల్లా, 116. కొత్తపల్లి ప్రసాదరావు, టెక్కలి, 117. కాకర్లమూడి కృష్ణప్రసాదు, తణుకు, 118. ఎ. స్వరూపరాణి, గుంటూరు, 119. ఉడాలి భాస్కరయ్య, చెన్నై, 120. బిక్కునూరి రాజేశ్వర్, ఈడ్‌గాం, ఆదిలాబాద్ జిల్లా, 121. తల్లాప్రగడ సాయిశిరీష, రాజమండ్రి, 122. సూరి నాగరాజు, రామవరప్పాడు, కృష్ణాజిల్లా, 123. కొల్లూరు వేంకటరమణమూర్తి, పర్లాకిమిడి, ఒడిశా, 124. వి. రామమో (..128లో)

# చతురంగం - 55 ఆధారాలు

## అడ్డం

1. బరువు (2)
3. మేలు కలిగించేది (5)
6. 'సెల్‌ఫోన్' కు తెలుగు (4)
8. 'మెదడు, బుఱ్ర లేదా?' అనడాన్ని 'ఇది' లేదా? అంటారు (2)
10. ఛందోబద్ధమైన నాలుగు పాదాలు కలది - తెలుగుభాషకే ప్రత్యేకం (2)
11. వదరడాన్ని ఇలా అంటారు (4)
13. ఏడుకొండలవాడి పట్టణం (4)
15. దెబ్బ, ప్రహారం, (2)
16. 'ఈగ' చిత్రం హీరో (2)
17. కీడు, హాని (2)
18. ఉండేచోటు, నివాసం లాంటిదే (3)
20. మాసం (2)
21. వేసవి వస్తే కరెంటు - - తప్పదు (2)
22. స్త్రీ (2)
23. అడ్డం 22 మరో రూపంలో (2)
24. శ్రీవైష్ణవమత స్థాపకుడు (5)
25. ఇంగ్లీషులో కాలేయం (3)
27. వరూధిని మనసు దోచినవాడు (4)
28. స్వర విన్యాస విశేషం, పూనిక, ప్రయత్నం (3)
29. రుక్మిణి సోదరుడు (2)
31. హనుమంతుడ్ని ఇలా కూడా అంటారు (3)
32. 'ఐ' గుణింతం మొదలు పెట్టండిక - - - (3)
33. పందెం (2)

## నిలువు

1. భాగ్యనగరం ఈమె పేరుమీద నిర్మితం అయింది (4)
2. తెలుగులో గుడ్‌విల్, పేరు ప్రతిష్ఠ లాంటిదే (4)
3. తరగతి, వరుస, విభాగం (2)
4. రుజువు, సాక్ష్యం (3)
5. యంత్రం మృదువుగా నడిచేందుకు ఉపయోగించే చమురు (3)
7. సంగీత ఉపకరణం (2)
9. దేవుడి ఉత్సవం, జాతరను ఇలా అంటారు (4)
11. శవం , పీనుగు (2)
12. 'తండ్రి గరగర.. తల్లి పీచుపీచు..' ఏ పండుమీద పొడుపు కథ? (3)
14. కార్యం, క్రియ (2)
15. ఎంత - - ప్రేయయో? (2)
17. - - వెన్నముద్ద (2)
18. బలిచక్రవర్తిని అణచినవాడు (4)
19. ఇష్టంలేనివాడు గందరగోళమయ్యాడు (4)
20. జాతీయపక్షి (3)
21. అడవి (2)
22. 'భామనే సత్యభామనే' చిత్రంలో ఒక పాట ఇలా మొదలవుతుంది(5)
23. రసంతో మొదలైన అందమైన స్త్రీ (4)
24. వానదేవుణ్ణి రమ్మని పిలవండి (4)
26. షడ్రుచుల్లో ఇదొకటి (3)
30. వినాయకుడి పూజలో వాడేది తలకిందులు (2)

(127వ పేజీ తరువాయి...)

హనరావు, హైదరాబాద్, 125. పి. రాఘవరెడ్డి, మహబూబ్‌నగర్, 126. ఉప్పల వెంకటరమణయ్య, కడప, 127. బి. మనోజ్ఞదీప్తి, ఘట్‌కేసర్, 128. ఎస్. మణిమేగలై, తిరుపతి, 129. ఎస్. విమలామూర్తి, జనగాం, 130. ఆర్. బాలాజీరావు, మియాపూర్, 131. లింగబత్తుల భవ్యశ్రీ, ఆర్.సి. పురం, 132. వి. ఇందిరా సుబ్రమణ్యాం, సోమాజీగూడ, 133. ఎం. లక్ష్మీసుజాత, గుడివాడ, 134. జె. రాజగోపాలరావు, ఎ.ఎస్. రావు నగర్, 135. రామచంద్రుని ఇందిరాదేవి, వనస్థలిపురం, 136. తనికెళ్ల మంజుల, సికింద్రాబాద్, 137. ఆర్. శ్రీగౌరి, నోయిడా, ఉత్తరప్రదేశ్, 138. టి.ఆర్. బాలకృష్ణారావు, రాజమండ్రి, 139. కె. లక్ష్మీనారాయణ, నిజామాబాద్, 140. వాసా లీలాపద్మావతి, విశాఖ, 141. కరిపె రాజ్‌కుమార్, ఖానాపూర్, 142. ఇయ్యుణ్ణి రోహిణి, తణుకు, 143. కె.వి.ఎస్.ఎన్. మూర్తి, హైదరాబాద్, 144. టి. మహనందప్ప, మైదుకూరు, 145. ధప్పూరి సుధాదేవి, సీతారాంబాగ్, 146. కొత్తపల్లి ప్రసాదరావు, టెక్కలి, 147. తాత క్రిష్ణమూర్తి, తారాపురం, విజయనగరం జిల్లా, 148. దొడియం లక్ష్మీప్రసన్న, నాచారం, 149. పాలగుమ్మి సుచేత్, ఒంగోలు, 150. చివుకుల లక్ష్మి, రాజమండ్రి, 151. పెరుంబుదూరి అంబగిరిస్వామి, మొగలిపేట, కరీంనగర్ జిల్లా, 152. ఎస్. లీలా ప్రసూనాదేవి, సికింద్రాబాద్, 153. యాబలూరి మానస, తెనాలి, 154. నందం గాయత్రీదేవి, బొండాడ, ప.గో. జిల్లా, 155. వి. మురళీకృష్ణ, పుంగనూరు, 156. మోతుకుల భాగ్యలక్ష్మి, బద్దెనపల్లి, కరీంనగర్ జిల్లా, 157. సి. నిర్మల, తిరుపతి, 158. చక్రవర్తి మధుసూదనరావు, వికారాబాద్, 159. బద్దెపూడి లక్ష్మీసుశీల, చీరాల.

# చతురంగం - 55

రూ.150/- బహుమతి

గడువు తేది : అక్టోబరు 17

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | ■ | 2 | ■ | 3 | | 4 దా | | 5 |
| | ■ | 6 | | 7 | | ■ | | ■ | |
| 8 | 9 | ■ | 10 | | ■ | 11 | | 12 | |
| 13 | | 14 | | ■ | 15 ఘూ | | ■ | | ■ |
| ■ | 16 | | ■ | 17 | | ■ | 18 | | 19 |
| 20 | | ■ | 21 | | ■ | 22 భా | | ■ | ఖు |
| | ■ | 23 | | ■ | 24 | | | | |
| 25 | 26 | | ■ | 27 | | | | ■ | |
| ■ | 28 | | | ■ | 29 | | ■ | 30 | ■ |
| 31 | | | ■ | 32 | | | ■ | 33 | |

పంపినవారి పేరు: ----------------------------------------

వయసు (      ) చిరునామా : ----------------------------------

----------------------------------------------------------------

------------------ పిన్ : ------------ ఫోన్ : ------------------

## నిబంధనలు

✦ చతురంగాన్ని ఇదే పేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలించం. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు. ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. ✦ చతురంగంతోపాటు చతుర, విపుల కూపన్లు అన్నీ ఒకే కవరులో పంపవచ్చు.

చిరునామా : చతురంగం **చతుర**, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82

ఫోన్ : 040 - 23318181, Ext : 6658, 6532

# విశిష్ట కథాపుష్పాల కదంబం ఈనెల విపుల

* విశ్వకవి రవీంద్రనాథ్ టాగూర్ విరచితం.. ప్రపంచ సాహిత్యంలోనే కథా పారిజాతం **ప్రభూ! మీ బిడ్డ ఇదుగో!!**
* మాతృదేశంపై ప్రేమ ఏ ఒక్క సైనికుడికో పరిమితమైంది కాదని చాటి చెప్పిన **కర్తార్‌సింగ్ దుగ్గల్** పంజాబీ కథ **దేశభక్తి**
* వ్యాపారం గుజరాత్ సంస్కృతిలో భాగం. ఆ వ్యాపారానికి **వినోద్ భట్** ఓ వ్యంగ్య వినోదాత్మక కోణాన్ని జోడించిన కథ **అంగట్లో మగడు!**
* చావు, పుట్టుకలకు అతీతంగా అనుబంధాల అల్లికతో **కె.ఆర్. మీర** మలయాళ కథ **ఉయ్యాల మంచం**
* 'ఒడియా సాహిత్యంలో కూడా నవలలు, నాటికలు ఉంటాయా? 'అనే ప్రశ్న ఆ అమ్మాయిదే కాదు.. నవతరానిది కూడా.. దానికి జవాబే **భువనేశ్వర్ బెహరా** **సహ అస్తిత్వం**




* ఒక ఉదయం.. రెండు తుపాకీ గుళ్ళు.. వెంట్రుకవాసిలో తప్పిన గండం..!? **కరెల్ కాపెక్** చెక్ కథ **ఎవరు?**
* సుప్రసిద్ధ కథకుడు **చెకోవ్** రష్యా కథ **పశ్చాత్తాపం**
* నోబెల్ గ్రహీత **మో యాన్** చైనా కథ **ఎగిరిపో చెల్లీ!**

ఇంకా.. అక్టోబరు సంచికలో..

* మధురాంతకం రాజారాం **జీవన్ముక్తుడు** కథకుల ఫైల్‌లో..


Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, No. 7-134 / 1& 2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally - 500 072, R.R District, Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 9959021802; Rajahmundry: 2468992; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 241101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 9959021804; Khammam: 9959021806; Nizamabad: 245661; Mahabubnagar: 8008706125; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28242036; Bangalore: 25599686. Toll Free Help line No. 18004258888 (Hyd.), www.eenadu.net.

చతుర నవంబరు పాఠకులకు

# ట్రిపుల్ ధమాకా!

## ఆ రాత్రి లాంచి ప్రయాణమెలా సాగింది?

రాజమండ్రి నుండి భద్రాచలం వెళ్లే 'సీతారామాంజనేయ' లాంచి సిద్ధంగా ఉంది..

పిల్లాపెద్దలతో లాంచి కిక్కిరిసిపోయింది..

కట్టుతాడు వదిలేశాడు కళాసీ.. నావల్ని తప్పించుకుంటూ లాంచి వడిలో పడింది..

ఉన్నట్టుండి చక్రం తిప్పుతున్న సరంగుకి లాంచి ఓ పక్కకి లాగుతున్నట్టనిపించింది..!

'డ్రైవరుగార్ని ఇంజనాపి పంకాను సూసి రమ్మను, లాంచి నడకలో ఏదో తేడాగా ఉంది' కళాసీకి చెప్పాడు సరంగు..

'లాంచి పంకాలో ఓ రెక్క విరిగిపోయిందటండి.. డ్రైవరుగారు చెప్పారు' సరంగుతో చెప్పాడు కళాసీ కంగారుపడుతూ..

ఆ తర్వాతేమైంది? లాంచి ప్రయాణం ఎలా సాగింది? ఆ రాత్రి ప్రయాణికుల పరిస్థితేంటి? లాంచి ప్రయాణంలో అల్లుకున్న అనుబంధాలకు.. కోనసీమ ప్రజల ఆహారవ్యవహారాలకు అక్షర చిత్రణ సుప్రసిద్ధ సీనియర్ రచయిత

బి.వి.ఎస్. రామారావు నవల

**సీతారామాంజనేయ లాంచి సర్వీసు**



**బోనస్‌గా...**

మరో రెండు నవలికలు

- సోమర్‌సెట్ మామ్ (ఆంగ్ల) **విలువ**
- జాయ్ సీ (మలయాళ) **మేడ్ ఇన్ హెవెన్..**
- బలమైన నాటకీయతతో ముక్కోణపు ప్రేమకథను ఉద్వేగభరితంగా నడిపిన మంథా వెంకటరమణారావు నవల **తృష్ణ**

నవలావలోకనంలో..

